శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



శ్రీ కులశేఖరాళ్వారులు అనుగ్రహించిన

# ముకుందమాలా

(శిన్నాము శ్రీరంగనాథాచార్య ప్రణీత మణిప్రవాళవ్యాఖ్యాయాః ఆంధ్రానువాదేన సహితా)



బంకే బిహారి, బృందావనం



'పండితరత్న' డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు



శ్రీకృష్ణుడు, మథురా



శ్రీకృష్ణుడు, ద్వారక

# విన్నపం

ఈ ముకుందమాల అనే స్తోత్రాన్ని సంస్కృతంలో రచించినవారు కులశేఖరాళ్వార్లు. వీరు, ఇప్పుడు, తిరువనంతపురం రాజకుటుంబంలో అవతరించిన ఒక ప్రభువు. వీరు నాలాయిర దివ్యప్రబంధ వాఙ్మయంలోని మొదటి సహస్రంలో అంతర్భవించిన పెరుమాళ్ తిరుమొ*ழி* అనే ప్రబంధాన్ని కూడా రచించారు అని చాలామంది అభిప్రాయపడుతున్నారు. మరికొంతమంది కులశేఖరులు అనే పేరు కలిగిన వేరొక కవిచేత ఇది రచింపబడి ఉండవచ్చు– అని భావిస్తున్నారు దీనికి కారణాన్ని ఈ విధంగా వారు తెలియజేస్తున్నారు. కులశేఖరులు సహజంగా, వారి చరిత్రనుబట్టి చూస్తే, రామభక్తులు. వారి ప్రబంధంలో కూడా పలుచోట్ల శ్రీరాముని చరిత్ర అధికంగా వర్ణింపబడింది. కానీ ఈ ముకుంద మాలలో ఎక్కడా శ్రీరాముని ప్రసక్తి కనిపించదు. అందుచేత ఈ స్తోత్రం వేరొక కవి చేత రచింపబడి ఉండవచ్చు అని వీరి అభిప్రాయం. కానీ, ఈ కులశేఖర ఆళ్వార్లు అనుగ్రహించిన పెరుమాళ్ తిరుమొ*ழி* ప్రబంధంలోని పలు దశకాలలో శ్రీకృష్ణుని వైభవం గొప్పగా వర్ణింపబడి ఉండడం మనం గమనించవచ్చు. అందుచేత, ఈ విషయంలో కొంతమందికి అభిప్రాయ భేదం ఉన్నప్పటికీ, పెరియ వాచ్చాన్ పిళ్ళై మొదలైన పూర్వాచార్యులు ఇందులోని కొన్ని సూక్తులను తమ గ్రంథాలలో ప్రమాణంగా స్వీకరించడాన్ని బట్టి, ఇది కుల శేఖరాళ్వారుల చేతనే రచింపబడినదని భావించే అవకాశం ఉన్నది.

నాలాయిర దివ్య ప్రబంధ వాఙ్మయాన్ని లోకానికి అందించిన ఆళ్వారులలో వీరు, కాలక్రమాన్ని బట్టి, వరుసలో ఏడవవారు. వీరి ముకుంద మాల అనే స్తోత్రాన్ని, పెరుమాళ్ తిరుమొవ*ழி* అనే ప్రబంధాన్ని గమనించినప్పుడు, సంస్కృత ద్రావిడ భాషలలో వీరు అసాధారణమైన పాండిత్యాన్ని కలవారు అని తెలుస్తున్నది.

చోళదేశంలో ప్రచారంలో ఉండే ఈ స్తోత్ర పాఠంలో 40 శ్లోకాలు ఉన్నాయి. ఈ స్తోత్రంలోని చివరి శ్లోకంలో ఈ స్తుతిని రచించినవారు కులశేఖరులు అనే విషయాన్ని స్వయంగా ఈ కవియే తమ పేరును నిర్దేశించడం ద్వారా సూచించారు. ఈ విధంగా ప్రబంధంలో తమ పేరును అనేది సూచించడం మిగిలిన ఆళ్వారుల ప్రబంధాలలో కూడా మనకు గోచరిస్తుంది.

ఉత్తరదేశంలోని ఈ స్తోత్రపాఠంలో కొంత తేడా ఉన్నట్లు కనిపిస్తున్నది. క్రీ. శ. 1886వ సంవత్సరంలో నిర్ణయ సాగర్ ప్రెస్ ద్వారా కావ్యమాలా పరంపరలో బొంబాయినగరంనుండి ముద్రింపబడిన ప్రతిలో కేవలం 34 శ్లోకాలు మాత్రం ఉన్నాయి. చివరిలో అధికంగా ఎనిమిది శ్లోకాలు, కులశేఖరులు రచించినవిగా భావించదగినవి, చేర్చబడ్డాయి ఈ విధంగా ఈ స్తోత్రపాఠంలో కొంత భేదం ఆయా ప్రాంతాలను బట్టి కనిపిస్తున్నది. కానీ, ఆసేతు హిమాచలం ఈ స్తోత్రానికి గల ఆదరం వేరొక ఏ స్తోత్రానికి లేదనేది నిర్వివాదం. అంతేకాక, శ్రీవైష్ణవ సంప్రదాయంలో ఆదరింపబడే, ఇప్పుడు మనకు లభించే పూర్వాచార్య స్తోత్రాలలో ఇది మొట్టమొదటిది అని కూడా చెప్పవచ్చు.

ఈ స్తోత్ర ప్రయోజనం ఏమి? అంటే, స్వధర్మజ్ఞానవైరాగ్యాలతో సాధ్యం అయ్యే భక్తియోగాన్ని సాధించదలచిన వారికి ప్రతి దినం ముఖ్యంగా, అత్యంత ఆవశ్యకంగా, అనుసంధించవలసిన స్తోత్రమై ఇది వెలుగుతున్నది. అంతేకాదు ఈ శ్లోకంలోని శబ్దార్థమాధుర్యం ఎటువంటివారినైనా ముగ్ధులను చేస్తుంది. ఇందులోని భావాల తీయదనం అనుభవైకవేద్యం.

"ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞైః త్రేతాయాం ద్వాపరేఽర్చయన్,
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్"

ఇది వ్యాసమహర్షి అనుగ్రహించిన ఒక సూక్తి. కృతయుగంలో ధ్యానం చేయడం ద్వారా, త్రేతాయుగంలో యజ్ఞాలను చేయడం ద్వారా, ద్వాపరయుగంలో అర్చామూర్తిని ఆరాధించడం ద్వారా ఏ ఫలాలను పొందుతామో, వాటిని అన్నిటిని కలియుగంలో భగవంతుని నామాలను అనుసంధించడం ద్వారా మనం పొందుతాము అనేది ఈ

శ్లోకంలోని తాత్పర్యం. అందుచేత కలియుగంల భగవన్నామానుసంధానం చాలా ముఖ్యం. నామ సంకీర్తనంతో ధ్యానం ద్వారా, యజ్ఞ యాగాల ద్వారా, అర్చామూర్తి ఆరాధన ద్వారా పొందే ఫలాలను అన్నిటిని మనం పొందవచ్చు. భక్తితో చేసే నామ సంకీర్తనంతో కలియుగంలో సంభవించే పాపాలు తొలగిపోతాయి. కలిసంతారణోపనిషత్తులో ఈ విషయం స్పష్టం చేయబడింది. ఇటువంటి భగవన్నామ సంకీర్తనవైభవాన్ని మనకు ఫలు శ్లోకాలలో ఈ స్తోత్రం తెలియజేస్తున్నది.

ఇంతేకాక, ఈ స్తోత్రంలో శ్రీవైష్ణవ సంప్రదాయానికి, విశిష్టాద్వైత సిద్ధాంతానికి సంబంధించిన పలు తత్వాలు మనకు గోచరిస్తాయి. ముఖ్యంగా, ఈ స్తోత్రం శరణాగతిశాస్త్రప్రతిపాదకం అనే విషయం మనకు ఇందులో స్పష్టమవుతుంది. అందుచేత ఇది ద్వయమంత్రార్ధాత్మకం, అందుచేత నిత్యానుసంధేయం.

ఇటువంటి నిత్యానుసంధేమైన, మధురమైన స్తోత్రానికి పలువురు మహనీయులు వ్యాఖ్యానాలను అందించారు. కాంచీ వాస్తవ్యులు ప్రతివాదిభయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారు ద్రావిడంలో, శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామివారు మొదలైన పెద్దలు ఆంధ్రభాషలో ఇందులోని రస్యరహస్యబ్దాలను మనకు తెలియజేశారు.

ఈ స్తుతికి సంస్కృత భాషలో ఎవరూ వ్యాఖ్యానాన్ని రచించినట్లు తెలియడం లేదు. కానీ, మణిప్రవాళ భాషలో ఒక అపూర్వమైన వ్యాఖ్యానం సుమారు 107 సంవత్సరాల క్రితం ముద్రింపబడింది. దీనిని కుంభకోణం శ్రీపట్టరాచార్యులవారి వీధిలో నివసించే శ్రీ శిన్నాము రంగనాథాచార్యస్వామివారు రచించారు. వీరు దేశికుల స్తోత్రాలకు అన్నిటికీ ఈ విధంగానే మణిప్రవాళ శైలిలో చాలా విశదమైన సహృదయ రంజకాలైన వ్యాఖ్యానాలను రచించారు. భట్టర్ అనుగ్రహించిన శ్రీగుణ రత్న కోశం అనే స్తోత్రానికి కూడా వీరు మణిప్రవాళ శైలిలోనే వ్యాఖ్యను రచించినట్లు తెలుస్తున్నది. కానీ, అది లభించలేదు. ముద్రించినట్లుకూడా తెలియదు.

ఈ వ్యాఖ్యలోని విశేషం ఏమంటే, పూర్వాచార్యుల దివ్యప్రబంధవ్యాఖ్యాన శైలిలో ఈ వ్యాఖ్యానం సాగింది. ప్రతి శ్లోకానికి, దాని ముందు శ్లోకానికి, తరువాత శ్లోకానికి కల సంగతిని చాలా అందంగా వీరు నిరూపించారు. అందుచేత ఈ స్తోత్రం ద్రావిడభాషలోని అందాది ప్రబంధంవంటిది అని చెప్పదగి ఉన్నది. అందాది ప్రబంధాలు అర్థాన్ని బట్టి, శబ్దాన్ని బట్టి రెండు విధాలుగా ఉంటాయి అని చెప్పబడుతున్నది కదా. ఈ స్తోత్రం అర్థాన్నిబట్టి అందాది ప్రబంధంగా చెప్పదగినది.

ప్రస్తుతం ఈ వ్యాఖ్యకు ఆంధ్రానువాదం ఆస్తికపాఠకుల సన్నిధిలో సమర్పింపబడుతున్నది. అనువాదంలోని గుణదోషాలకు సహృదయ పాఠకులే సాక్షి. నిజానికి ఈ అనువాద ప్రయత్నం ఇప్పటిది కాదు. సుమారు ఆరు సంవత్సరాల క్రితమే ఈ వ్యాఖ్యానం అనువాదం చేయబడింది. కానీ, మధ్యలో ఏర్పడిన అనుకోని కొన్ని అవాంతరాల వల్ల ఈ ప్రయత్నం వాయిదా పడింది. ఇప్పటికైనా ఇది కార్యరూపాన్ని దాల్చడానికి కేవలం ఆచార్యానుగ్రహం, ముకుందుని అనుగ్రహమే కారణమని భావిస్తున్నాను

ఈ గ్రంథాన్ని అందంగా రూపొందించాలని దాసుని కుమారుడు, పరమపదవాసి శ్రీమాన్ అనంతరంగరామన్ చాలా ఆశపడ్డాడు. కొంత ప్రయత్నం కూడా చేశాడు. కానీ, ఇంతలో ఏమి తొందర వచ్చిందో! ఏమో! తెలియదు. హఠాత్తుగా భగవంతుని నిత్యకైంకర్యంకోసం, అందరం చూస్తూ ఉండగానే, వెళ్ళిపోయాడు. అతనికి తృప్తి కలిగిస్తుంది అనే ఉద్దేశంతో, అతని భవ్యస్మృతిగా ఈ గ్రంథం ప్రకాశింపజేయబడుతున్నది. ఈ ప్రయత్నంలో నాకు చాలా సహకరించిన సహృదయులు చిరంజీవి శ్రీమాన్ కేశవ అయ్యంగారికి అనేక మంగళా శాసనాలు. స్వస్తి.

భాగవతదాసుడు,
ఈ. ఏ. శింగరాచార్యులు

**శ్రీ కులశేఖరాళ్వారులు అనుగ్రహించిన**

# ముకుందమాలా– సవ్యాఖ్యానమ్

**(శ్రీశిన్నాము రంగనాథాచార్యస్వామివారి మణిప్రవాళవ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం)**

★★★★★★★

ముకుందమాలా కులశేఖరోక్తా
ముకుందపాదాబ్జ పరిష్క్రియైషా |
శ్రీశింగరార్యేణ గిరాంఽద్రమయ్యా
విద్వజ్జనానాం వివృతా ముదేఽస్తు॥

రంగనాథార్య సంప్రోక్తం హృద్యార్థచయసంభృతమ్ |
వ్యాఖ్యానం ద్రావిడం స్మృత్వా వ్యాఖ్యైషా కలితా మయా II

★★★★★★★

శ్రీవాసుయోగీంద్రపదాబ్జభృంగా
తన్నామఝంకారసుధాప్రవాహైః |
సించంతు మే కర్ణయుగం భవంతః
పాదాంబుజం వ శ్శిరసా వహామి ॥

యం సమాలంబ్య ఖేలంతి సర్వోత్కృష్టదయాగుణాః |
సన్న్యాసభక్తిప్రముఖాః తం వందే శ్రీనిధిం గురుమ్ ॥

బాల్యే వేదవతంస లక్ష్మణమునీరక్షాభరస్యార్పణం
కృత్వా రంగిపదారవిందయుగళే విద్వత్సమక్షం ముదా ॥
ధన్యో నైకజనో భవిష్యతి వరం వ్యక్త్వా నయేత్యాదరాత్
యస్యానుగ్రహ మాతనోద్గురుమణిం శ్రేయోనిధిం తం శ్రయే ॥



## కులశేఖరాళ్వారుల తనియన్ శ్లోకం

## ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే।
## తమహం శిరసా వందే రాజానం కులశేఖరమ్।

యస్య = ఏ కులశేఖరులయొక్క, నగరే = పట్టణంలో, దినే దినే = ప్రతి దినం, రంగయాత్రా = శ్రీరంగమును గూర్చిన ప్రయాణం, ఘుష్యతే = మ్రోగుచున్నదో, తం = ఆ, కులశేఖరం = కులశేఖరులని ప్రసిద్ధి చెందిన, రాజానం = రాజును, శిరసా = శిరస్సులో, అహం = నేను, వందే = నమస్కరిస్తున్నాను.

ఏ కులశేఖరుల నగరంలో శ్రీరంగయాత్ర ప్రతిదినం ఉద్ఘోషింపబడుతున్నదో, ఆ కులశేఖరులనే ప్రభువును సేవిస్తున్నాను.

**(ఘుష్యత ఇతి)**

"సర్వాతిశాయిషాడ్గుణ్యం సంస్థితం మంత్రబింబయోః"

అనే విధంగా షాడ్గుణ్య పరిపూర్ణుడై, సులభుడై, మోక్షప్రదుడై, అర్చారూపియై ఉండే శ్రీరంగనాథుని పదకమలంలో అత్యంత భక్తియుక్తులై, శ్రీరంగానికి వెళ్ళి, పెరియ

పెరుమాళ్ళను సేవించకుండా ప్రజాపాలనమనే ధర్మంలో వ్యాపృతులై ఉన్నా, శ్రీరంగనాథుని సేవించాలనే ఆశలోని అత్యంతాభినివేశం చేత

"తిరువరంగ పెరునకరుళ్ తెణ్ణీర్ పొన్ని
తిరైక్కైయాల్ అడివరుడ ప్పళ్ళికొళ్ళుమ్
కరుమణియై క్కోమళత్తై కణ్డుకొణ్డు
ఎన్ కణ్ణిణైకళ్ ఎన్ఱుకొలో కళిక్కునాళే! "

(శ్రీరంగంలో నిర్మలజలాన్ని కల కావేరి, తన కెరటాలనే చేతులతో సంవాహనం చేయగా, ఆదిశేషునిపై నిద్రించే నీలరత్నసమానవర్ణుడై, కోమలాంగుడైన శ్రీరంగనాథుని కళ్ళార దర్శించి ఆనందించేవాడను కాగలిగేది ఎపుడో ?") అని, భరతాళ్వాన్

“యావ న్న రామం ద్రక్ష్యామి లక్ష్మణం వా మహాబలమ్,
వైదేహీం చ మహాభాగాం న మే శాంతి ర్భవిష్యతి”

(శ్రీరాముని మహాబలుడైన లక్ష్మణుని మహానుభావురాలైన సీతను నేను చూసే వరకు నాకు శాంతి కలుగదు)

అని పల్కినట్లుగా, ఉచ్చైఃస్వరంతో “రంగయాత్రా రంగయాత్రా” అని ప్రలాపిస్తూ, ప్రతిదినం శ్రీరంగయాత్రను చేయాలని కులశేఖరులు ఆశపడగా, దానిని విని "యథా రాజా తథా ప్రజా” (రాజు ఏ విధంగా ఉంటాడో, ప్రజలు కూడా ఆ విధంగానే ఉంటారు) అనే విధంగా ఆ నగరంలోని జనులు కూడా,

"మేఘశ్యామో మహాబాహుః స్థిరసత్త్వో దృఢవ్రతః, ,
దృష్ట ఏవ హి న శ్శోక మపనేష్యతి రాఘవః,

తమ స్సర్వస్య లోకస్య సముద్యన్నివ భాస్కరః,
ఇత్యేవం కథయంత స్తే సంప్రహృష్టాః కథా శ్శుభా:”

(మేఘం వలె నల్లనివాడు, గొప్ప బాహువులను కలవాడు, స్థిరమైన సత్వాన్ని కలిగినవాడు, దృఢమైన శరణాగత రక్షణ అనే వ్రతాన్ని కలిగినవాడు, అయిన శ్రీరాముని మనం చూసిన వెంటనే, అతడు, ఉదయించే సూర్యుడు లోకంలో ఉండే చీకటిని తొలగించినట్లు, మన శోకాన్ని తొలగించగలడు)

అని అయోధ్యాపురజనులు శ్రీరాముని దర్శనంలోని అత్యాశచేత కోలాహలం చేసినట్లుగా, "మనం శ్రీరంగానికి పోయి, శ్రీరంగనాథుని దర్శించి, ఆనందిద్దాం", - అని శ్రీరంగయాత్రను అనుదినం ఉద్ఘోషించగా, ఆ ధ్వని అంతటా వ్యాపించింది- అని తాత్పర్యం.

**(యస్య నగరే రంగయాత్రా దినే దినే ఘుష్యతే)** - ఆళ్వార్లచే, నగరంలోని జనులచే- అని భావం.

**(తం రాజానం కులశేఖరమ్)** - భగవద్భక్తకులానికి శేఖరభూతులై ఉన్నందున కులశేఖరులనే తిరునామాన్ని కల ఆళ్వార్లు -అని భావం.

**(శిరసా వందే)** - తలవంచి సేవిస్తున్నాను.



## అవతారిక

ఈ ప్రబంధకర్త కులశేఖరాళ్వార్లు. వీరు క్షత్రియకులంలో అవతరించి, రాజ్యపాలన చేస్తూ ఉన్నా, దానిలో అత్యంతం సంగం లేనివారై,

"ఆత్మా రాజ్యం ధనం చైవ కళత్రం వాహనాని చ,
ఏతత్ భగవతే సర్వమితి తత్ ప్రేక్షితం సదా"

(ఆత్మ, రాజ్యం, ధనం, భార్యల, వాహనాలు మొదలైనవి భగవంతుని కోసమే అని అతనిచే భావింపబడినది)అని,

"స పాదుకాభ్యాం ప్రథమం నివేద్య చకార పశ్చాత్ భరతో యథావత్"

(ఆ భరతుడు ప్రతి విషయాన్ని రామపాదుకలకు ముందుగానే నివేదించి, తర్వాత యథాప్రకారం కార్యనిర్వహణను చేసేవాడు) ఇత్యాదిగా రాజ్యపాలనను భగవదర్పణం చేస్తూ, కైంకర్యబుద్ధితో రాజ్యభారాన్ని నిర్వహించారు –అని,

"ఉపమాన మశేషాణాం సాధూనాం య స్సదా భవత్"

(సాధువులకు అందరికీ ఉదాహరణం ప్రహ్లాదుడు అయ్యాడు) అనే రీతిలో పరమైకాంతులైన జనకాంబరీషాది రాజులకుకూడా ఉపమానస్థానీయులై, తమకు భగవదనుభవంలో ఆలంబనంగా శ్రీవైష్ణవులను చేసికొని, వారితో సదా సహవాసం చేస్తూ ఉండేవారు.

ఒక పర్యాయం రాజార్హమైన హారం ఒకటి కనపడలేదు. అపుడు మంత్రులు మొదలైనవారు శ్రీవైష్ణవులే దానిని దొంగిలించారని అన్నారు. “శ్రీవైష్ణవులు ఆ పనిని చేయరు. ” అని సర్పమున్న కుండలో చేయి పెట్టి ప్రమాణం చేశారు. కుండలోని సర్పం. కులశేఖరుల నిర్వికారచిత్తాన్ని చూచి కాటు వేయలేదు. శ్రీవైష్ణవులపట్ల కులశేఖరులకు గల ప్రావణ్యం అంత గొప్పది.

ఒకసారి కులశేఖరులు శ్రీరామాయణాన్ని శ్రవణం చేస్తూ ఉండగా,

“చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
ఏకో రామో హి ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి!"

(భయంకరమైన పనులను చేసే రాక్షసులు 14 వేల మంది. ధర్మాత్ముడైన రాముడు ఒక్కడే. వీరి మధ్య యుద్ధం ఏవిధంగా జరుగుతుందో కదా!) అని పల్కినట్లుగా కపటయుద్ధం చేయడం మొదలైన భీమకృత్యాలను చేసే రాక్షసులు పధ్నాలుగు వేల మంది, ధర్మయుద్ధాన్ని చేసే స్వభావాన్ని కల రాముడొక్కడే. ఏమవుతుందో! ఏమో! - అని వాల్మీకి భగవాన్ భీతిల్లిన విషయాన్ని విన్నారు. వెంటనే సైన్యాన్ని సన్నద్ధం చేసికొని, చేతిలో ఖడ్గాన్ని ధరించి, అశ్వారూఢులై రాక్షసులను జయించివస్తానని అనగా, మంత్రులు మొదలైనవారు "అయ్యో! ఇపుడు వీరిని ఏ విధంగానైనా ఈ ప్రయత్నం నుండి విరమింప జేయాలి” అని తలచి,

“తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్,
బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే”

(శత్రువులైన రాక్షసులను సంహరించి, మహర్షులకు ఆనందాన్ని కలిగించిన ఆ శ్రీరాముని చూడగానే సీతకు చాలా ఆనందం కలిగింది. అతనిని ఆమె కౌగిలించుకున్నది)

అనేవిధంగా శ్రీరాముడు రాక్షససంహారాన్ని చేసి విజయంతో తిరిగి రాగా, సీతాదేవి అతని యుద్ధవ్రణాలు ఆరిపోయేటట్లు తన సుఖోష్ణమైన స్తనతటాలతో ఆలింగనం చేసికొన్నది- అనే కథను కులశేఖరులకు తెలిపారు. దానిని విని కులశేఖరులు యుద్ధసంభ్రమం నుండి విరమించారు. ఈ విధంగా ఈ ఆళ్వార్లు శ్రీరాముని విషయంలో ఒడలు మఱచిపోయే రీతిలోని ప్రావణ్యాన్ని కలవారు.

ఇంతేకాక, "గోసహస్రప్రదాతారమ్" (వేలాది గోవులను, అంటే, సమృద్ధిగా దానం చేసేవాడు) అని,

"రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్"

(రూపంలోని గొప్పతనంతో, గొప్ప గుణాలతో జీవుల దృష్టిని, చిత్తాన్ని దోచేవాడు) అని శ్రీరాముడు మహోదారుడైనట్లే, “కొడైక్కులశేఖరన్” (ఉదారులైన కులశేఖరులు) అని మహోదారులు.

“పౌరాన్ స్వజనవన్నిత్యం కుశలం పరిపృచ్ఛతి"

(శ్రీరాముడు తన రాజ్యంలోని ప్రజలను, తన సంతానాన్ని పలకరించినట్లు, నిత్యం క్షేమాన్ని గురించి అడిగేవాడు) అనే శ్రీరామునివలె పౌరజనులను ప్రీతితో ప్రతిదినం కుశలప్రశ్నలను అడుగుతూ, ధర్మానుసారంగా రాజ్యపాలనం చేశారు.

“సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్”

(శ్రీరాముడు విశాలమైన నేత్రాలను కలిగిన తన భార్య అయిన సీతతో కలసి నారాయణుని అర్చించాడు) అనేవిధంగా శ్రీరంగనాథుని విషయంలో శ్రీరామునివలె "రంగయాత్రా దినే దినే" అని, "ఆరమార్బన్ అనంతన్ నరకాంతకన్ పిత్తన్" (హారాలు కలిగిన వక్షఃస్థలాన్ని కలవాడు, అనంతుడు, నరకుని వధించినవాడు, భక్తుల విషయంలో వ్యామోహం కలవాడు) అని పలికేటట్లుగా శ్రీరంగనాథుని విషయంలో ప్రావణ్యాన్ని కలవారు. అందువల్ల కులశేఖరులనే పేరును కలవారై,

"ఇన్బురువుమ్ శెల్వముమ్ ఇవ్వరశుమ్ యాన్ వేణేన్"

(ఆనందాన్ని కల్గించే సంపదను, ఈ రాజ్యాధికారాన్ని నేను కోరను) అని ప్రాప్తమైన సంపదను, రాజ్యాన్ని కోరకపోవడమేకాక,

"ఎమ్బెరుమాన్ పొన్మలైమేల్ ఏదేను మావేనే"

(శ్రీవేంకటేశుని కొండపై ఏ వస్తువుగానయినా కావాలి) అని వేంకటాద్రిపై పక్షిగా అయినా, మత్స్యంగా అయినా, స్థావరంగా అయినా పుట్టాలి- అనే అధ్యవసాయాన్ని కలవారై, దశరథచక్రవర్తి తన కుమారుని బాల్యలీలలను అనుభవించి, యౌవనంలో అతనిని అరణ్యానికి పంపిన తరువాత ఆక్రోశించినట్లు

"మన్నుపుకழ் కౌశలైతన్ మణివయిర్ వాయ్ త్తవనే! "

(స్థిరమైన కీర్తిని కల కౌసల్యాదేవి యొక్క మణివంటి గొప్ప గర్భాన్ని పొందినవాడా! ") అని ఆరంభించి, "ఇరాకననే! తాలేలో! " అని జోలపాట మొదలైన శ్రీరాముని బాల్యలీలలను అనుభవించి, తరువాత దశరథ చక్రవర్తి భావాన్ని పొంది,

“వెన్ తాళ్ –ఎమ్మిరామా! వో! ఉన్నై ప్పయన్ద కైకేశితన్ శొల్ కేట్టు
నన్డాక నానిలత్తై యాళ్విత్తేన్ నన్ మకనే! యున్నై నానే ”

(శ్రీరామా! కైకేయి మాటను విని, రాజ్యాన్ని నేను చక్కగానే పరిపాలించానే! అయ్యో, )

“పెరుమ్ పావియేన్, మకనే! పోకిన్డాయ్ కేకైయర్ కోన్ మకళాయ్ ప్పెఱ్ఱ
అరుమ్బావి శొల్కేట్ట అరువినైయేన్ ఎన్ శెయ్ కేన్? అన్దో! యానే! "

(అయ్యో! నేనంతపాపిష్టివాడను! కుమారా! నీవు అరణ్యాలకు వెళుతున్నావే! మహాపాపి అయిన కైకేయి మాటలను వవిన్నవాడను అయ్యానే!ఏమి చేయను?)

అని ఈ విధంగా పది పాశురాలలో ఆక్రందించి, క్లేశపడి, “ఆలైనీళ్ ” అనే దశకంలో కూడా శ్రీకృష్ణుని బాల్యలీలలను అనుభవించలేక, విలపించిన దేవకీదేవి స్వభావాన్ని పొంది,

“నన్దన్ పెఱ్ఱనన్, నల్వినై యిల్లా నజ్గళ్ కోన్ వశుదేవన్ పెఱ్ఱిలనే”

(బాలకృష్ణుని అనుభవాన్ని అంతటిని ముందగోపాలుడు పొందాడు అదృష్టంలే నాకు స్వామి అయిన వసుదేవుడు పొందలేకపోయాడు)

“దెయ్ వ నంగై యశోదై పెఱ్ఱాళే"

(దివ్యకాంత అయిన యశోద బాలకృష్ణుని అనుభవాన్ని పొందింది)

అని శ్రీకృష్ణుని లీలలను నందుడు దర్శించాడు, దుర్భాగ్యశాలి అయిన నా భర్త వసుదేవుడు దర్శించలేకపోయాడు, యశోద ఆనందించింది; నేను ఆనందించలేక

పోయాను" అని దివ్యకాంత దేవకీదేవి విలపించిన విలాపం "దెయ్ వ ద్దేవకి పులమ్బియ పులమ్బల్" అనే దేవకీదేవి క్లేశాన్ని పొందినట్లే, ముకుందమాల ఆరంభానికి ముందు ముకుందవిరహంవల్ల క్లేశాన్ని పొంది, బాధపడుతూ ఉండగా,

"ప్రియం జన మపశ్యంతీం పశ్యంతీం రాక్షసీగణమ్,
స్వగణేన మృగీం హీనాం శ్వగణేన వృతామివ"

(తనకు ఇష్టమైన శ్రీరాముని చూడలేకుండా ఉన్నది, భయాన్ని కలిగించే రాక్షస స్త్రీలను చూస్తూ ఉన్న ది అయిన సీతాదేవి, తన జాతి సమూహనుండి దూరంగా విడివడినదై, వేట కుక్కల గుంపుతో చుట్టబడి ఉండే జింక వలె ఉన్న ది)

అని సీతాదేవి శ్రీరాముని విశ్లేషించి, క్లేశపడినపుడు, "ఏకాక్షీ, ఏకకర్ణీ, తిర్యఙ్నాసికా, అనాసికా" మొదలైన పలువురు రాక్షస స్త్రీలచే పీడింపబడినట్లే,

"సుతదుహితృకళత్రస్నేహ భారార్దితానామ్"

(పుత్రులు, కుమార్తెలు, భార్యలు మొదలైనవారిపై ఉండే ప్రేమభారంచేత పీడింపబడినవారు)

అనేవిధంగా పలువిధాలైన సంసారబంధాలతో పీడితులై,

"ఉద్గాయతీనా మరవిందలోచనం వ్రజాంగనానాం దివ మస్పృశద్ధ్వనిః"

(బిగ్గరగా శ్రీకృష్ణుని గురించి గానం చేసే గోపకన్యల ధ్వని ఆకాశాన్ని అంటింది)

అని శ్రీకృష్ణుని విశ్లేషంలో గోపికలు విలపించినట్లే, నమ్మాళ్వార్లు,

"పామరు మూవులకమ్ పడైత్త పఱ్పనాబా! వో,
పామరు మూవులక మళన్ద పఱ్పపాదా! ఓ! "

(అనేక పదార్థాలతో నిండి ఉండే ముల్లోకాలను సృష్టించిన ఓ పద్మనాభా! విశాలమైన మూడు లోకాలను కొలిచిన, తామర పువ్వువంటి పాదాలను కలవాడా!)

అని విలపించినట్లే, భగవన్నామాలను పల్కుతూ ఆక్రందించినట్లే, “శ్రీవల్లభ! వరదే”త్యాది నామాలను పదేపదే పల్కి విలపించడానికి కూడా శక్తి లేని నాకు నీ తిరునామాలను నేను ఉచ్చరించగలిగేటట్లు నీవే శక్తిని కృపను జేయాలి- అనే భావంతో ఈ మొదటి శ్లోకాన్ని అనుగ్రహిస్తున్నారు,

**1) శ్రీవల్లభేతి వరదేతిదయాపరేతి**

**భక్తప్రియేతి భవలుణ్ఠన కోవిదేతి।**

**నాథేతి నాగాశయనేతి జగన్నివాసే–**

**త్యాలాపనం ప్రతిపదం కురు మే ముకున్ద! ॥**

ముకుంద = ఓ ముక్తిని ఇచ్చువాడా!, శ్రీవల్లభ + ఇతి = లక్ష్మీదేవికి ప్రియుడా –అని, దయాపర + ఇతి = దయాగుణము ప్రధానముగా కలవాడా –అని, భక్తప్రియ + ఇతి = భక్తులకు ప్రియుడా –అని, భవలుంఠనకోవిద + ఇతి = సంసారం అనే పాశాన్ని త్రెగగొట్టడంలో నేర్పుగలవాడా –అని, నాథ + ఇతి = ప్రభూ –అని, నాగశయన + ఇతి = ఆదిశేషునిపై శయనించినవాడా –అని, జగత్ + నివాస + ఇతి = ప్రపంచమునకు ఆధారమైనవాడా –అని, ఆలాపనం = స్మరణ చేయడం అనేది, మే = నాకు, ప్రతిపదం = యెల్లప్పుడూ, కురు = ప్రసాదించు.

వ్యాఖ్య : పురుషకారస్వరూపిణి అయిన లక్ష్మితో భగవానుడు ఫలప్రదానోన్ముఖుడై ఉండే రీతిని చూచి, ఆ గుణాలలో అభినివేశాన్ని పొంది, దానిని ముందుగా పల్కుతున్నారు.

**(శ్రీవల్లభేతి)** - "శ్రియో వల్లభః, శ్రీ వల్లభా యస్య సః" అనే తత్పురుషసమాస, బహువ్రీహి సమాసాలనే రెండిటి ద్వారా దివ్యదంపతుల "స్వా ధైకరస్యా త్తయా" అనే ఐకరస్యం తెలుపబడింది. ఈ ఐకరస్యం లేకపోతే ఆశ్రితఫలసిద్ధి కలుగదు కదా! ఈ అర్థాన్ని

"శ్రియో వల్లభ" - ఇతి విగ్రహే "నిత్యానుకూలం స్వతః" ఇత్యాది ప్రసిద్ధస్వభావాయా శ్రియో ఽ ప్యసౌ నిత్యనిరతిశయభోగ్య ఇతి దర్శితం స్యాత్, శ్రీర్వల్లభా యస్యేతి విగ్రహే తు, ప్రియతమయా తయా నివేదితం న ప్రత్యాఖ్యాతీతి ఫలతి. ఈదృశం చాభిమతత్వం

“న జీవేయం క్షణమపి వినా తా మసితేక్షణామ్, న త్వహం తాం వినా సీతాం జీవేయం హి కథంచన, కశ్చి న్న తద్ధేమసమానవర్ణమ్”, “కుశలీ యది కాకుత్ స్థః”, “మత్కృతే కాకమాత్రే తు”, “యది రామ స్సముద్రాంతమ్”, “దుష్కరం కృతవాన్ రామః" ఇత్యాదిభిః తాత్పర్యవృత్త్యా గమ్యతే”

(లక్ష్మీదేవికి వల్లభుడు అనే తత్పురుష సమాసానికి తగిన విగ్రహాన్ని చెబితే, "నిత్యానుకూలం స్వతః" అని మొదలైన ప్రమాణాలలో ప్రసిద్ధమైన స్వభావం కలిగిన లక్ష్మికి కూడా ఇతడు చాలా భోగ్యమైనవాడు– అనే అర్థం వస్తుంది. లక్ష్మీదేవి ఇతనికి ఇష్టమైనది– అనే బహువ్రీహి సమాసానికి తగిన విగ్రహాన్ని చెప్పినట్లయితే, స్వామికి చాలా ఇష్టమైన ఆమెచేత నివేదింపబడినదానిని దేనిని కూడా భగవంతుడు తిరస్కరించడు– అని తెలుస్తున్నది. ఇటువంటి అభిమతత్వం "నల్లని కన్నులను కలిగిన ఆ సీతాదేవిని విడచి నేను ఒక క్షణం కూడా ఉండలేను" అని, " ఆ సీతాదేవిని విడచి నేను ఏ విధంగానూ జీవించలేను" అని మొదలైన సూక్తులలోని తాత్పర్యంవల్ల తెలుస్తున్నది)

అని గద్యభాష్యంలో దేశికులు అనుగ్రహించారు. సర్వేశ్వరునకువలె ఉపేయత్వంతో పాటు, పురుషకారత్వం, దేవతాంతరవ్యావర్తకత్వం ఈమెకు అధికంగా ఉన్నందున లక్ష్మిని పురస్కరించుకొని పల్కుతున్నారు. “తిరువిల్లా త్తేవరై త్తేఱేల్ మిన్ తేవు" అని లక్ష్మి లేని దైవానికి దైవత్వం కూడా లేదని అన్నారు కదా, తిరుమழிశై ఆళ్వార్లు. ఇక్కడ భగవానునకు కల లక్ష్మీవాల్లభ్యాతిశయం వివక్షితం. ఈ వాల్లభ్యం లేకపోతే పురుషకారత్వం ఫలించదు. పురుషకారం లేకపోతే, ముకుందుని ఆశ్రయించి ప్రార్థించడానికి జీవుడు తన అపరాధబాహుళ్యాన్ని చూచి, భయపడవలసి వస్తుంది కదా! లక్ష్మణుడు కూడా "సీతాసమక్షం కాకుత్ స్థ మిదం వచన మబ్రవీత్" అని సీతాపురుషకారాన్ని పురస్కరించుకొనే కదా, శ్రీరాముని ప్రార్థించాడు. ఆ రీతిలోనే వీరు (ఆళ్వార్లు) కూడా లక్ష్మిని ముందుంచుకొని “ఆలాపనం ప్రతిపదం కురు మే ముకుంద! (ప్రతి పదంలోనూ నీ నామానుసంధానాన్ని నాకు అనుగ్రహించు) అని ప్రార్థిస్తున్నారు. పురుషకారస్వరూపిణి అయిన లక్ష్మికి భగవంతుని పట్ల కల వాల్లభ్యం ఎటువంటిది అంటే-

తండ్రి, ఒక్కొక్కప్పుడు కలుషిత (కోప) మనస్కుడై, చేతిలో చెత్తాన్ని పట్టుకొని శిక్షించడం ఆరంభిస్తే, తల్లి, భర్తపట్ల తనకు గల వాల్లభ్యం చేత భర్తచేతిలోని దండాన్ని తీసివేసి, సంతానాన్ని శిక్షించడంనుండి అతనిని నివర్తింపజేసేటట్లు, సర్వేశ్వరుడు. జీవునకు ఉండే అపరాధ భూయస్త్వాన్ని చూచి, శిక్షించడం ఆరంభిస్తే, "న కశ్చిన్నాపరాధ్యతి" అని పల్కి, శిక్షించడం ఆరంభించిన సర్వేశ్వరుని ఆ శిక్షనుండి నివర్తింపజేయడానికి ఉపయోగపడుతుంది, ఈ వాల్లభ్యం. పురుషకారభూత అయిన భూదేవి శిక్షోద్యోగాన్ని (శిక్షించే ప్రయత్నాన్ని) విరమింపజేస్తుంది. అటువంటిది ఆ వాల్లభ్యం. నీళాదేవి తన భోగపటలాలతో జీవునితో దోషదర్శనమే కలుగకుండా చేస్తుంది. దోషాన్ని చూచినపుడు కదా, శిక్షిస్తాడు. ఈ అర్థాలను శ్రీదేశికులు దయాశతకంలో

"సమస్తజననీం వందే చైతన్యస్తన్యదాయినీమ్,
శ్రేయసీం శ్రీనివాసస్య కరుణామిన రూపిణీమ్,

(సమస్తలోకాలకు తల్లి, చైతన్యమనే స్తన్యాన్ని అందరికీ అనుగ్రహించేది, శ్రేయోదాయకమైనది శ్రీనివాసుని కరుణే మూర్తిభవించినట్లు ఉన్నది అయిన లక్ష్మీదేవిని నమస్కరిస్తున్నాను),

వందే వృషగిరీశస్య మహిషీం విశ్వధారిణీమ్,
తత్కృపాప్రతిఘాతానాం కృపయా వారణం యయా,

(అందరినీ ధరించేది, శ్రీవేంకటేశ్వరని కృప భక్తులపై ప్రసరించడంలో ఏర్పడే ఆటంకాలను కరుణతో తీర్చేది, ఆ స్వామికి పత్ని అయిన భూదేవిని నమస్కరిస్తున్నాను)

నిశామయతు మాం నీళా యద్భోగపటలైః ధ్రువమ్,
భావితం శ్రీనివాసస్య భక్తదోషేష్వదర్శనమ్"

(ఏ నీళాదేవి కలిగించే ఆనందాల సమూహం వల్ల శ్రీనివాసుడు తన భక్తులలోని దోషాలను చూడలేకపోతున్నాడో, అటువంటి నీళాదేవి నన్ను కటాక్షించాలి)

అనే శ్లోకాలలో క్రమేణ అనుగ్రహించారు. చేతనుని అపరాధబాహుళ్యం వల్ల సర్వేశ్వరునకు ఉండే స్వాభావికమైన కరుణ సుప్తమై పోయినపుడు, కోపంతో అతడు శిక్షించడానికి ఆరంభించగానే, లక్ష్మీదేవి "న కశ్చిన్నపరాధ్యతి? " (తప్పు చేయనివాడు ఎవడు?)అనే విధంగా కొన్ని సముచిత సూక్తులను పల్కి అతని కృపకు ఉద్బోధనం కలిగిస్తుంది కనుక, కరుణ అని చెప్పదగినట్లు ఉంటుంది - అని పల్కినందున, ఈమెవల్ల అతని కరుణ ఉద్బుద్ధమవుతుంది. ఈ విధంగా భగవానుని కరుణ ఉద్బుద్ధమైతే అతడు శిక్షించడం నిలిపివేస్తాడు. భూదేవి సర్వేశ్వరుని కృపాప్రసరణానికి విరోధులను పోగొట్టగానే, భగవంతుని శిక్షించాలనే ప్రయత్నమే నివృత్తమవుతుంది. కృపాప్రసరణం జరిగినపుడు కదా, శిక్షించాలనే ప్రయత్నం జరుగుతుందని భావం. ఇక, "నిశామయతు మాం నీళా" అనే శ్లోకార్థం స్పష్టం. ఈ విధంగా ముగ్గురు దేవేరులకు పురుషకారత్వమున్నది. కాని, ఈ పురుషకారత్వం లక్ష్మికి స్వాభావికం. పురుషకార స్వభావంవల్ల ప్రసన్నురాలైన లక్ష్మి పురుషకారం చేయగా, ఆమెకు కరచరణస్థానీయలైన మిగిలిన దేవేరులు కూడా పురుషకారం చేస్తారు. వారికోసం మనం ప్రత్యేకంగా, పురుషకార ప్రపత్తి చేయనక్కరలేదు. ఈ అర్థాలన్నీ సదాచార్య సన్నిధిలో చిరపరిచయం కలవారికి విదితం. ప్రసక్తానుప్రసక్తంగా చేయబడిన ఈ వివరణ ఇంతటితో చాలు.

ఈ విధంగా వాల్లభ్యాన్ని కల పురుషకార స్వభావంతో ప్రసన్నుడై, ఆమెతో ఐకరస్యాన్ని పొంది, అర్థిజనానికి స్వామి ప్రసన్నుడవుతున్నాడని అంటున్నారు. ఇకపై.

**(వరదేతి)** దాతకు ఔదార్యగుణం ఉన్నా, సంపద లేకపోతే తాను దానం చేయడం వీలు కాదు కనుక, అర్థిజనులకు ఇష్టసిద్ధి కలుగకపోవడంతోపాటు, దాతకు కూడా క్లేశం కల్గుతుంది. ఆ రీతిలో కాకుండా, వరదత్వానుగుణంగా "శ్రీవల్లభ" అని పూర్వం

శ్రీసమృద్ధిని తెలిపారు. "ఈ వరాన్ని ఈ కాలంలో ఇస్తాడు"- అని విశేషించి పలుకనందున, చతుర్విధపురుషార్థాలను అర్థిజనం అడిగినపుడు ఇవ్వడంతో పాటు “తన్నై త్తన్ద కళ్ళ్క” (భక్తులకు తనను ఉదారంగా అనుగ్రహించే కల్పవృక్షం వంటివాడు) అ నే రీతిలో తనకు కూడా దానమిచ్చి, అంతటితో తృప్తిపడక, ఏమీ ఇవ్వలేని వానివలె సంకోచపడుతూ ఉంటాడు. క్షుద్రప్రభువులు చిరకాలం తమ చుట్టూ తిరిగి క్లేశపడేటట్లు చేసి, ఈషత్తు కూడా ఇవ్వరు. ఏదో, కానీని ఇచ్చినా, ఆమరణం గొప్ప దానం చేసినట్లుగా పల్కుతూ, ఇతనిని చూచినపుడంతా ఇతనిచేత సేవ చేయించుకుంటారు. సర్వేశ్వరుడు అర్థిజనానికి ఇచ్చేటపుడు “అయ్యో ఏమి కష్టం వచ్చి యాచిస్తున్నాడో! ఇతనికి ఏమి ఇవ్వాలి ?" అని దయాపరుడై ఇస్తాడు తప్ప, దంభాదులలో ఇవ్వడు.

**(దయాపరేతి)** - “దయాయాః పరః" దయ పోయే దారిలో ఇతడు కూడా పయనిస్తాడు. లోకంలో, స్త్రీ భర్తకు విధేయుడు కాకుండా పయనిస్తాడు. లోకంలో, స్త్రీ భర్తకు విధేయురాలు కాకుండా వర్తిస్తే, భర్తకూడా ఆమెను నియమించలేక, తానుకూడా ఆమె పోయే దారిలో ఆమెకు వశుడై పోయే రీతిలో, దయాగుణం పోయేటపుడు దానిని నియమించలేక, స్వామి తానుకూడా ఆమెకు అధీనుడై పోతున్నాడని హార్దభావం

“వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః"-

(ఒక సాధారణ మానవుడు దుఃఖాన్ని పొందితే, “అయ్యో నా రక్షణలోపం వల్ల కదా ఇతడు ఈ క్లేశాన్ని పొందాడు)- అని తాను చాలా దుఃఖాక్రాంతుడై, ఆ మానవుని క్లేశాన్ని తీరుస్తాడు. ఈ విధంగా సామాన్యంగా ఒక సాధారణ మానవుని విషయంలోనే దయాపరుడై ఉండేవాడు, భక్తులపట్ల నిరతిశయప్రీతిని కలవాడై ఉంటాడు కదా! – అని ఇకపై పల్కుతున్నారు.

**(భక్తప్రియేతి)** - “భక్తానాం ప్రియః, భక్తాః ప్రియాః యస్య సః” (భక్తులకు ఇష్టమైనవాడు, భక్తులంటే ఇష్టపడేవాడు) అని తత్పురుష- బహువ్రీహి సమాసద్వయంతో భక్తులకు ఇతడు ప్రియుడు, ఇతనికి భక్తులు ఇంకా అంతకంటే ప్రియులై ఉంటారని భావం.

భక్తుల విషయంలో ఉండే ప్రియత్వం శేషభూత అయిన స్త్రీని ఒక (ఆనందించే) సమయంలో శేషిభూతురాలుగా చేసి ఆమెతో అనుభవాన్ని పొందేటట్లే శేషభూతులైన భక్తులను శేషిస్థానీయులుగా చేసి, అనుభవించడానికి హేతువు అవుతుంది. ఈ అర్థాన్ని నమ్మాళ్వార్లు “వారిక్కొణ్డెన్నై విழுங்குవన్ కాణిల్" (నన్ను ఆదరంగా గ్రహించి, "నిన్ను నేను గ్రహిస్తాను") అనే పాశురంలో, భగవానుని చూచి “శక్యమంజలిభిః పాతుమ్” (దోసిళ్ళతో పానం చేయడానికి వీలు) అనే విధంగా చేతులారా దోసిళ్ళతో గ్రహించి పానం చేసి ఆనందిస్తాను- అని అంటూ శేషభూతుడనైన నన్ను శేషిగా చేసి, నాకు ముందే ఆశను ప్రదర్శించి వచ్చి, నన్ను నిశ్శేషంగా భుజించాడు (అనుభవించాడు) ఒకని (స్వామి) ప్రణయిత్వం ఇంత గొప్పదా! ఆహా! అని అన్నారు. శరణాగతుడైన విభీషణుని “వధ్యతా మేష దండేన” అని శ్రీరామునిపట్ల గల ప్రీతివల్ల మహారాజు (సుగ్రీవుడు) పల్కడం— ఇదంతా తత్పురుష సమాసార్థం.

సుగ్రీవుడు ప్రీతితో పల్కితే, శ్రీరాముడు ఆ మాటకు మనస్సులో కలత చెందడం ఎందుకు? అంటే, “ఇది సుగ్రీవుని బుద్ధికి ప్రియమైనా, శ్రీరాముని బుద్ధికి ప్రియం కాదు. “ప్రాణైరపి త్వయా నిత్యం సంరక్ష్య శ్శరణాగతః" (నీవు నిత్యం శరణకోరినవారిని ప్రాణాలను విడిచిపెట్టి అయినా రక్షించాలి) అని సుగ్రీవుడు పలికేవాడైనపుడు, ఆ మాట ప్రియంగా ఉండేది. శ్రీరాముడు, తాను పట్టాభిషేకాన్ని చేసికోవడం మానివేయడం కూడా సుగ్రీవునకు, విభీషణునకు పట్టాభిషేకం చేయడం కోసమే కదా. "ఆయుధాన్ని ఎత్తను" అని ప్రతిజ్ఞ చేసి, తరువాత, జయద్రథయుద్ధంలో సుదర్శనంతో భాస్కరాచ్ఛాదనం చేయడం, భీష్మప్రతిజ్ఞా పూరణం కోసం చక్రహస్తుడై పరుగెత్తి రావడం- ఇవన్నీ భక్తులపట్ల ఉండే నిరతిశయ ప్రీతివల్ల చేసినవి. ఇది అంతా బహువ్రీహి సమాసార్థం.

అయినా, అనాది అయిన, జీవునకు పెనవేసికొని ఉండే సంసారాన్ని నివర్తిపజేసికొనే సామర్థ్యం ఉన్నదా? సంసారం తీరితే కదా మోక్షపదత్వం కూడుతుంది? అంటే, దానికి సమాధానాన్ని ఇక పల్కుతున్నారు.

**(భవలుంఠనకోవిదేతి)** నవనీతచౌర్యంలోవలె, అందులో కూడా మహా సమర్థుడు. అంటే- గోపికలు అరుణోదయానికి ముందే దీపం వెలిగించి పెట్టి, పెరుగును చిలికినపుడు, గోపికలకు తెలియకుండా దీపం నీడలో దాగికొని, నవనీత చౌర్యం చేసేటట్లే, సంసారుల సంసారాన్ని తొలగించేటపుడు వారికి తెలియకుండా, సంసారంలో భోగ్యతావశంతో ఆసక్తులై ఉన్నారని తలచి, వారికి "ఈ విధంగా సంసారం తీరిపోయింది" అని తెలియని రీతిలో పశ్యతోహరునివలె సంసారచౌర్యం చేయడంలో మహాసమర్థుడని భావం.

**(నాథేతి)** -

"సోఽయం బ్రాహ్మణభూయిష్ఠః వానప్రస్థగణో మహాన్,
త్వన్నాథో నాథవద్రామ! రాక్షసై ర్వధ్యతే భృశమ్"

(బ్రాహ్మణులకు పలువురితో కూడిన ఈ గొప్ప వానప్రస్థ సమూహం నిన్నే నాథునిగా కలవారు. అయినా అనాథులవలె రాక్షసులచే మిక్కిలిగా వధింపబడుతున్నారు) అనే రీతిలో నీవు నాథుడవై ఉండగా అనాథులవలె దండకారణ్యవాసులైన మునిగణాలను రాక్షసులు పీడించినట్లే, నిన్ను నాథునిగా కల నన్ను కూడా విషయాలు పీడిస్తున్నాయి. "నాథ" అని నీ నాథత్వాన్ని పల్కుతూ ఆక్రందించే నన్ను విషయాలనుండి రక్షించు– అని అంటున్నారని భావం. "అనాథాం కిముపేక్షసే?" (స్వామీ! అనాథ అయిన నన్ను నీవు ఎందుకు ఉపేక్షిస్తున్నావు ?) అని ఆక్రందించిన ద్రౌపదిని నీవు రక్షించలేదా ? అని భావం.

**(నాగశయనేతి)** నీ తిరునామాలను పల్కి, నేను ఆక్రందిస్తూ ఉండగా, “సుఖసుప్తః పరంతపః" అనే విధంగా సుఖంగా ఆదిశేషునిపై సుఖంగా నిద్రిస్తున్నావే! నీ సంసారాన్ని తీర్చేటపుడు, "సంసారన్యూనతాభీతా స్త్రిదశాః పరిపంథినః" అని దేవతలు ప్రతిబంధకాలను కల్గిస్తారే! అని అంటే, నీ “పరంతపత్వం” ఎక్కడికి పోయింది? ఆ నీ పరంతపత్వానికి కూడా సుప్తత్వం ఏర్పడిందే! ఉపపాండవులను సౌప్తికవధం చేసినట్లుగా, నిన్ను కూడా ఎవరైనా సౌప్తికవధం చేశారా ? అనే అస్థానే భయశంకను పొంది, ఆదిశేషుడు రక్షిస్తున్నాడు కనుక, భయం లేదు అని ఊరటను పొందారు. బ్రహ్మాస్త్రానికి భయపడి, “స పిత్రా చ పరిత్యక్తః" (ఆ కాకాసురుడు తన తల్లితండ్రులచేకూడా విడవబడ్డాడు) అని తల్లితండ్రులు సైతం విడిచివేసినట్లు, ఎవరివల్ల భయపడి నన్ను నీవు వదలిపెట్టవలసిన పని లేదు- అని భావం. "నాథుడవే కాక, జగన్నివాసభూతుడవై ఉన్నావు"– అని ఇకపై పల్కుతున్నారు.

**(జగన్నివాసేతి)** - నీ స్వరూపం జగదాధారమై ఉండడమే కాక, విగ్రహం కూడా అస్త్రభూషణాదిరూపంలో సర్వాధారమై ఉంటుంది. ఆధారభూతుడవైన నీవు విడిస్తే, ఐ ఇక ఆధేయభూతుడనైన నేను ఏ విధంగా నిలువగలను? అనే అర్థవిశేషంలో తాత్పర్యం. (లేక, జగన్నివాస భూతుడవు కనుక, అందరిలో ఉండే నీవు నాలోను ఉన్నావు కనుక, నాకు కల్గిన ఆపదను గూర్చిన జ్ఞానం నీకు లేదు- అని చెప్పలేవుకదా - అని కూడా భావం) “శ్రీవల్లభ” ఇత్యాది ఒక్కొక్క తిరునామం సర్వగుణాక్షేపకమై, రక్షణ విషయంలో పర్యాప్తమవుతుంది, అంటే, ఇటువంటి గుణాలను కలిగిన నీవు నన్ను ఎందుకు రక్షించడం లేదు? అనే భావంలో అన్వయిస్తుంది- అని ప్రత్యేక ప్రత్యేకంగా “ఇతి” శబ్ద ప్రయోగం ద్వారా సూచితం.

**(ఇత్యాలాపనమ్)** - ఈ విధంగా నేను పలికే రీతిలో చేయడాన్ని– అని అర్థం. ఇక్కడ ఆలాపన మనేది “దాపన”మనే రీతిలో ణిజంతార్థకం.

**(హే ముకుంద! ప్రతిపదమ్)** ప్రతిసారి, ప్రతిచోట.

**(కురు)** - సకృదావృత్తి కాకుండా అసకృదావృత్తి చేసేటట్లు చేయాలని భావం. "ముక్తిం దదాతి ఇతి ముకుందః" అనే విధంగా నీవు మోక్షప్రదాయుడవు కదా!

"ఓలమిట్టు నానழைత్తాల్ ఒన్టుమ్ వారాయాకిలుమ్"
(గొంతెత్తి నేను పిలిచినప్పటికీ, నీవేమీ రాకపోయినా)

అని నేను అసకృత్ ఆక్రందనం చేసినా,
"కుశస్థలే నివసతి స ప్రాత రిహేష్యతి"

(ఇప్పుడు కుశస్థలంలో ఉన్నాడు, రేపు ఇక్కడికి వస్తాడు) అనేవిధంగా "ఇక్కడకు వచ్చాడు; ఇక్కడకు వచ్చాడు" అనే మాటకూడా వినలేదే!

"నామగ్రాహం చ రామస్య శీతలః కాహళధ్వనిః"

(శ్రీరాముని నామాన్ని అనుసంధించడం చల్లని కాహళ ధ్వనివలె ఉంటుంది) అని నామగ్రహణం కాహళధ్వనివలె కదా ఉంటుంది- అని ప్రార్థిస్తున్నారు- అనే పర్యంతం ఇక్కడ, తాత్పర్యం. "ము" అంటే ముక్తి "కు" అంటే భుక్తి, ముక్తి భుక్తులను ఇచ్చేవాడవు- కనుక ముకుందుడనే పేరును కల నిన్ను "ముక్తిని అనుగ్రహించు" అని, "భుక్తిని అనుగ్రహించు" అని అడుగుతున్నానా! తిరునామాలను పల్కితే అదే చాలు- అని అంటున్నాను—అని భావం.

**2. జయతు జయతు దేవో దేవకీనందనోఽయం**
**జయతు జయతు కృష్ణో వృష్ణివంశప్రదీప:।**
**జయతు జయతు మేఘశ్యామల: కోమలాంగో**
**జయతు జయతు పృథ్వీభారనాశో ముకుంద:॥**

దేవకీనందనః = దేవకియొక్క పుత్రుడగు, అయం = ఈ, దేవః = భగవంతుడైన శ్రీకృష్ణుడు, జయతు జయతు = అందరికంటే ఉత్కృష్టుడు అగుగాక, వృష్ణివంశ ప్రదీపః = వృష్ణివంశమనే యాదవ వంశమునకు ప్రకాశమును కలుగజేయువాడైన, కృష్ణః = శ్రీకృష్ణుడు, జయతు జయతు = సర్వోత్కృష్టుడు అగుగాక, మేఘశ్యామలః = మేఘమువలె నల్లని దేహకాంతిని గల, కోమలాంగః = మెత్తని అవయవములుగల శ్రీకృష్ణుడు, జయతు జయతు = దేవతలు అందరికంటె అధికుడగుగాక, పృథ్వీ = భూమియొక్క, భర = భారమును, నాశః = పోగొట్టునటువంటి, ముకుండః = శ్రీకృష్ణుడు, జయతు జయతు = సర్వోత్కర్షతో వెలుగుగాక.

**అవతారిక**

ప్రభువులు, తమను వందిమాగధులు స్తుతించినా, ముగ్ధుడైన (ఏమీ తెలియనిశఅమాయకుడైన) పుత్రునకు "అమ్మ, అయ్య, అన్న, తాత"- అని కొన్ని మాటలను నేర్పి, వానిని ఆ కుమారుడు తిరిగి ముద్దుగా పలికేటపుడు విని ఆనందించేటట్లే, సర్వేశ్వరుడు ప్రాచేతస వైశంపాయన బోధాయన వ్యాసపరాశరశుక శౌనకాదులు తనను స్తుతించినప్పటికీ, "ఆళ్వార్లు ఎపుడు నన్ను స్తుతిస్తారు?"అని ఆశతో ఎదురు చూచాడు. ఈ ఆళ్వార్లు “ఆలాపనం ప్రతిపదం కురు మే ముకుంద! ” అని “నీ తిరునామాలను నేను పలికేటట్లుగా చేయాలి"- అని ప్రార్థించారు.

సర్వేశ్వరుడైన ఆ ముకుందుడు, అపుడు ఇంతవరకు తాను చూడలేని దానిని చూచినవాడుగా సంతుష్టుడై, తన దివ్యావతారాలను, దివ్యలీలలను వారికి సాక్షాత్కరింపజేసి, తనను స్తుతించేటట్లు చేశాడు. , ఆళ్వార్లు “జయతు జయతు”

ఇత్యాదిగా. ఈ శ్లోకంతో స్తుతించడం ఆరంభించారు. పరాశరాదుల విషయంలో కంటే ఆళ్వార్ల విషయంలో భగవానునకు అధికమైన వ్యామోహ మున్నదనే విషయం దయాశతకంలో దేశికులు పరాశరాదులకు నమస్కరించేటపుడు "పరాశరముఖాన్ వందే భగీరథనయస్థితాన్" (భగీరథుని మార్గంలో ఉండే, అంటే, భక్తి అనే గంగానదిని భూమికి తీసుకొని వచ్చే ప్రయత్నంలో ఉండే పరాశరడు మొదలైన మహర్షులను నమస్కరిస్తున్నాను) అని ఆ ఋషుల తిరునామాలను పల్కి నమస్కరించారు. ఆళ్వార్లను నమస్కరించేటపుడు మాత్రం "కృతినః కమలావాసకారుణ్యైకాంతినో భజే" (శ్రీమన్నారాయుని దయకు పాత్రమైనందున అదృష్టవంతులైన ఆళ్వార్లను నమస్కరిస్తున్నాను) అని "కృతినః" అనే పదంద్వారా వారిని నిర్దేశించారు. కృతిత్వ మంటే ఇక్కడ భగవంతుని విశేషకృపకు పాత్రులు కావడమే. దీనిని "కమలావాసకారుణ్యైకాంతినః" అని స్పష్టంగా తెలిపారు. ఈ విషయాన్ని "ఇన్కవి పాడుమ్ పరమకవికళాల్" (తీయని పాశురాలను పలికే గొప్ప కవులచే)అనే పాశురంలో నమ్మాళ్వార్లు "తనకు పాశురాన్ని వినాలంటే "పాఠ్యే గేయే చ మధురమ్"(చదవడానికి, గానం చేయడానికి మధురమైనది) అని మధురంగా పాడే రీతిలో వాల్మీకివంటి మహాకవులుండగా, వారిని మాటిమాటికి పాడేటట్లు చేసి ఆనందించకుండా, నన్ను ఉపకరణంగా చేసికొని కవిత్వాన్ని పాడించాడే! ఇదేమి! ఇదేమి ప్రణయిత్వం! ఆహా! " అని అన్నారు. "కరుణైకాంతిత్వ" మంటే-

'అనుగ్రహవిశేషేణ కేనచిత్ పరమాత్మనః,
కురుకాధీశనాథాద్యాః ప్రాగప్యన్వభవన్ ప్రభుమ్'

(భగవంతుని విశేషమైన అనుగ్రహంచేత నమ్మాళ్వార్లు, నాథమునులు మొదలైనవారు పరమాత్మను దర్శించి అనుభవించారు) అని మోక్షానికి ముందే ప్రకృతి మండలంలోనే ముక్తతుల్యానుభవాన్ని పొందేటట్లుగా భగవత్కృపకు పాత్రం కావడం. తరువాత కూడా, ఆళ్వార్లు తాము తలచినపుడు భగవానుడు ప్రత్యక్షం కానందున అతికుపితులై, ఆలస్యంగా వచ్చిన స్వామిని "ఒరునాళ్లు తడిపిణక్కే" (ఒకనాడు కర్రతో

తగులాట ఏర్పడుతుంది)అని కర్రతో యుద్ధం చేసి, "ఇక్కడకు రాకు, దూరంగా పో" అని చాలా ఉపేక్షిస్తూ పలికారు. అయినా, పిల్లిని కొట్టి తరిమివేసినా, అది పెంచేవారి కాళ్ళచుట్టూ తిరిగేటట్లే, ఆళ్వార్ల పాదాల చుట్టూ రీతిలో భగవత్ కృపను పొందినవారు, ఆళ్వార్లు. ఇటువంటి అనుగ్రహం చతుర్ముఖునకు కూడా లభించలేదుకదా!

ఇటువంటి దేవుడైన సర్వేశ్వరుడు తాను దేవకీనందనుడై జన్మించడం మొదలైవానిని ఆళ్వార్లకు దర్శింప జేసి, తనను స్తుతించేటట్లు చేయగా, ఆళ్వార్లు, దేవకీనందనుడై అవతరించడం, దురాత్ముడైన కంసుడు గమనిస్తే ఏమవుతుంది? ఇతనికి ఏమి కీడు వస్తుందో! హాని కల్గితే తరువాత జరుగవలసిన భూభార నిర్హరణాదులు జరుగవు. నేను దర్శించి ఆనందించాలని పడిన ఆశ అంతా వ్యర్థమై పోతుంది. “శ్రేయాంసి బహువిఘ్నాని”. (మంచి కార్యాలకు అనేక ఆటంకాలు ఏర్పడతాయి) అని దేవలోకంలో శంబరుని జయించి వచ్చిన ధశరథచక్రవర్తి శ్రీరామునకు అభిషేకం చేయాలని ఆశపడ్డాడు. “ఏకేన బ్రహ్మదండేన సర్వాస్త్రాణి హతాని మే" (వశిష్టుని ఒక్క బ్రహ్మదండంతో నా అస్త్రాలు అన్నీ నశించిపోయాయి) అని ఒక దండాన్ని పురస్కరించుకొని బ్రహ్మాస్త్రాదులను గ్రహించేటట్లు, రాజర్షిని బ్రహ్మర్షిగా చేసేటట్లుగా ఉండే మాహాత్మ్యాన్ని కల వశిష్ఠుడు పట్టాభిషేకానికి ముహూర్తాన్ని పెట్టాడు. సామంతరాజులు కూడా సకల జనులు “ఇచ్ఛామో హి మహాబాహుమ్ ” (గొప్ప బాహువులను కలిగిన శ్రీరాముడు రాజు కావాలని మేము కోరుతున్నాము) అని రాముడు రాజు కావాలని ఆశపడ్డారు. "సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్" (విశాలమైన నేత్రాలను కల సీతాదేవితో కలిసి శ్రీరాముడు నారాయణుడైన శ్రీరంగనాథుని ఆరాధించాడు) అని శ్రీరంగనాథుని రాముడు ప్రార్థింపబడ్డాడు. ఈ విధంగా శ్రీరాముడు అన్ని విధాలుగా పట్టాభిషేకానికి అర్హుడు. అయినా, దానికి విఘ్నం ఏర్పడింది. మన భాగ్యం ఏమి అవుతుందో? లోకుల భాగ్యం ఏమవుతుదో? అనే అస్థానే భయంతో ఆళ్వార్లు ముందుగా మంగళాన్ని ఆశాసిస్తున్నారు.

**(దేవః)** - "భవాన్ నారాయణో దేవః"(నీవు దేవుడవైన నారాయణుడవు), "సాక్షాద్దేవో జనార్దనః" (నీవు సాక్షాత్తు జనార్ధనుడవు) అనే విధంగా దేవుడైన నారాయణుడు కదా, దేవకీ నందనుడై అవతరించాడు. ఇందువల్ల పూర్వం దేవకీ గర్భంలో పుట్టిన ఏడుగురు పుత్రులవలె, ఎనిమిదవ గర్భంకూడా అసురుడు కాడు, దేవుడనే అర్ధం తెలుపబడింది. "పితరం రోచయామాస" (విష్ణువు దశరథుని తనకు తండ్రిగా కోరుకున్నాడు)అని వసుదేవుని తండ్రిగా పొందాలంటే, రోహిణి గర్భంలో అవతరించ కూడదా! దేవకీనందనుడై జనించడానికి ముందే దేవకియొక్క ఎనిమిదవ గర్భంలో నీకు మరణం కల్గుతుందని అశరీరవాణి పల్కిన మాట విన్న కంసుడు దేవకికి కల్గిన మిగిలిన గర్భాలను వధించినట్లే, నిన్నుకూడా వధించడానికి వస్తాడని భయపడుతున్నాను స్వామీ!—అని జయాన్ని ఆళ్వార్లు ఆశాసిస్తున్నారు.

**(జయతు జయతు)** - ఇతడు ఏ హాని లేకుండా, జయాన్ని పొందాలని అంటున్నారు. శ్రీరాముని పర్వతాన్ని దర్శించిన ఋషులు "జయతాం రాఘవ స్సంఖ్యే" (రాఘవుడు యుద్ధంలో జయించాలి) అని విజయాన్ని ఆశాసించారు. పెరియాళ్వార్లు కూడా

"కణ్ణన్ కరిక్కోణ్ణు నిన్మేల్ కరునిఱ చ్చెమ్మయిర్ ప్పేయై వంజిప్పదఱ్కు విడుత్తా నెన్బదోర్ వారైయు ముణ్డు"

(కంసుడు కోపంతో నీపైకి నల్లని రంగు, ఎఱ్ఱని కేశాలను కల పిశాచిని నిన్ను వంచించడానికి పంపించాడనే వార్త ఒకటి ఉన్నది)

అని కంసుడు పిశాచి పూతనను నిన్ను వంచించడానికి పంపించాడు అనే ఊరిలో చెప్పుకొనే మాట ఉన్నది. ఏమి చేయను? అనే అస్థానే భయశంకతో జంకి, వెనుకంజ వేసి, భీతిల్లి పల్కుతున్నారు. నమ్మాళ్వార్లు కూడా "పల వశురరై క్కఇజ్ఞనేవ" (అసురులను అనేకులను శ్రీకృష్ణుని వధించడం కోసం కంసుడు నియోగించగా) అని ఒక రూపంతో, అశ్వరూపంలో, సర్పరూపంలోని పలు అసురులను కంసుడు నియోగించాడని భయపడ్డారు. తరువాత, గమనించి చూచినపుడు "భవాన్నారాయణః" (నీవు నారాయణుడవు) అని అన్నా, అది భగవంతునకు సహించలేనిదై,

"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్"
నన్ను నేను దశరథుని కుమారునిగానే, మానవునిగానే భావిస్తున్నాను) అని, "అహం వో బాంధవో జాతః" (మీకు నేను బంధువునై జన్మించాను) అని అతడు పలికేటట్లుగా అతని అభిసంధి (బలమైన అభిప్రాయం) ఉండడం గమనించి, "దేవకీనందనః" అని దేవకిని ఆనందింపజేయాలని అంటున్నారు. దేవకీనందనుడై జన్మించాడమనేది దేవకి, వసుదేవుడు కంసునివల్ల భీతిల్లి, శ్రీకృష్ణుని కౌగలించుకొని రోదించడానికి కారణమైనదే తప్ప, ఆ స్వామి బాల్యలీలలను అనుభవించి, ఆనందించడానికి కారణం కాలేదు. లీలలను అనుభవించినది అంతా యశోద, వసుదేవుడే కదా!

**(అయమ్)** - ఈ విధంగా దేవకీనందనుడై అవతరించినందువల్ల కల్గిన గొప్ప శ్రేయస్సును కల ఈ ముకుందుడు- అని భావం. "స ఉ శ్రేయాన్ భవతి జాయమానః"(ఆ భగవంతుడు పుట్టినవాడై, శ్రేయస్సును పొందినవాడు అవుతున్నాడు) అని కదా వేదంలో చెప్పబడుతున్నది. "ఉ శబ్ద ఏవకారార్థః, స ఏవ జాయమాన స్సన్ శ్రేయాన్ భవతి"- (ఉ అనే శబ్దం ఏవకారార్థాన్ని తెలుపుతుంది. అతడే పుట్టినవాడై శ్రేయస్సును కలవాడు అవుతున్నాడు) అని అర్థం. అతడొక్కడే జన్మించగా జన్మించగా శ్రేయోనిధిగా అవుతున్నాడు. కర్మవశంగా జన్మిస్తే తేజస్సు తగ్గుతుంది. లోకానుగ్రహార్థం జన్మించినందువల్ల కదా తేజస్సు అభివృద్ధమవుతుంది. ఈ విషయాన్ని నమ్మాళ్వార్లు కూడా "పల పిఱప్పాయ్ ఒళివరు ముழுనలమ్" (అనేక జన్మలను ఎత్తినవాడై, భగవంతుడు, తన కాంతి అభివృద్ధి అయ్యేటట్లు ఉన్నాడు) అని ఈ శ్రుత్యర్థాన్ని అనుగ్రహించారు. "పల పిఱప్పాయ్ - పలు విధాలైన జన్మలను కలవాడై, అందువల్లనే, ఒళి వరుమ్ =కాంతి అభివృద్ధి అయేటట్లు— అని అర్థం. ఒళి = కాంతి, ముழுనలమ్— కృత్స్నానందశాలిగాను ఉంటాడు. ఏ అవధి లేకుండా అన్ని జాతులలో జన్మించేటట్లుగా అవకాశాన్ని పొందగలిగాము కదా- అని మహానందశాలిగా ఉంటాడని తాత్పర్యం. గత శ్లోకంలో "ముకుంద" అని, దీనికి తరువాత శ్లోకంలో "ముకుంద మూర్ధ్నా ప్రణిపత్య యాచే" (ముకుందా! నా తలతో నిన్ను నమస్కరించి ప్రార్థిస్తున్నాను) అని

అభిముఖంగా నిలచి, సంబోధించి పలికారు. కాని, ఇక్కడ మాత్రం- "దేవకీనందనోఽయం"(ఈ దేవకీ నందనుడు) అని పరోక్షనిర్దేశం చేసి పల్కడానికి కారణం ఏమంటే– "తమద్భుతం బాలక మంబుజేక్షణమ్"(అద్భుతమైన రూపాన్ని కలవాడు, బాలకుడు, తామరలవంటి నేత్రాలను కలవాడైన బాలకృష్ణుని) అన్నట్లు కమలదళాయతలోచనుడై అవతరించిన శ్రీకృష్ణుని దివ్యసౌందర్యానికి తమ దృష్టిదోషం తగులుతుందేమో! - అని భయపడి ముఖాన్ని పక్కకు తిప్పుకొని, "జయతు జయతు" అని మంగళాశాసనం చేయడంకోసమే. తల్లిబిడ్డకు పాయసాన్ని తాగించేటపుడు తన దృష్టి కూడా పడకుండా వెనుక వైపు పెట్టుకొని తాగిస్తుంది కదా. "పల్లాణు పల్లాణ్డు " అనే విధంగా ఆదరాతిశయం చేత "జయతు జయతు" అని రెండు మార్లు పల్కుతున్నారు. ఈ విధంగా ప్రథమపాదంలో- దేవకీనందనుడై జన్మించడంవల్ల, కంసుని వల్ల భయపడి మంగళాశాసనాన్ని ఆశాసించారు. ఇక ద్వితీయపాదంలో వృష్టివంశ ప్రదీపత్వాన్ని హేతువుగా తలచి, జయాన్ని ఆశాసిస్తున్నారు.

**(వృష్ణివంశప్రదీపః)** - వృష్ణివంశస్థులు ఒకరిద్దరు కాకుండా, వంశమే పూర్తిగా కంసునితో పీడింపబడి ప్రకాశం కోల్పోయి క్లేశపడగా, ఆ వంశానికి గొప్ప దీపంవలె పూర్తిగా ప్రకాశం కలిగేటట్లు చేసినందువల్ల స్వామి వృష్ణివంశ ప్రదీపుడైనాడు. శ్రీకృష్ణుడు జయాన్ని పొందకపోతే కంసునివల్ల భయాన్ని పొందినవారైన వృష్ణివంశస్థులకు ప్రకాశం రాదుకదా! పగటివేళ ప్రకాశించని దీపంవలె కాకుండా, దివారాత్ర భేదం లేకుండా సదా ప్రకాశమానుడై ఉన్నాడనేది "ప్ర" అనే ఉపసర్గతాత్పర్యం. వృష్ణివంశస్థులను పల్కడం యాదవాదులకు కూడా ఉపలక్షణం.

"సర్వాన్ స్వజ్ఞాతిసంబంధాన్ దిగ్భ్యః కంసభయాద్గతాన్,
యదువృష్ణ్యంధకమధుదాశార్హ కురుకాదికాన్,
సభాజితాన్ సమాశ్వాస్య విదేశావాసకర్శితాన్,
న్యవాసయత్ స్వగేహేషు విత్తైః సంతర్ప్య విశ్వదృక్"-

(కంసుని భయంవల్ల పలు దిక్కులకు పోయినవారు, విదేశానివాసం వల్ల బాధపడేవారు, యదు వృష్ణి అంధక మధు దాశార్హ కురుకాది వంశాలకు చెందినవారైన తన జ్ఞాతులను, బంధువులను ఊరడించి, వారికి కావలసిన ధనాన్ని ఇచ్చి, వారు వారి వారి గృహాలలో ఉండేటట్లు శ్రీకృష్ణుడు చేశాడు) అని కదా చెప్పబడింది.

**(కృష్ణః జయతు జయతు)** - దేవకీనందనుడై అవతరించి, “ఇదానీం కృష్ణతాం గతః” అని గర్గాచార్యులచే కృష్ణుడని పేరు పెట్టబడినవాడు జయాన్ని పొందాలి.

**(మేఘశ్యామలః కోమలాంగో జయతు జయతు)** - “సాంద్రపయోద సౌభగమ్" (నీటితో నిండిన నీలమేఘంవలె అందమైనవాడు) అనే విధంగా నీలమేఘశ్యామలుడై, అతిసుకుమారుడైన శ్రీకృష్ణునకు వజ్రసారంవలె దృఢతరతనువుకు కల్గిన అసురులచే ఏమి కీడు మూడుతుందో! -అని కలత చెంది, జయాన్ని ఆశాసిస్తున్నారు.

“క్వ యౌవనోన్ముఖీభూతసుకుమారతను ర్హరిః!,
క్వ వజ్రకఠినాభోగశరీరోఽయం మహాసురః!,
న సమం యుద్ధ మిత్యాహుః మధురాపురయోషితః"
("ఇప్పుడే యవ్వనదశకు అభిముఖంగా ఉండే, చాలా సుకుమారమైన రూపాన్ని కలిగిన శ్రీకృష్ణుడు ఎక్కడ? వజ్రంవలే కఠినమైన శరీరాన్ని కలిగిన ఈ మహాసురుడు ఎక్కడ? ఇది సమానమైన, న్యాయమైన యుద్ధం కాదు" అని ముధురాపురంలో ఉండే స్త్రీలు అందరూ అనుకున్నారు) అని అతిబలాక్రమశాలురైన మల్లాదులచే శ్రీకృష్ణుని కోమలమైన తిరుమేనికి ఏమి హాని కల్గుతుందో! అని మధురాపురస్త్రీలు భయపడ్డారు కదా! శ్యామలమైన మేఘం వర్షన్ముఖమై ఉండేటట్లు, అందరికి ఆనందవర్షోన్ముఖుడై ఉండే కృష్ణునకు మల్లాదుల రూపంలోని అసురులవల్ల హాని వస్తే ఏమి చేయాలనే కలతతో “జయతు జయతు” అని మంగళాన్ని ఆశాసిస్తున్నారని భావం.

ఆసురప్రకృతిని కల క్షత్రియాదులచే ఆక్రాంతమైన భూదేవి గోరూపిణిగా వచ్చి రోదించగా, దానిని సహించలేక భూమికి భారం అయిన ఆ అసురులను నిరాకరించడంకోసం భారతయుద్ధాన్ని నిర్వహించేటపుడు, అతిరథమహారథులైన భీష్మాదులవల్ల స్వామికి ఏమి హాని కల్గుతుందో! అని భూభారనిశత్వ ప్రయుక్తమైన జయాన్ని ఇక ఆశాసిస్తున్నారు–

**(జయతు జయతు పృథ్వీభారనాశో ముకుందః)** అని పల్కుతూ. “మమ నిశితశరైః విభిద్యమానత్వచి"(చాలా పదునైన నా బాణాలతో చర్మం భేదింపబడినవాడై) అని కదా చెప్పబడింది. శ్రీవైకుంఠంలో విరోధి ప్రసక్తి ఏమీ లేనందున, విరోధినిరసనశీలత్వరూప గుణానికి ప్రకాశం ఉండదు. , అందువల్ల విరోధివర్గమున్న చోట అవతరించాడు, స్వామి. కనుక, అతిరథమహారథులైన భీష్మాదులను చూచి ఏమి హాని కల్గుతుందో! అని భయపడి “జయతు జయతు” అని మంగళాన్ని ఆశాసిస్తున్నారు.

**3. ముకుంద!మూర్ధ్నా ప్రణిపత్య యాచే**
**భవంత మేకాంత మియంతమర్థమ్ ।**
**అవిస్మృతి స్త్వచ్చరణారవిందే**
**భవే భవే మేఽ స్తు భవత్ప్రసాదాత్★॥**

ముకుంద = ఓ ముకుందా!, మూర్ధ్నా = శిరస్సులో, ప్రణిపత్య = దండము సమర్పించి, భవంతం = నిన్ను, ఏకాంతమ్ = ఒక్కటియైన, ఇయంతమ్ + అర్థమ్ = ఈ మాత్రము ప్రయోజనమును, యాచే = వేడుచున్నాను, భవత్ + ప్రసాదాత్ = నీ అనుగ్రహముచేత, త్వాత్ = నీ యొక్క, చరణ + అరవిందే = కమలమును పోలిన పాదములందు, అవిస్మృతిః = మరచిపోకుండా ఉండడం అనేది, మే = నాకు, భవే భవే= ప్రతిజన్మనందు, అస్తు=కలుగుగాక.

## అవతారిక

ఆళ్వార్లూ! మీరు—

“కరుమణియై క్కోమళత్తై క్కణ్డుకొణ్డుఎన్ కణ్ణిణైకళ్ ఎన్ఱుకొలో కళిక్కునాళే"

(నల్లని మాణిక్యం వంటివాడు, సుకుమార గాత్రుడైన స్వామిని దర్శించి నా రెండు కళ్ళు ఆనందించడం ఎపుడో కదా!) అని నీలరత్న సదృశమై, అతిసుకుమారమైన దివ్యతిరుమేనిని కల దేవరవారిని దర్శించి కన్నులు ఆనందిచేది ఎపుడో! అని మీరు ఆశపడిన రీతిలోనే “మేఘశ్యామలః కోమలాంగః"(మేఘంవలె నల్లనివాడు, సుకుమారమైన శరీరాన్ని కలవాడు) అని మేఘశ్యామలుడనై, కోమలాంగుడనై, అభిముఖుడనై వచ్చి నిలువగా, మీరు మీ కోరికను అడుగ కుండా, “జయతు జయతు” అని నా విజయాన్ని ఆశాసిస్తున్నారెందుకు? అని ముకుందుడనగా, "శేషియై, ఆధారభూతుడవైన నీకేదయినా హాని కల్గితే శేషభూతులమై, ఆధేయభూతులమైన మా స్వరూపం నశించిపోదా? స్వరూపధారణచేసి కదా ఇష్టప్రార్థన చేయాలి- అని ఆళ్వార్లు అన్నారు. అపుడు స్వామి

“పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం చైవ రాక్షసాన్,
అంగుళ్యగ్రేణ తాన్ హన్యా మిచ్ఛన్ హరిగణేశ్వర! ”

అని పిశాచాలు, అసురులు భూమిలోని రాక్షసులు అందఱు ఏకమై కలసి వచ్చి ఎదిరించినా, వారు నా నఖాగ్రానికి కూడా సరిపోరు. నృసింహావతారంలో నఖాలే కదా, ఆయుధాలు. అంతేకాక, “మల్లానా మశని:” అని మల్లాదులకు పిడుగువంటివాడను కదా నేను. అందువల్ల మీరు భయపడకండి. భోగమోక్షాలలో ఏది మీకు అభిమతమో, దానిని అడగండి- అని తన పరాక్రమాన్ని చూపి, స్వామి సమాధానపరచాడు.

అపుడు ఆళ్వార్లు “నీవు భోగమోక్షప్రదుడవే, అది నాకు తెలుసు. అయినా, అతిభోగ్యమైన చింతనారూపానుభవం కంటే ఇక వేఱేమీ నాకు వద్దు. ఆ చింతనే నాకు ధారకం. ఆ చింతనను నీవు అనుగ్రహించాలి"- అని దీనికి తరువాత శ్లోకంలో తెలుపబోయేవారై, చింతనం వెనువెంటనే విస్మృతి కూడా కల్గడం సహజం కనుక, ఆ విస్మృతికి భయపడి, ముందుగా విస్మృతి లేకుండా ఉండే స్థితిని (విస్మృత్యభావాన్ని) ఈ శ్లోకంలో ప్రార్థిస్తున్నారు.

వ్యాఖ్య: "నా పాపం అయితే, ఎన్ని జన్మలను ఎత్తి అనుభవించినా తీరదు. ఈ జన్మవలె పలు జన్మలు కల్గనీ. అందులో నాకు అనాదరం లేదు. ఆ జన్మలన్నిటిలోను నీ చరణారవిందాలలో విస్మృతి కలుగకుండా ఉండాలి. అదికూడా నీ అనుగ్రహం వల్ల లభించాలి. “రథం స్థాపయ మేఽచ్యుత! " (రెండు సేనల మధ్య రథాన్ని నిలుపు) అని అర్జునుడు ఆజ్ఞాపించినట్లే, నేను ఆజ్ఞాపించడం లేదు. తలవంచి నిన్ను యాచిస్తున్నాను" అని అంటున్నారు.

**(హే ముకుంద!)** - భోగమోక్షప్రదుడవై, పరాత్పరుడైనవాడా! ఇటువంటి జ్ఞానం లేనందువల్లనే కదా అర్జునుడు "రథం స్థాపయ మేఽచ్యుత" అని అన్నాడు, నీపట్ల సారథిత్వభావనను అతడు కల్గి ఉన్నాడు.

**(మూర్ధ్నా)** - ఆధిరాజ్యసూచక కిరీటాలంకృతమైన నా శిరస్సుతో,

**(ప్రణిపత్య)** - సాష్టాంగనమస్కారం చేసి,

**(యాచే)** - యాచిస్తున్నాను. అతికృపణుడనై నేను యాచిస్తున్నాను. ఆజ్ఞాపించడం లేదు. “పతనం— నిపతనం— ప్రణిపతనమ్” అని మానసవాచిక కాయికాలైన త్రివిధనమస్కార పూర్తి ఇక్కడ చెప్పబడింది. వాలిని వధించి, రాజ్యాభిషేకం చేసినా, -

సుగ్రీవుడు శ్రీరాముని వానకు, పిడుగుకు, మెఱుపుకు లక్ష్యంగా చేసి వదలి పెట్టి, కామపరతంత్రుడై, చేసిన మేలును మరచాడు. ఇటువంటి అనర్థావహమైన రాజత్వప్రయుక్తమైన గర్వాన్ని వీడి, శిరసా నమస్కరించి, యాచిస్తున్నాను- అని భావం. "యాచనా న్నశ్యతి ధ్రువమ్"- (యాచన వల్ల గౌరవము నశిస్తుంది)అని లోకోక్తి ఉన్నా,

"తత్పాదభక్తిజ్ఞానాభ్యాం ఫల మన్య న్న యాచయేత్"
(భగవానుని శ్రీచరణాలలో భక్తి ఆపరమాత్మకు చెందిన జ్ఞానం తప్ప వేఱు ఫలాన్ని కోరరాదు) అని భక్తిజ్ఞానాలను యాచించవచ్చునని ఉన్నందున, 'యాచే" అని అంటున్నారు. "యాచే" అనే ఉత్తమపురుష క్రియలో కార్పణ్యభావం వివక్షితం.

**(ఏకాంతమ్)** - ఇది "భవంతమ్" అనే పదానికి విశేషణం. "ఏకస్మిన్ ఏవ అంతః నిశ్చయో యస్య సః" -ఆశ్రితులకు అభయ ప్రదానం చేయడంలో ముఖ్యసంకల్పాన్ని కలవాడు.

"బద్ధాంజలిపుటం దీనం యాచంతం శరణాగతమ్,
న హన్యా దానృశంస్యార్థ మపి శత్రుం పరంతప!,
సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే,
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ"
(చేతులను జోడించి నమస్కరించి, యాచించేవాడు, దీనుడు, శరణాగతుడు అయినవాడు శత్రువైనా, అతనిని కరుణ కోసం అయినా, చంపకూడదు. ఒక్కసారి "నిన్ను నేను శరణాగతి చేశాను" అని ప్రార్థించినవాని కి అన్ని ప్రాణులనుండి అభయాన్ని నేను అనుగ్రహిస్తాను)అని యాచించేవానికి అభయాన్ని ఇవ్వడం తనకు నిత్యవ్రతమని స్వామి అన్నాడు. "ఏకాంతమ్" అనే పదాన్ని "అర్థమ్" అనే పదానికి కూడా విశేషణం చేయవచ్చు. అపుడు, రహస్యభూతమని అర్థం అన్ని జన్మలలోను అవిస్మృతి కలగాలనేది (విస్మృతి లేకుండా ఉండాలనేది) సర్వశాస్త్రాలలోని రహస్యమైన అర్థం- అని భావం.

“ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునః పునః,
ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణ స్సదా”
(అన్ని శాస్త్రాలను బాగా పరిశీలించి మాటిమాటికి విచారించి చూసినప్పుడు "ధ్యానించదగినవాడు నారాయణుడు ఒక్కడే" అనే ఈ విషయం చక్కగా తెలిసింది) అని ఋషి పలికాడు.

**(ఇయంత మర్థం యాచే)** - (సర్వనామశబ్దమైన) “ఇయంత”మనేది స్వరవిశేషంవల్ల గొప్పది-, అల్పం అనే అర్థాలను రెండిటిని ఇక్కడ తెల్పుతుంది. ఇంతటి గొప్ప అర్థాన్ని యాచిస్తున్నాను- అని, "శునా మివ పురోడాశః" (కుక్క పురోడాశాన్ని కోరేటట్లు) అనే విధంగా అతినిహీనుడనైన నేను వ్యాసపరాశరాదులవలె నాకు ఈ జన్మమాత్రమే కాకుండా, తరువాత కృమికీటాది జన్మలు కల్గినా, దేవరవారి చరణారవిందాల పట్ల అవిస్మృతి కలగాలని ప్రార్థిస్తున్నాను. ఇది చాలా గొప్ప అర్థం కదా! ఇది దాసుని బుద్ధికి గొప్పదైనా,

“తులసీ మన్వహం యస్తు దద్యాద్వై మాలికాం తతః,
అధమర్ణో భవేయం వై తస్య ముక్తిం వితీర్య చ”,
(ఎవడు నాకు ప్రతి దినం తులసీమాలికను సమర్పిస్తాడో, అతనికి నేను ముక్తిని ఇచ్చినా ఋణాన్ని తీర్చుకొన్నవాడను కాను) అని,
“ఋణం ప్రవృద్ధ మివ మే హృదయాన్నాపసర్పతి”,
(దూరంలో ఉండే నన్ను "శ్రీకృష్ణా! నన్ను రక్షించు" అని ద్రౌపది చేసిన ప్రార్థన నా హృదయంనుండి వడ్డీతో పెరిగిన అప్పువలె తొలగిపోవడం లేదు. నేను షదానిని మరిచిపో లేకుండా ఉన్నాను) అని,

“అస్మై న కించి దుచితం కృతమ్" (ఇతనికి నేను తగిన ఫలాన్ని దేనినీ ఇవ్వలేకపోయాను) అని మోక్షాంతైశ్వర్యాన్ని అనుగ్రహించినా, ఏమీ ఇవ్వనివానివలె ఉండే స్వభావాన్ని కలవాడవైన నీ బుద్ధికి చాలా అల్పమై ఉంటుంది.

**(త్వచ్చరణారవిందే)** - తామరలవంటి దేవరవారి శ్రీచరణాలలో—అని అర్థం. నిరూపించి చూస్తే, అరవిందం స్వామి శ్రీచరణాలకు దృష్టాంతం కాలేదు. అయినా, లోకంలోనివారు ఆ అరవిందాన్ని దృష్టాంతంగా పల్కి స్తుతిస్తున్నందున (వీరుకూడా) అరవిందాన్ని దృష్టాంతంగా పలికారు; అంతే తప్ప, దృష్టాంతం కాగలదనే భావనతో కాదు. నమ్మాళ్వార్లు కూడా

“కట్టురైక్కిల్ తామరై నిన్ కణ్పాదమ్ కై ఒవ్వా”
(వివరించి పలికితే, తామర పువ్వు నీ నేత్రాలకు, పాదాలకు, చేతులకు సాటి రాదు) అని అంటూ, నిరూపించి చూస్తే, స్వామి నేత్రపాదహస్తాలకు తామర ఉపమానం కాలేదు, లోకులు దానిని దృష్టాంతంగా చేసి, చేసే స్తుతి అంతా ఇంచుమించుగా అర్థస్థితిని పరామర్శించి చూడకుండా, తమ మనస్సుకు తోచిన దానిని తెల్పిన ఉక్తి మాత్రమే సుమా- అని అన్నారు.

ఏకవచనం ద్వారా ప్రత్యేక, ప్రత్యేకంగా దర్శించి ఆనందించి, తత్పరీవాహంగా పల్కుతున్నాను- అనే అర్థం సూచితం. అరవింద శబ్దంచేత భోగ్యత్వం వివక్షితం. శ్రీచరణాలు భోగ్యమైనందున, తచ్చింతనంకూడా భోగ్యంగా ఉంటుంది. భోగ్యత లేకపోతే విస్మృతి రావచ్చు. తామరవలె అతిభోగ్యమై ఉండగా విస్మృతి కల్గడం మహాపాపఫలం- అని భావం.

**(అవిస్మృతిః)** - విస్మృత్యభావమని అర్థం. మఱపు లేకుండా ఉండడం. దేవరవారి శ్రీచరణపద్మాన్ని మఱవకుండా ఉండడమని అర్థం.

**(మే)** - నేను అనేకజన్మలు ఎత్త వలసిన రీతిలోని మహాపాప ప్రాచుర్యాన్ని కలవాడను, ఎత్తినా, నీ చింతనం, విస్మృత్యభావం కలిగే రీతిలోని పుణ్యగంధాన్ని ఏమాత్రం లేని నాకు- అని అర్థం. (ఇది సర్వనామమైన "మే" అనే పదం ద్వారా తోచే అర్థం)

**(భవే భవే)** - ప్రతిజన్మలో,

**(భవత్ప్రసాదాత్)** - దేవరవారి అనుగ్రహంవల్ల,

**(అస్తు)** - కలగాలి. దేవరవారే ప్రపన్నుడవై, విస్మృతి కలుగకుండా ఉండేటట్లు చేయాలి తప్ప, నావల్ల ఏమీ సాధ్యం కాదు. కథంచిత్ పుణ్యవశం వల్ల చింతనం కల్గినా, వెంటనే విస్మృతి కూడా కల్గుతుంది. రాకుండా ఉండేటట్లు నీవే అనుగ్రహించాలి.

అనేకకృమికీటాదిజన్మలు కల్గినా, నీ చరణారవిందాలలో విస్మృతి లేనపుడు అది ముక్తతుల్యమై ఉంటుంది. చతుర్ముఖ పదవిని పొందినా, విస్మృతి వస్తే, నరకతుల్యమై ఉంటుందని అంటున్నారని ఇక్కడ తాత్పర్యం.

## 4. నాహం వందే తవ చరణయో ర్ద్వంద్వ మద్వంద్వహేతోః
## కుంభీపాకం గురుమపి హరే! నారకం నాపనేతుమ్।
## రమ్యా రామా మృదుతనులతా నందనే నాపి రంతుం
## భావే భావే హృదయభవనే భావయేయం భవంతమ్॥

హరే = ఓ ముకుందా!, అహం = నేను, అద్వంద్వహేతోః = చలి, వేడిమి, దుఃఖము, సుఖము అను ద్వంద్వాలు లేకుండుటకై, తవ = దేవరవారియొక్క, చరణయోః +ద్వంద్వం = పాదములయొక్క జంటను, న వందే = నమస్కరించువాడను కాను. గురుమ్ అపి =

ఓర్వ్వరానిదైనను, కుంభీపాకం = కుంభీపాకం అనే పేరు కల, నారకం = నరకమును, అపనేతుం = పోగొట్టుటకై, మీ పదములకు నేను దండము సమర్పించలేదు, మృదు = మెత్తని, తనులతాః = తీగలవంటి దేహముగల, రమ్యాః = సౌందర్యవతులైన, రామాః = స్త్రీలతోడ, నందనే = ఇంద్రుని ఉద్యానవనము నందు, రంతుమపి = క్రీడింపవలెననియైనను మీ పాదములకు ప్రణామము సమర్పించలేదు, భావే భావే = ప్రతి తలంపునందును, హృదయభవనే = మనస్సు అనే ఇంటిలో, భవంతం = దేవరవారిని, భావయేయం = ధ్యానింతును

అవ : గడచిన శ్లోకంలో విస్మృతిరాహిత్యాన్ని ప్రార్థించారు. ఇందులో ఇతరపురుషార్థాన్ని కోరకుండా పోవడంతో పాటు, భగవానుని చింతనను కూడా అర్థిస్తున్నారు.

వ్యాఖ్య: ద్వంద్వాతీతమైన మోక్షాన్ని తలవంచి ప్రార్థించకూడదా? “యాచే” అని అనాలా? అంటే, దానికి బదులు పల్కుతున్నారు.

**(అహమ్)** - త్వద్భావన (నిన్ను భావించడం) అనే రసాన్ని గూర్చి తెలిసిన నేను—అని, మకరందసాభిజ్ఞమైన భ్రమరం వేఱొక చోట అభినివేశాన్ని కల్గి ఉండనట్లే, దేవరవారి భావనారసజ్ఞుడనైన నేను— అని భావం.

“తవామృతస్యందిని పాదపంకజే నివేశితాత్మా కథ మన్య దిచ్ఛతి"

(నీ, అమృతాన్ని చిలికే పాదపద్మంలో ఆసక్తమైన నా మనస్సు ఇంకొక విషయాన్ని ఏ విధంగా ఇష్టపడుతుంది?) అనే విధంగా వేఱొక చోట అభినివేశాన్ని కల్గి ఉండను —అని భావం.

**(తవ)** - ధ్యానించగా, ధ్యానించగా మిక్కిలి భోగ్యభూతుడవై ఉండే నీయొక్క,

**(చరణయోః ద్వంద్వమ్)** - రెండు శ్రీచరణాలను- అని అర్థం. గడచిన శ్లోకంలో "చరణారవింద" అని అరవిందాన్ని దృష్టాంతంగా పలికారు. ఇక్కడ, ఆ అరవిందం కూడా దృష్టాంతం కాలేదు- అని, శ్రీ చరణాలు పరస్పరం మాత్రమే దృష్టాంతం కాగలవు- అని నిరూపిస్తూ, ఏ దృష్టాంతాన్ని పలుకకుండా కేవలం “చరణయోః ద్వంద్వమ్” అని నిర్విశేషణంగా, అంటే, ఏ విశేషణాన్ని ప్రయోగించకుండా అన్నారు.

**(అద్వంద్వహేతోః)** - “ద్వంద్వస్య భావో ద్వంద్వం. తన్నిమిత్తం” —అద్వంద్వం కోసం- అని అర్థం. సుఖదుఃఖ రూపద్వంద్వాభావ రూపమోక్షార్థమని తాత్పర్యం. “అశరీరం వా వసంతం న ప్రియాప్రియే స్పృశతః" అని వేదంలొ చెప్పబడుతున్నదికదా. ప్రియాప్రియరూప సుఖదుఃఖాభావాత్మకమైన మోక్షం కావాలని నేను నీ శ్రీచరణాలను సేవించడం లేదు. సుఖదుఃఖాభావం ఒకవైపు, నీ చింతనం ఒక వైపు త్రాసులో పెడితే, ఈ చింతనంతో సుఖదుఃఖాభావం సరి తూగుతుందా ? అని భావం.

"సుఖదుఃఖనివృత్తి కలిగి, పాషాణసమానుడుగా ఉన్నాడు" అని చెప్పేవారున్నారు. “జరామరణ మోక్షాయ” (ముసలితనం మరణం అనేవి లేకుండా ఉండడం కోసం) అని కైవల్యం కూడా ఇక్కడ అద్వంద్వశబ్దం చేత సంగృహీతం. అందువల్ల, శ్రీకృష్ణుడవై అవతరించిన నీ చింతనం లేకపోతే, సుఖదుఃఖనివృత్తి కల్గిన మోక్షం కానీ, కైవల్యం కానీ నాకు వద్దు- అని తాత్పర్యం.

“న దేవలోకాక్రమణం నామరత్వ మహం వృణే,
ఐశ్వర్యం వాపి భూతానాం ప్రార్థయే న త్వయా వినా”

(నీవు లేకపోతే పరమపదం కైవల్యం లేక ఇహలోకైశ్వర్యం అనే వీటిని నేను కోరను) అని శ్రీరామునితో సంశ్లేషం తనకు లేకపోతే, మోక్షాదులు సైతం వద్దు- అని లక్ష్మణుడన్నాడు కదా.

ఇక్కడ, “యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః” అని, దేవుడంటే- నిత్యసూరులు. వారి లోకం వైకుంఠం. లేక, “తిరువిల్లా తేవరై త్తేఱేల్ మిన్ తేవు" (లక్ష్మీ లేని దేవతలను పరదైవంగా అన్వేషించకండి) అని లక్ష్మి లేనపుడు దేవత్వం లేదని చెప్పబడిన రీతిలో ఇక్కడ దేవశబ్దం శ్రియఃపతిని తెల్పుతుంది. “దేవస్య లోకః శ్రియఃపతే ర్లోకః, వైకుంఠమిత్యర్థః, ". (దేవుడైన లక్ష్మీనాథుని లోకం వైకుంఠమని ఇక్కడ అర్థం) “నామరత్వ మహం వృణే" అని కైవల్యం, స్వర్గలోకం వద్దని పూర్వం అన్నారు. “ఐశ్వర్యం వాపి లోకానామ్” అని అన్నందున ఈ లోకంలోని సర్వజనాధిపత్య రూపైశ్వర్యాన్ని తెల్పుతుంది. అన్నద్వేషం కల్గినవారిని చూచి "అనేకవిధ భక్ష్యభోజ్యపాయసాది సంపూర్ణమైన అన్నంలో అపేక్ష ఉన్నదా?" అని అడిగితే “ఏమీ వద్దు" అని అంటాడు. అయినా, గంజిలో అయినా అపేక్ష ఉన్నదా ?” అని అడిగితే, “వద్దు, వద్దనే వద్దు" అని అంటాడు. ఆ విధంగానే, భగవంతునితో కలసి ఉండడం తనకు కల్గనపుడు, మోక్షం కానీ, కైవల్యం కానీ, స్వర్గం కానీ, ఐశ్వర్యం కానీ, ఏదయినా, వద్దని లక్ష్మణుడన్నాడు. ఆ రీతిలోనే, ఈ ఆళ్వార్లు కూడా పల్కుతున్నారని భావం. "పరమపదాన్ని అనుగ్రహిస్తున్నాము, స్వీకరించండి" అని శ్రీరంగనాథుడు అనగా, 'ఈ సేవ అక్కడలేనపుడు తిరిగి ఇక్కడకు వస్తాను” అని శ్రీరంగనాథుని పట్ల గల అభినివేశాతిశయం వల్ల భట్టర్ పలికారట.

"ఇటువంటి మోక్షకైవల్యాలలో అపేక్ష లేకుండా పోయినా, అతిదుస్సహమైన నరకయాతనా నివృత్తికోసం అయినా శిరసువంచి ప్రార్థించవద్దా? దానిని నేను నిరసించనా ? "అని అంటే- ఇక ఆళ్వారులు సమాధానం పల్కుతున్నారు

**(కుంభీపాకమ్)** - (హరే!) - “హరిర్హరతి పాపాని” (హరి పాపాలను పోగొడతాడు) అని అన్నట్లు నీవు నరకయాతనానుభవ హేతువులైన పాపాలను హరించేవాడవే. దానిని నేను అపేక్షించను.

**(గురుమపి)** - గొప్పదైన -అని అర్థం. "అన్ని యాతనలను సహించినా సహించవచ్చు. కుంభీపాక యాతన అనేది అతిదుస్సహం. దానికోసం అయినా చరణవందనాన్ని చేయవచ్చుకదా! " అంటే, దానికోసం కూడా చేయనని "గురుమపి" అని "అపి" శబ్దప్రయోగానికి తాత్పర్యం. కుంభీపాకమంటే తైలఘటంలో పచనం చేయడం (వండడం).

**(నారకమ్)** - నరకలోకంలో ఉండే- అని అర్థం. "గురుమపి కుంభీపాకమపి నాపనేతుం న వందే" (చాలా పెద్దది అయినా, కుంభీపాకాన్ని పోగొట్టడం కోసం నేను నమస్కరించడం లేదు) అని అన్వయం. "నరకమే శువర్ క్కమాకుమ్ నామఙ్గళుడైయ నమ్బి" (నరకమే స్వర్గం అయి రీతిలోని నామాలను కలిగిన గుణపూర్ణుడు) అని నీ నామాలు వర్తిస్తే, నరకం కూడా స్వర్గమవుతుంది—అని భక్తాంఘ్రిరేణుసూరి అన్నారు. ప్రహ్లాదునకు సదా భగవద్ధ్యానం ఉన్నందున కుంభీపాకయాతన కంటే క్రూరమైన యాతనలన్నీ దుఃఖావహం కాకుండా "శీతో భవ హనూమతః" (హనుమంతునకు చల్లని వాడవు కావాలి) అనే న్యాయంలో సుఖావహమయ్యాయి. అందుచేత, నీ చింతన ఉంటే నరకయాతన అనేది కల్గుతుందా ? ఇక, నేను దానిని నివర్తింపజేయమని అడుగవలసి ఉన్నదా?- అని భావం. "అయినా, దేవలోకంలోని నందనవనంలో అతిసుందరీమణులైన రంభాదులతో ఆనందిస్తూ, స్వర్గానుభవం పొందాలని తలను వంచి ప్రార్థించవచ్చునే! "అంటే - అదికూడా వద్దు —అని అంటున్నారు

**(రమ్యా ఇతి)**

**(రమ్యాః)** - అత్యంతం సుందరాంగులై,

**(మృదుతనులతాః)** మృదులమై, లతవంటి శరీరాన్ని కలవారైన,

**(రామాః)** - స్త్రీలను “రమయంతి రామాః”- (అందరినీ ఆనందింప జేసేవారు) అని పురుషులను మాత్రమే ఆనందింపజేయడమే కాక, స్త్రీలను సైతం రమింపజేసేవారై ఉంటారుకదా! ఊర్వశి సౌందర్యాన్ని చూచి "నేను పురూవరస్సుగా అయితే బాగుండునని చిత్రలేఖ ఆశపడిందని విక్రమోర్వశీయంలో కాళిదాసు అన్నాడు.

**(గంతుమ్)** - పొందడానికి, వారితో రమించడంకోసం పొందడానికి—అని అర్థం. “రంతుమ్” అనే పాఠంతో “ప్రాప్య రంతు”మిత్యర్థః. “రమ్” ధాతువు అకర్మకమైనందున “ప్రాప్య” అని అధ్యాహారం చేసికోవాలి.

“మిన్ననైయ నుణ్ణిడైయార్ ఉరుప్పశియుమ్ మేనకైయుమ్

అన్నవర్ తమ్ పాడలొడు మాడలవై యాదరియేన్”,

(చాలా సన్నని నడుమును కలిగిన ఊర్వశి, మేనక పాడే పాటలను, ఆటలను నేను ఆదరించను) అని,

“ఉమ్బరులకాణ్డు ఒరు కుడై క్కీழ் ఉరుప్పశితన్

అమ్బొఱ్కలైయల్కుల్ పెఱ్ఱాలు మాదరియేన్"

(దేవలోకాన్ని ఏకక్షత్రాధిపత్యంగా పాలించే విధంగా ఊర్వశితో చాలా గొప్పదైన భోగంలభించినా నేను దానిని ఆదరించను) అని ఏకచ్ఛాత్రాధిపతియై, దేవలోకాన్ని పాలించి, ఊర్వశి మొదలైనవారితో సంభోగం లభించినా- అది వద్దు- అని తామే పలికారు. “నాఽపి గంతుమ్” అని ఇక్కడ కూడా "అపి" శబ్దం ద్వారా “ఐశ్వర్యం వాపి లోకానామ్"

(ఈ లోకంలోని ఐశ్వర్యాన్ని) అనే రీతిలో ఇహలోకంలో కలిగే భూత్యైశ్వర్యంలో అపేక్ష లేదు– అని చెప్పబడింది.

అయితే, మీకు అపేక్షితం ఏది? అంటే, ప్రతిజన్మలో నా హృదయమనే చోట అత్యంతభోగ్యభూతుడవైన నిన్ను ధ్యానించగలగాలి- అని అంటున్నారు, "భవే భవే" అని అంటూ.
**(భవే భవే)** - ప్రతిజన్మలో.

**(హృదయభవనే భవంతం భావయే)** హృదయమనే స్థానంలో నిన్ను ధ్యానిస్తాను- అని భావం.

గడచిన శ్లోకంలో విస్మృత్యభావాన్ని ప్రార్థించారు. విస్మృతి అంటే, మఱపు. విస్మృత్యభావం అనేది అచిత్తుకు కూడా ఉన్నది. విస్మృతి, స్మృతి సమానాధికరణమైనందున, సహజంగా స్మృతి లేని అచిద్వస్తువునకు విస్మృతికూడా ఉండదు. నమ్మాళ్వార్లు కూడా

"మఱప్పుమ్ ఞానముమ్ నానొన్ఱుణర్ న్దిలన్"

(విస్మృతి, జ్ఞానం– అనే వీటిని నేను ఏమీ తెలియని) అని మఱపుకు, స్మృతికి ఆశ్రయం కానందున అచిత్కల్పస్థితిని పలికారు. కనుక, విస్మృత్యభావాన్ని ప్రార్థిస్తే, అచిత్ ప్రాయత్వం వస్తుంది కదా! అనే శంకను "భావయేయం భవంతమ్"(నిన్ను భావన చేయాలి) అని చింతనను ప్రార్థించినందున ఆళ్వార్లు తీర్చినవారయ్యారు.

**5. నాస్థా ధర్మే న వసునిచయే నైవ కామోపభోగే**
**యద్యద్భవ్యం భవతు భగవన్!, పూర్వకర్మానురూపమ్।**
**ఏతత్ ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేఽ పి**
**త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తి రస్తు॥**

ధర్మే = పుణ్యం సంపాదించడంలో, ఆస్థా = ఆసక్తి (మమ =నాకు), న (అస్తి) =లేదు, వసునిచయే = ధనరాశియందు, కామోపభోగే = సంసారంలో స్త్రీ సుఖములను అనుభవించడంలో, ఆస్థా = ఆసక్తి, మమ = నాకు, న (అస్తి) ఏవ = లేనేలేదు, భగవన్ = ఓ పరమాత్మా!, యత్ యత్ = ఏ ఏ, భవ్యం = కావలసియున్నదో (తత్ తత్ = ఆ, , ఆ), పూర్వకర్మానురూపం = ముందటి జమ్మములోని పాపపుణ్యకర్మములకు తగినదిగా, భవతు = అగుగాక, జన్మజన్మాంతరే అపి = ప్రతిజన్మలో, త్వత్ = మీ, పదాంభోరుహ = కమలాలవంటి చరణముల యొక్క, యుగ= జంటను, గతా = పొందిన, నిశ్చలా = దృఢమైన, భక్తిః = అనురాగము, అస్తు = కలుగుగాక (ఇతి = అని), ఏతత్ = ఇదే, ప్రార్థ్యం = కోరదగినది, మమ = నాకు, బహుమతమ్ = మిక్కిలి అభిమతమైనది.

**అవతారిక**

"స్వర్గాదులలో ఇచ్ఛ లేకుండా పోయినా, వర్తమాన శరీరం ద్వారా ధర్మానుష్ఠానాన్ని చేసి, అందువల్ల అర్థకామాలను సంపాదించి, అనుభవించాలనే ఇచ్ఛ లేదా!" అంటే, "అందులోను ఆశ లేదు"- అని గడచిన శ్లోకంలో "నందనేనాపి" అని అపిశబ్దం ద్వారా పల్కిన విషయాన్ని ఇందులో ఇంకా వివరిస్తూ, "భావయేయం భవంతమ్" అని పల్కిన భావన భక్తిరూపమని విశేషించి పల్కుతున్నారు.

**వ్యాఖ్య : (ధర్మే నాస్థా)** - "చాలు" అనే బుద్ధి లేకుండా, ఇంకా ఇంకా అర్థాదులను అనుభవించాలనే బుద్ధితో, అందుకోసం ధర్మానుష్ఠానం చేయడంలో ఆస్త (ఆసక్తి) లేదు.

"విహితత్వాచ్చాశ్రమకర్మాపి” (విధింపబడినది అయినందున ఆశ్రమానికా తగిన కర్మను కూడా ఆచరించాలి) అనేవిధంగా కైంకర్యబుద్ధితో చేస్తున్నాను. స్వర్గసుఖానుభవం పొందాలని ధర్మానుష్ఠానాన్ని చేయడం లేదు- అని పల్కుతున్నారని కూడా చెప్పవచ్చు.

**(న వసునిచయే)** - ఇపుడు పుంజపుంజాలుగా వచ్చే ధనసమూహంలోను ఆశ లేదు.

“నిన్నైయే తాన్ వేణ్ణి నీళ్ శెల్వమ్ వేణ్డాతాన్"

(నిన్ను కోరుతున్నాను తప్ప ప్రాప్తమైన విపులసంపత్తును నేను కోరలేదు) అని పెరుమాళ్ తిరుమొ*ழ*ిలో కూడా ఈ ఆళ్వార్లు పలికారు. "ఈ విధంగా ధర్మాదులలో ఆశ లేకపోయినా, కాంతాది భోగాలలో ఆస్తను కల్గి వీడడం దుర్ఘటంకదా! మీవలె మహారాజు అయిన యయాతి పురు అనే పుత్రుని యౌవనాన్ని ఆశించాడు. బ్రహ్మర్షిత్వసంపాదనకోసం తపోనిష్ఠుడైన విశ్వామిత్రుడు “అహోరాత్రాపదేశేన గతా స్సంవత్సరా దశ" (రాత్రి, పగలు రూపంలో 10 సంవత్సరాల కాలం గడిచింది) అని రాత్రి ఏదో, పగలు ఏదో తెలియకుండా పదేండ్ల పాటు రంభాసక్తుడయ్యాడు. సౌభరిప్రభృతులు కూడా కామాంధులై విషయమగ్నులయ్యారు. కదా" -అని అనగా, దానికి ఇక బదులు పల్కుతున్నారు

**(నైవ కామోపభోగే)** అని ఏవకారం ద్వారా శపథం చేస్తూ పల్కుతున్నారని భావం. “కామోపభోగే ఆస్తా నైవ, నాస్తీత్యన్వయః”. (కామాలను అనుభవించడంలో ఆశ లేనే లేదు— అని అన్వయం) పూర్వకర్మవశంచేత అనుభవైకనాశ్యమైన సుఖదుఃఖహేతులు వచ్చినా రానీ, కర్మలు నశిస్తున్నాయి- అని అనుభవిస్తున్నాను. సుఖదుఃఖ హేతువులు కల్గినా హర్షశోకాలు లేవు. భగవానుడవైన నీకు నా సహృదయంలో ఉండే భావమేదో తెలియదా ?- అనే భావంతో పల్కుతున్నారు. -

**(యద్యదితి)** - (యద్యత్) - ఏ యే సుఖదుఃఖహేతువులున్నాయో? –అని అర్థం.

**(పూర్వకర్మానురూపమ్)** - ప్రాచీన కర్మానుగుణంగా,

**(భవ్యమ్)** - జరుగనున్నదో,

**(హే భగవన్! తద్భవతు)** - "అది రానీ, సుఖదుఃఖ హేతువులు వచ్చినా, హర్షశోకాలు కలుగవు. హృదయాంతర్గతమైన అర్థాలను తెలిసే రీతిలోని సర్వతోముఖ జ్ఞానాన్ని కలవాడవు కదా, నీవు! "- అని తాత్పర్యం. అయినా, మీకు అపేక్షితమేది? అంటే, “తత్ పాదభక్తిజ్ఞానాభ్యాం ఫల మన్య న్న యాచయేత్" అనే విధంగా నీ శ్రీచరణాలలో భక్తియే ప్రతిజన్మలో ప్రార్థించదగినది- అని అంటున్నారు, ఇక.

**(ఏతదితి)** - (మన) - ఈ విధంగా ఇతర విషయవైరాగ్యాన్ని కల్గిన నాకు.

**(బహుమతమ్)** - బహుమతి విషయమైన,

**(ఏతత్)** - ఈ వక్ష్యమాణవిషయం,

**(ప్రార్థ్యమ్)** - ప్రార్థనీయమై –ప్రార్థించదగినదై,

**(భవతి)** - అవుతున్నది. ఇక్కడ “భవతి” అనే ప్రక్రియను అధ్యాహారం చేసికోవాలి. ఇతరవిషయవైరాగ్యం కలుగకపోతే, భగవద్భక్తి బహుమతం కాబోదు. ఇతరత్ర అల్పాస్థిరత్వ నిర్ణయం కల్గినదానికి వేదాంతవిచారం కర్తవ్యమని చెప్పబడినా, భక్తిస్వరూపశోధనం చేసే గుణోపసంహారపాదానికి ముందు వైరాగ్యపాదాన్ని సూత్రకారులు

పలికారు. ఆళ్వార్లు కూడా “వీడుమిన్ ము*ఱ్ఱ*వుమ్" (సంసారసంబంధాలను పూర్తిగా విడువండి)అనే తిరువాయ్ మొ*ళ్రి*లో ఇతర వైరాగ్యపూర్వకంగా భక్త్యుపదేశం చేశారు.

**(జన్మజన్మాంతరేఽపి)** - అనేక జన్మలలో,

**(భక్తిః)** - భక్తి,

**(త్వత్పాదాంభోరుహయుగగతా సతీ)** - తామరలవంటి స్పృహణీయమైన నీ శ్రీచరణద్వయిని పొందినదై,

**(నిశ్చలా అస్తు)** - భక్తి అనేది దేవతాంతరగతం కాకుండా, నీ శ్రీచరణారవింద యుగగతమై, నిశ్చలమై ఉండాలని అర్థిస్తున్నారు.

6. దివి వా భువి వా మమాస్తు వాసో నరకే వా నరకాంతక ప్రకామం
అవధీరిత శారదారవిందౌ చరణౌ తే మరణే ఽ పి చింతయామి

నరకాంతక = నరకాసురుని సమ్హరించిన స్వామి!, మమ = నాకు, దివి వా = స్వర్గమునందుగాని, భువి వా = భూలోకమ్నందుగాని, నరకే వా = నరకమునందు గాని, వాసః = ఉనికి, అస్తు = కలుగనీ, ప్రకామమ్ = అది సమ్మతమే, అవధీరిత = తిరస్కరింపబడిన, శారద = శరదృతువునందు వికసించిన, ఆరవిందౌ = కమలములు గల, తే = దేవరవారియొక్క, చరణౌ = పాదములను, మరణే- =మృత్యుసమయమునందు కూడా, చింతయామి = ధ్యానిచుచుందును.

**అవతారిక**

ఈ విధంగా నేను ప్రార్థించినట్లే, అచంచల మైన భక్తిని ఇచ్చేవాడవైతే, ఉపరితనలోకాలలోగాని, అధోలోకాలలో గాని, నరకంలో గాని నాకు నివాసం ఏర్పడినా ఏర్పడనీ. నీచరణాలను క్షణం కాలం అయినా చింతించకుండా పోతే, ఆత్మధారణను చేయలేని నేను సదా చింతనం చేయడమే కాక, మరణకాలంలోకూడా వానిని విడవకుండా చింతన చేస్తాను. శ్రీచరణాలలో భోగ్యత లేనపుడుకదా వానిని విడువాలి, భోగ్యత్వాదులతో అది శరత్కాలంలోని అరవిందాన్ని కదా ధిక్కరిస్తున్నది—అనే అభిప్రాయంతో ఇందులో పల్కుతున్నారు.

**వ్యాఖ్య: (దివీతి) - (దివి వా)** స్వర్గలోకంలో గాని- అని అర్థం. ఇది, ఉపరితన లోకాలకుకూడా ఉపలక్షణం.

**(భువి వా)** - భూలోకంలోగానీ. ఇది, క్రింది లోకాలకు ఉపలక్షణం.

**(నరకే వా)** - నరకలోకంలో గానీ,

**(మమ)** - త్వత్పాదకమల మకరందాస్వాదలోలుడనైన నాకు,

**(వాసః ప్రకామం భవతు)** - వాసం యథేచ్ఛంగా రానీ. "స్వర్గలోకంలో వాసం కల్గితే దుఃఖం లేదు, నరకంలో వాసం ఏర్పడితే మహాదుఃఖం రాదా?" అంటే, బదులు పల్కుతున్నారు.

**(హే నరకాంతక!)** - సర్వనరకాలకు నీవే నివర్తకుడవై ఉండగా, నాకు నరకవాసం కల్గినా, దానివల్ల దుఃఖం కల్గుతుందా?;నరకం కూడా స్వర్గమేకదా! “నరకమే శువర్క్ మాకుమ్ నామజ్గళుడైయ నమ్బి” (నరకమే స్వర్గం అయ్యే రీతిలోని నామాలను గల గుణపూర్ణుడవు) కదా నీవు— అని భావం. నరకుడనే పేరు గల అసురుని వధించినవాడా! - అని కూడా భావం.

**(అవధీరితశారదారవిందౌ)** - “అవధీరిత”- తిరస్కరింపబడ్డ, “శారదారవిందౌ”- శరత్కాలంలో ఉండే పద్మాలను కల— అని భావం. “ఇందు రిందురివ శ్రీమాన్" (చంద్రుడు చంద్రునివలె కాంతిమంతుడు) అనే విధంగా శ్రీచరణాలకు దృష్టాంతం నీ శ్రీచరణాలే, పద్మం

కాలేదు- అని తలచి, "అడియు మంః (వ) దే" అని తిరుమంగై మన్నన్ పల్కిన రీతిలో పలుకుతున్నారు. అసదృశమైన శ్రీచరణాలకు కాలాంతరంలోని పద్మం ఉపమానం కాకపోయినా, శారదపద్మం దృష్టాంతం కాగా, దానిని కూడా అవధారణం చేసింది- తిరస్కరించింది— అని భావం.

**(తే)** - సర్వప్రకారాలుగా నిరతిశయభోగ్యమైన నీ,

**(చరణౌ)** - శ్రీచరణాలను,

**(మరణేఽ పి చింతయామి)** - ఉత్క్రాంతిదశలో కూడా చింతిస్తాను. శ్రీచరణాలలో ఉండే భోగ్యత నన్ను క్షణం కూడా చింతించకుండా ఉండనీయడంలేదు. అన్ని కాలాలలో చింతించినా, మరణకాలంలో చింతించడం అరుదుకదా! ఆ కాలంలో శ్రీచరణచింతనకు యోగ్యత లేని స్థావరాదిస్మరణం కల్గితే,

"యం యం వాపి స్మరన్ భావం త్యజంత్యంతే కళేబరమ్,
తం తమేవైతి కౌంతేయ! "

(ఎవడు ఏ విధమైన భావాన్ని స్మరిస్తూ చివరిలో న దేహాన్ని విడుస్తాడో, ఆ భావానికి అతడు ఆ భావాన్నే పొందుతున్నాడు) అనే రీతిలో ఆ స్థావరాదిజన్మలే కదా కల్గుతాయి అని అంటే, అపుడు కూడ క్లేశపడినా "యత్నేన చిత్తే వినివేశయంతి" (ప్రయత్నం చేసి మనస్సులో భగవంతుని నిలుపుకుంటారు) నే విధంగా చింతిస్తానని భావం.

**7) కృష్ణ! త్వదీయ పదపంకజపంజరాంతః**
**అద్యైవ మే విశతు మానసరాజహంసః।**
**ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః**
**కంఠావరోధనవిధౌ స్మరణం కుత స్తే ॥**

కృష్ణ = ఓ కృష్ణా, మే = దాసుని, మానసరాజహంసః = మనస్సు అనే రాజహంస, త్వదీయ = నీ సంబంధమయిన, పదపంకజ = కమలములవంటి పాదములనే, పంజర = పంజరం యొక్క, అంతః =లోపలి భాగమును, అద్యైవ = ఇప్పుడే, విశతు = ప్రవేశించుగాక, ప్రాణప్రయాణసమయే = పంచప్రాణములు పోవు వేళలో, కఫ = శ్లేష్మము, వాత = వాయువు, పిత్తైః = ఉష్ణము (అను త్రిదోషముల చేత), కంఠ = కంఠము యొక్క, అవరోధనవిధౌ = మూతపడుట అనే కార్యము సంభవించినపుడు, తే = దేవరవారి యొక్క, స్మరణం = ధ్యానము, కుతః = ఎట్లు? (భవేత్ = కలుగును).

అవ : గడచిన శ్లోకంలో "మరణేఽపి చింతయామి" అని మరణకాలంలోను చింతిస్తాను- అని పల్కిన ఆళ్వార్లు, తరువాత గమనించి చూచారు. కోతివలె అతిచపలమైన ఈ మనస్సు దేహదార్ఢ్యాన్ని కల వర్తమానకాలంలోనే నీ శ్రీచరణాలను ఆశ్రయించకుండా, మరణకాలంలో కఫవాతపిత్తాలవల్ల కంఠానికి అడ్డు వచ్చినపుడు శ్రీచరణాలకు ఏవిధంగా ఆశ్రయించగలదు? మనస్సు నీ శ్రీపాదాలను ఆశ్రయిస్తే కదా, తరువాత చింతనం సిద్ధిస్తుంది- అని తలచి, సర్వత్ర సంచరించే హంస వ్యాధుని చేతిలో చిక్కుకోవడానికి ముందే, బిసతృణాది భోగ్యవస్తు జాతపరిపూర్ణమైన తన అన్నంలో ప్రవేశింపజేస్తే, ఆ భోగ్యవస్తుజాతాన్ని ఆస్వాదించడంలో ఆసక్తమై, అక్కడ స్థిరంగా నిలచి ఉండేటట్లే, నా మనస్సు కఫవాతపిత్తాదులతో కంఠానికి అవరోధం కలుగడానికి ముందుగానే అతిభోగ్యమైన నీ చరణాలను ఇపుడే ఆశ్రయిస్తే, భోగ్యతలో అభినివేశాన్ని పొంది, ఉత్క్రాంతికాలంలో కూడా వాసనాబలంవల్ల శ్రీచరణాలను విడువకుండా ఉంటుంది.

ఇపుడు మనస్సు ఆ విధంగా ఆశ్రయించడం కూడా నీ అనుగ్రహం వల్లనే కావాలి - అనే భావంతో పల్కుతున్నారు.

వ్యాఖ్య : **(కృష్ణేతి)** - **(హే కృష్ణ!)** - శ్రీవైకుంఠంలో పరవాసుదేవుడవై వేంచేసి ఉండే సనీ చరణారవిందాలు భూమిలోనివారు దర్శించి ఆనందించేటట్లుగా గోచరం కాకుండా ఉన్నాయే, - అని తలచి, భూమిలోని అందఱు దర్శించి ఆనందించేటట్లునీవం శ్రీకృష్ణుడవై అవతరించావు.

"గా శ్చారయంతౌ సఖిభి స్సమం పదైః

బృందావనం పుణ్య మతీవ చక్రతుః"

(గోవులను మేపుతూ, తన స్నేహితులతో పాదాలతో సంచరిస్తూ, బృందావనాన్ని చాలా పుణ్య ప్రదేశంగా బలరామకృష్ణులు ఇద్దరు చేశారు) అని బృందావనిలో గోవులను మేపుతూ, అక్కడ ఇక్కడ సంచరిస్తూ క్రీడించే శ్రీకృష్ణా!

**(మే)** - ఈ విధంగా శ్రీకృష్ణుడవై అవతరించినా, అక్రూరుడువలె నిన్ను అనుభవించడానికి తగిన భాగ్యం సంపాదించలేక, "యం యం వాపి స్మరన్ భావం త్యజంత్యంతే కళేబరమ్" (ఏ ఏ భావాన్ని స్మరిస్తూ శరీరాన్ని విడుస్తున్నారో) అని చరణారవింద స్మరణానికి కూడా యోగ్యత లేని జాతులలో జన్మించకుండా, సజ్జన్మ కల్గడానికి తగిన అంతిమ స్మరణం కలిగేటట్లు

"యం యోగినః ప్రాణవియోగకాలే యత్నేన చిత్తే వినివేశయంతి"

(ఏ పరమాత్మను యోగులు తమ ప్రాణం పోయే సమయంలో ప్రయత్నం పూర్వకంగా తమ మనసులో నిలుపుకుంటారో) అనే విధంగా యోగులవలె మనస్సును బలాత్కారంగా ఆకర్షించి, శ్రీచరణాలలో నిలిపేట్లుగా చేయగల్గిన సామర్థ్యాన్ని లేని నాయొక్క - అని అర్థం.

**(మానసరాజహంసః)** - మనస్సు అనే రాజహంస- అని అర్థం. ఒకడు నీచుడే అయినా, భగవత్సంబంధం ఉంటే, అతనిని తక్కువగా భావించరాదని తలచి, తమ మనస్సు శ్రీకృష్ణచరణారవింద సంబంధాన్ని కల్గి ఉన్నందున, దానిని ఆళ్వార్లు రాజహంసగా గొప్పగా పల్కుతున్నారు. లేక, “కాకివేప” మొదలైనవానిని ఆశ్రయించేటట్లు కాకుండా, హంస తామరను ఆశ్రయిస్తుంది. ఆ విధంగానే, తమ చిత్తం "ఈశ్వరోఽ హమ్” అని తలచే దేవతాంతరాల దగ్ధపాదాలను ఆశ్రయించకుండా ఉండే మహోపకారాన్ని తలచి, , రాజహంసగా కీర్తిస్తున్నారు. “ఎన్ నెంజినారు మంగే యొழிన్దార్” (నా మనస్సుగారుకూడా అక్కడికే చేరిపోయారు)అని ఆళ్వార్లు తమ మనస్సును “నెంజినార్” అని గొప్పగా పలికారు కదా!

**(త్వదీయపదపంకజ పంజరాంతః)** - దేవరవారి శ్రీచరణపద్మాల జంటమధ్యలో -అని అర్థం. హంసకు ఆహారం తామర తూండ్లు మొదలైన సర్వభోగ్యవస్తువుల సమూహంతో సంపూర్ణమైన తామర. ఇది కూడా, పంకోద్ధృతపద్మం కాకుండా, పంకంలోనే ఉండే పంకజమే. అందులో హంస ఆనందిస్తూ ఉంటుంది. ఆ విధంగానే, స్వయంగా అతిభోగ్యమై, రథాంగసరసీ ఝషశంఖరేఖాదులతో, దివ్యాంగుళాలతో, అతిభోగ్యాలైన శ్రీచరణాలను ఆశ్రయిస్తే, అక్కడనే నిశ్చలంగా మనస్సు నిలచి ఉంటుంది. కఫాదులతో కంఠావరోధనం కల్గితే, అపూర్వంగా స్మృతి కలుగపోయినా, పూర్వాభ్యాసవశంచేత ఒకసారి కలుగవచ్చు. ఆ విధంగా ఆశ్రయించడం కూడా నీ కృపవల్లనే కావాలి సుమా! - అని అంటున్నారు.

**(అద్యైవ విశతు)** - ఈ నాటికి కానీ, ఉత్క్రాంతి దశలో కానీ ఆశ్రయించవచ్చు- అని అనరాదు. ఎపుడు కంఠాన్ని కఫాదులు ఆక్రమిస్తాయో తెలియదు. కఫాదులచే కంఠం

అడ్డుపడితే, అపుడు స్మృతి కలుగజేయడం నీవల్లకూడా కాదు. "అప్పోదైక్కిప్పోదే శొల్లివైత్తేన్"(ఆ సమయంలో చెప్పవలసినది ఇప్పుడే చెప్పివేశాను) అని పెరియాళ్వార్లు అనుసంధించారు. అంతేకాక, అంతకాలం పాటు నీ అనుభవాన్ని కోల్పోలేను. ఇపుడే ప్రవేశింపజేయాలి (ఆశ్రయించాలి).

**(విశతు)** - ఇది ప్రార్థనలో లోట్.

**(ప్రాణప్రయాణ సమయే)** - ప్రాణోత్క్రమణ సమయంలో,

**(కఫవాతఫిత్తైః)** - - కఫం, వాతం, పిత్తం- అనే వీటిచే,

**(కంఠావరోధనవిధౌ)** - "ఐయార్ కణ్డమడక్కిలుమ్" (కఫం కంఠానికనికి అడ్డుపడితే) అనేవిధంగా కంఠానికి అవరోధనం కల్గినపుడు,

**(తే)** - "కేవలం మదీయయైవ దయయా" (కేవలం నా నిర్హేతుక కృపతో) ని పల్కిన నీయొక్క.

**(స్మరణమ్)** - స్మృతి,

**(కుతః)** - "భవేత్" (అవుతుంది?) అని క్రియను అధ్యాహారం చేసికోవాలి.

**(కుతో భవేత్)** - ఏ విధంగా వస్తుంది? ఏ రీతిలోను రాదు.

**8) చింతయామి హరిమేవ సంతతం**
**మంద మంద హసితాననాంబుజమ్।**
**నందగోప తనయం పరాత్పరం**
**నారదాది మునిబృంద వందితమ్॥**

నదగోపతనయం = నందునికి సుతుడు, పరాత్పరం = మిక్కిలి శ్రేష్ఠుడు, నారద + ఆది = నారదుడు మొదలైన, మునిబృంద = మునుల సమూహము చేత, వందితం = నమస్కరింపబడువాడు, మంద మందహసిత = మిక్కిలి స్వల్పమైన చిరునవ్వుగల, ఆనన + అంబుజం = కమలమువంటి మోము కలవాడైన, హరిమేవ = హరినే, చింతయామి = తలచుచున్నాను.

**అవతారిక**

ఈ రీతిలో, “అద్యైవ మే విశతు" అని ప్రార్థించిన విధంగా శ్రీకృష్ణుడు ఆళ్వార్లను అనుగ్రహించగా, "సర్వకాలం స్వామిని చింతిస్తాను" అని ఇందులో వారు పల్కుతున్నారు.

వ్యాఖ్య : **(చింతయామీతి)** - **(హరి మేవ సంతతం చింతయామి)** - హరిని ఒక్కని మాత్రమే సతతం ధ్యానిస్తున్నాను. రుద్రుడు, మొదలైన దేవతాంతరాలను చింతించడం లేదు.

“హరిర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః”

(చెడ్డ మనసును కలవారు కూడా హరిని స్మరిస్తే, అతడు వారి పాపాలను హరిస్తాడు) అని సంసారవర్ధకాలైన అన్ని పాపాలను స్మరణమాత్రంతోనే అపహరించే రీతిలోని హరిని వీడి, సంసారవర్ధకులైన రుద్రాదులను ధ్యానించవచ్చునా?- అని భావం. ఇది ఏవకారార్థం.

(ఇప్పుడు "హరిర్హరతి" అనే శ్లోకం వివరింపబడుతున్నది)

**(దుష్టచిత్తైరపి స్మృతః)** - ఏ పురుషుడైనా మనస్సులో స్మరిస్తే, ఆ పురుషుని మనఃశుద్ధి మొదలైనవానిని చూడడు. కనుక, దోషాలను నివృత్తి చేసికొని స్మరించాలనే నిర్బంధం ఏమీ లేదు.

"మొయ్ త్త వల్వినైయుళ్ నిన్డు మూన్డెళుత్తుడైయ పేరాల్,

కత్తిరబందు మన్డే పరాజ్గతి కణ్డుకొణ్డాన్"

(క్షత్రబంధువు అనేవాడు మూడు అక్షరాలను గల భగవన్నామాన్ని చెప్పినందున, బాగా పోగుబడిన, బలమైన పాపాలనుండి విముక్తుడై, అప్పుడే పరగతిని పొందాడు)అని మహాపాపి అయిన క్షత్రబంధువు కూడా గోవిందనామస్మరణ చేసేటపుడు, పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికొని, తరువాత నామోచ్చారణం చేసినట్లు చెప్పబడలేదు. నామోచ్చారణమే పాపహరమై ఉత్తమగతికి హేతువు అవుతున్నది.

విభీషణాళ్వాన్ సముద్రతీరంలో శరణాగతిని చేసినపుడు, సముద్రంలో మునిగి, తర్వాత శరణాగతి చేశాడని చెప్పబడలేదు. అర్జునుడు యుద్ధరంగంలో “శాధి మాం త్వాం ప్రపన్నమ్” (నిన్ను శరణ పొందిన నన్ను నీవు ఆజ్ఞాపించు) అని అన్నాడు. ద్రౌపదికూడా రజస్స్వలాకాలంలో "హే కృష్ణ! ద్వారకావాసిన్! " అని ఆక్రందించింది. అందువల్ల, భగవంతుడు తన చింతన భజనాదులకు చేతనుని శుద్ధి, అశుద్ధి - అనే ఏమీ గమనించడు. ఇది "దుష్టచిత్తైరపి స్మృతః” అనేచోట గల “అపి” అనే పదంయొక్క అర్థం. పాపాలను హరించేటపుడు కూడా అర్థవ్యయకాలదైర్ఘ్య- దేహశ్రమాదులను సహించి, యాగాదులను చేయాలనే నిర్బంధం ఈశ్వరునకు లేదు.

**(స్మృతః)** సకృత్ స్మరణమాత్రంతో హరిస్తున్నాడు. అపహరింపబడే పాపాన్ని చూస్తే "తమర్ కళ్ కూట్ట వల్వినై" (భక్తుల బలమైన, అనేకంగా ఉండే పాపాలు) అనే విధంగా గుంపులు గుంపులుగా అది ఉంటుంది. నా పాపాలు ఈ విధంగా ఉండగా, హరిని చింతించకుండా, దేవతాంతరాలను చింతిస్తానా? అని భావం.

స. వ్యాధి మొదలైనవానిని తీర్చే కొన్ని ఔషధాలు చేదుగా, అభోగ్యంగా ఉంటాయి. ఆ రీతిలోనే చింతనీయుడు, పాపహరుడు అయిన ఇతడు కూడా చేదుగా, అభోగ్యంగా ఉంటాడా? అని అంటే, దానికి బదులు పల్కుతున్నారు—

**(మందమందహసితాననాంబుజమ్)** - అని అంటూ. మందహాసాన్ని కల తామరపూవువంటి ముఖాన్ని కల -అని అర్థం. దంతాలు బయటకు వ్యక్తం కాకుండా ఉండే, జనమనోరజంకమైన హాసం, తామరపూవుకు ఈషద్వికాసంవలె మనోహరంగాకదా ఉంటుంది. ఈ మందహాసం గాంభీర్యాన్ని సూచించేదిగా కదా ఉంటుంది. అంబుజపదం ద్వారా భోగ్యత్వం వివక్షింపబడింది. స్వస్థానంలో పూచిన తామరవలె సర్వజనాహ్లాదకమై, దర్శనీయమై స్వామిముఖం ఉంటుంది— అని అర్థం. కొందఱు ప్రభువులను యాచిస్తే ఈషత్తుకూడా ఇవ్వకుండా ఉండడమే కాక, ముఖంలో చిటపటలాడుతూ ఉంటారు. ఇతడు (స్వామి) ఈ విధంగా ఉండడు. ముఖంలో మందహాసం కల్గి ఉంటాడు. ఏదో ఒక కాలవిశేషంలో మందహాసాన్ని కల్గి ఉండి, మిగిలిన సమయాలలో నవ్వును ముఖంలో కలిగి ఉండకపోతే, యాచించేవారికి శ్రీకృష్ణుని సంతోషకాలాన్ని ఎదురు చూడవలసి వస్తుంది. ఈ రీతిలో కాకుండా, అన్ని కాలాలలో మందహాసాన్ని కల్గి ఉన్నందున సదా సంతోషకాలమే- అని తోస్తుంది. కనుక. ఎపుడైనా ప్రార్థించవచ్చు- అనేది "సంతతమ్" అనే పదానికి అర్థం. సంతతమనే పదాన్ని ముందు వెనుకలలో అన్వయించి, "సంతతం మందమందహసితాననాంబుజం హరిమేవ సంతతం చింతయామి" అనే అన్వయాన్ని గ్రహించాలి.

"యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవో న చింత్యతే,
సా హానిః తన్మహచ్ఛిద్రం సా భ్రాంతి స్సా చ విక్రియా”

(ఒక్క ముహూర్త కాలం అయినా, క్షణం అయినా వాసుదేవుని స్మరించకపోవడం అనేది గొప్ప హాని, అదే గొప్ప ఆపద, అదే భ్రాంతి, అదే వికారం) అని కదా హరినామస్మరణ సదా చేయాలని చెప్పబడింది. ఈ విధంగా, సదా మందహాసాన్ని కల్గినవానిని విడచి, “సోஉరోదీత్" అనే విధంగా రోదన ముఖాన్ని కలవానిని చింతిస్తానా ? అంతేకాక, శైత్యసౌరభ్యాది గుణప్రచురమైన అంబుజం ఆహ్లాదకమై ఉండేటట్లే, ఇతని ముఖం కూడా ఆహ్లాదకరంగా ఉంటుంది. రుద్రుడు తన లలాటంలోని అగ్నినేత్రంతో దహిస్తాడు. ఈ విధంగా అనేకగుణపూర్ణుడైనా, సౌలభ్యం ఉండవద్దా ? సౌలభ్యం లేకపోతే ఆశ్రయణం విలు కాదుకదా! అంటే, ఇక దానికి బదులు పల్కుతున్నారు.

**(నందగోపతనయమ్)** - పశువులను మేపే నందగోపాలుని ఇంటిలో అతనికి కుమారుడై పుట్టాడు. గొల్లలు తమ పిల్లల చేతికి కర్రను ఇచ్చి పశువులను మేపుకొని రమ్మని నియోగించేటట్లే, నందుడు కూడా ఇతనిని నియమించేటట్లు అత్యంతం భవ్యుడై (విధేయుడై) ఉంటాడు. అంతేకాక, తిరువిరుత్త ప్రబంధంలోని "శూట్టునన్ మాలైకళ్ తూయన వేన్ది" అని అంటూ, నిత్యసూరులు దివ్యవిరజానదీ తీర్థాలతో తిరుమంజనం చేసి, ధూపదీపాది సమర్పణం చేసి, భోజ్యాసనంలో వేంచేపు చేసేటట్లే, వారికి తెలియకుండా ధూపధూమంలో మఱుగుపడి, వారికంటిలో ఇసుకజల్లి (కళ్ళుకప్పి) నందుని ఇంటిలో నవనీత చౌర్యం చేసి, భుజించాలని అతనికి కుమారుడై అవతరించాడు- అని ఆళ్వార్లు. అన్నారు. దధిక్షీరనవనీతాదులలో అపేక్ష ఉంటే, తనకు అసాధారణమైన క్షీరాబ్ధి ఉండగా, అక్కడకు పోకుండా, ఈ నందుని ఇంటికి చౌర్యంచేసి తినాలని వచ్చాడు కదా! ఇదేమి సౌలభ్యం! - ఆహా! - అని తాత్పర్యం. శ్రీకృష్ణుని వాసస్థానం— దధిఘృత

నవనీత క్షీరాది ప్రచురమైన నందుని ఇల్లు. రుద్రునకు వాసస్థానం— అస్థిభస్మప్రేతాది ప్రచురమైన శ్మశానం.

ఈ విధంగా సౌలభ్యం ఉన్నా, పరత్వం లేకపోతే సౌలభ్యం ప్రకాశించదే! అంటే ఇక బదులు, పల్కుతున్నారు.

**(పరాత్పరమ్)** - ఇతరదేవతలకంటే గొప్పవాడై ఉన్నాడు—అని అర్థం. లేక, "అక్షరాత్ పరతః పరః" అని ఇతరమహదాది కార్యవర్గాపేక్షయా పరభూతమైన మూలప్రకృతికి కూడా పరభూతమైన జీవసమష్టికంటే పరుడై ఉండేవాడు. భగవంతుని కంటే అవరమై ఉండడం అనేది కృమికీటాది జీవరాసులతో, , బ్రహ్మరుద్రాదులతో ఏ తేడా లేదని భావం.

శ్రీకృష్ణుడే పరదేవత -అని మీరు ఏవిధంగా గ్రహించారు?- అంటే దానికి ఇపుడు బదులు పల్కుతున్నారు.

**(నారదాదిమునిబృందవందితమ్)** - కాలవిశేషంలో రుద్రునకు తండ్రి అయిన బ్రహ్మకు కూడా ఉపదేశించే రీతిలోని మాహాత్మ్యాన్ని కల నారదాది మునులు గుంపులు గుంపులుగా వచ్చి, శిరసా నమస్కరించి, వందనం చేసే రీతిలోని గొప్పతనాన్ని చూస్తే "శ్రీకృష్ణుడే పరదేవత" అని అనడంలో అడ్డు ఏమున్నది? - అని భావం.

"తత్ర షోడశభిః సద్మ సహస్రైః సమలంకృతమ్,
వివేశ కతమం శౌరేః పత్నీనాం భవనం మహత్"

(అక్కడ 16 వేల మంది భార్యల చేత అలంకరింపబడిన, శ్రీకృష్ణుని గొప్ప భవనాన్ని నారదుడు ప్రవేశించాడు) అని పదహారు వేలమంది దేవేరులతో ఉండేటపుడు నారదుడు వచ్చి, అన్ని గృహాలలోను శ్రీకృష్ణుడుండే అత్యాశ్చర్యాన్ని చూచి, తలవంచి,

“అనుజానీహి మాం కృష్ణ ! లోకాం స్తే యశసాప్లుతాన్,
పర్యటామి తవోద్గాయన్ లీలా భువనపావనీః"

(శ్రీకృష్ణా! నీ కీర్తి చేత అంతటా వ్యాపించిన లోకాలను అంతటా తిరుగుతూ, నీవు చేసిన, లోకాలను పవిత్రం చేసే లీలలను గానం చేస్తూ సంచరించేవాడనుగా నన్ను తెలుసుకో) ఇత్యాదిగా పల్కిన సూక్తి ఇక్కడ అనుసంధేయం. "ఏవంభూతం హరిమేవ సంతతం చింయామి” (ఇటువంటి హరినే నేను నిత్యం చింతిస్తున్నాను)అ ని అన్వయం.

**9) కరచరణసరోజే కాంతిమన్నేత్రమీనే**
**శ్రమముషి భుజవీచివ్యాకులేఽ గాధమార్గే।**
**హరిసరసి విగాహ్యాఽఽపీయ తేజోజలౌఘం**
**భవమరుపరిఖిన్నః ఖేద మద్య త్యజామి॥**

భవ = సంసారం అనే, మరు = నీరు లేనిచోటా తిరుగడంవల్ల, పరిఖిన్నః= డస్సినట్టి (అహం = దాసుడనైన నేను), కరచరణసరోజే = చేతులు, కాళు అనే కమలములు గల, కాంతిమత్ = కాంతిగల, నేత్ర = కన్నులు అనే, మీనే = చేపలు గల, శ్రమముషి = బడలికను పోగొట్టునది అయిన, భుజ= చేతులు అనే, వీచి = అలలచేత, వ్యాకులే = కలిగినది, అగాధమార్గే = లోతైన త్రోవగలది అయిన, హరిసరసి = శ్రీమహావిష్ణువు అనే కొలనులో, విగాహ్యా = ప్రవేశించి, తేజో జలౌఘం = తేజస్సు అనే జల సమూహమును, ఆపీయ = బాగా పానము చేసి, ఖేదం = బడలికను, అద్య = ఇప్పుడే, త్యజామి =విడుచుచున్నాను.

**అవతారిక**

కొందఱు రుద్రుడు ఇంద్రుడు- అనే వీరిని ఆశ్రయించి, ఏవో కొన్ని పశుపుత్రధనాదులను పొంది జీవిస్తున్నారు. "హరిమేవ చింతయామి" అని ఇతర దేవతావ్యావృత్తి పూర్వకంగా హరినే ధ్యానించి, మీరు పొందిన ఫలమేమి? అని అంటే, తలదాచుకొనే నీడ, తాగడానికి నీరు కూడా లేని మరుకాంతారంలో గతాగతాలను చేసి (సంచరించి) దారి తెన్ను తెలియక ఉండేవాడు దివ్యపంకజ శోభితమై, మదముదిత మీనాకులమై, తరంగ పరిపూర్ణమైన ఒక సరస్సును చూస్తే, అందులో అవగాహనం చేసి, దివ్యతీర్థాలను పానం చేసి, శ్రమను పోగొట్టుకొన్నట్లే, సంసారమరుకాంతార పరిఖిన్నుడనైన నేను. "ఏష బ్రహ్మ ప్రవిష్టోఽస్మి గ్రీష్మే శీతమివ హ్రదమ్" (గ్రీష్మకాలంలో చల్లని తటాకాన్ని ప్రవేశించినట్లుగా, నేను ఈ పరమాత్మ లోపల ప్రవేశిస్తున్నాను) అనే విధంగా సరస్సులో ఉండే లక్షణాలు హరికి కూడా ఉన్నందున, హరి అనే సరస్సులో

స్నానం చేసి, ఆ ఖేదాన్ని విడచాను. దీనికి మించిన గొప్ప ఫలమున్నదా ?- అని అంటున్నారు.

వ్యాఖ్య : **(కరచరణసరోజే)** - శ్రీహస్తాలు, శ్రీచరణాలు - అనే తామరపూవులను కల్గినది— అని అర్థం. హరితిరుమేనిలోని కరచరణాల సన్నివేశాన్ని దర్శిస్తే, తిరుమేని అనే తటాకానికి పూచిన తామరలవలె అవి ఉన్నాయని భావం. తామర చూడడానికి మనోహరమై, తాపహరమై ఉండడంతో పాటు, దేహంతో సంబంధాన్ని కల్గి ఉండేటపుడు శైత్యసౌరభ్యాదులతో తాపహరమై ఉండే తటాకంవలె, స్వామి కరచరణాదులు దృష్టికి ప్రియంగా ఉండడంతో పాటు, దేహసంబంధాన్ని పొందితే తాపహరమై ఉంటుందని భావం.

**(కాంతిమన్నేత్రమీనే)** - కాంతిమత్- ఆరుణ్యకాంతిని కల, నేత్రాలనే - తిరునేత్రాలనే చేపలను కల్గిన, - అని అర్థం. “రామం రక్తాంతనయనమ్" (కొంచెం ఎర్రని ఖలను చివరలో కలిగిన నేత్రాలను కల రాముని) అనే విధంగా ఎఱ్ఱని నేత్రాలు యౌవనమదజనిత లౌహిత్యాన్ని కల్గిన చేపలవలె ఉన్నాయని భావం. “శెజ్గయలుకళుస్దేమ్బనై" అనేచోట —యౌవనమదలోహిత మత్స్యమని సాక్షాత్స్వామి మొదలైనవారు వ్యాఖ్యానించారు. అందువల్ల “కాంతిమత్” అనే పదానికి "లోహితకాంతిని కల్గిన” —అనే అర్థాన్ని గ్రహించాలి. నమ్మాళ్వార్లు “కణ్ కైకాల్ తూయ శెయ్య మలర్కళాయ్"(కళ్ళు, చేతులు, కాళ్లు పవిత్రమైన, ఎర్రని తామర పువ్వులవంటివై) అని ఆరంభించి, “వాశత్తడమ్ పోల్ వరువానే”(పరిమళాన్ని కలిగిన తటాకం వలె వచ్చేవాడే) అని భగవానుని నీలమైన తిరుమేని అనే తామరతటాకానికి నేత్రహస్తపాదాలు నిర్మలారుణారవిందాలుగా ఉన్నాయని అన్నారు. అక్కడ తటాకానికి అసాధారణమైన మత్స్యాల ప్రసక్తి లేదు - అని భావించి, ఈ ఆళ్వార్లు కరచరణాలను తామరలుగా, కన్నులను చేపలుగా పలికారు. నీటిలోని చేపలను చూస్తే తాపం తీరేటట్లే, స్వామి తిరునేత్రాలను దర్శించినంతమాత్రంలో, అవి తాపం తీర్చేటట్లుంటాయని భావం.

**(శ్రమముషి)** తటాకాన్ని చూడగానే తాపం పొందినవానికి అది శ్రమనివర్తకంగా ఉండేటట్లే, స్వామితిరుమేనిని చూడగానే, అది శ్రమహరంగా ఉంటుంది అని భావం.

**(భుజవీచి వ్యాకులే)** బాహువులనే కెరటాలతో చంచలమైన- అని అర్థం. తటాకం అలలతో చంచలంగా ఉండేటట్లే, "బాహుభ్యాం పరిషస్వజే' (బాహువులతో ఆలింగనం చేసుకొన్నాడు) అనేవిధంగా ఆశ్రితాలింగనంలోని ఆతురతతో అతిచంచలమైన స్వామి తిరుమేని ఉంటుంది.

**(అగాధమార్గే)** - తటాకం లోపలికి పోయే కొలది మార్గం అగాధంగా ఉంటుంది. హరియొక్క స్వరూపస్వభావ విగ్రహగుణాదులను పరిచ్ఛేదించడం ఆరంభిస్తే, చూచే కొలదీ అగాధంగా, - అపరిచ్ఛిన్నంగా- "యతో వాచో నివర్తంతే" (దేని నుండి వాక్కులు వెనుదిరుగుతున్నాయో) అనేవిధంగా ఉంటుంది.

**(హరిసరసి)** - హరి అనే సరస్సులో,

**(విగాహ్య)** - సరస్సులో దిగి లోతుగా స్నాన మాడినట్లు "ఏష బ్రహ్మ ప్రవిష్టోఽ స్మి" (తటాకంవంటి ఈ పరమాత్మలో ప్రవేశించాను) అని,"

గంభీరపూర్ణమధురం మమ ధీర్భవంతం,
గ్రీష్మే తటాకమివ శీత మనుప్రవిష్టా"

(గంభీరమైనవాడవు, గుణాలతో పూర్ణమైనవాడవు, భోగ్యుడవు, చల్లనివాడవు అయిన నిన్ను, న నా బుద్ధి గ్రీష్మకాలంలో లోతయిన, నిండైన, తీయని, చల్లని తటాకంలోవలె ప్రవేశించినది. )అని పల్కినట్లుగా నీరక్షీరం వలె ప్రవేశించి, కలసి— అని అర్థం. "అణియరఙ్గ మాడుదుమో తోழி! " (చెలీ! అందమైన శ్రీరంగాన్ని అవగాహిద్దామా) అని,

“పొఱ్ఱామరైక్కేయమ్ నీరాడ పోనాళ్” (అందమైన తామరలతో నిండిన తటాకంవలె ఉండే భగవంతుని అవగాహహించడానికి వెళ్ళింది) అని భగవత్సంశ్లేషం స్నానంగా చెప్పబడుతున్నది కదా.

**(తేజోజలౌఘ మాపీయ)** - తేజస్సు అనే జలసమూహాన్ని తాపం తీరేటట్లు పానం చేసి- అనిభావం. సరస్సులో జలం వ్యాపించి, సర్వత్ర వ్యాప్తమై, శీతమై ఉండేటట్లే, తేజస్సు కూడా తిరుమేని అంతటా వ్యాపించి, ఆశ్రితవిషయంలో చల్లగా ఉన్నందున, తేజస్సు జలంగా రూపించబడింది. తటాకంలో అవగాహనం చేసినంతమాత్రంలో శ్రమ పోవడమేకాక, జలాన్ని పానం చేస్తే, నిశ్శేషంగా తాపం తీరేటట్లే, పరమాత్మను దరిచేరిన మాత్రంలో శ్రమ తీరడమే కాక, ఆ స్వామికి కల తేజఃప్రసృతి గుణాలను అనుభవిస్తే సర్వసంసారతాపం కూడా తీరిపోతుంది- అని భావం. తేజస్సుకు ఔష్ణ్యం స్వాభావికంగా ఉండడంతో పాటు, “అభితః పావకోపమమ్” (అగ్నితో సమానుడైన శ్రీరాముని ముందు) అని ఇతడు (స్వామి) ఉన్నందున శీతస్వభావమైన జలంగా తేజస్సును చెప్పవచ్చునా? అని అంటే, తేజస్సు, విరోధులు ఉష్ణంగా ఉన్నా, అది అనుకూలురకు శీతలమై ఉంటుంది కనుక, ఈ ఆళ్వార్ల విషయంలోను శీతలమై ఉన్నందున జలంగా రూపించారు.

**(భవమరుపరిఖిన్నః)** - సంసారమనే కురుకాంతారంలో అంతటా ఖిన్నుడనైన నేను - అని అర్థం. “మరుకాంతారంలో జలం లేకపోవడంతో పాటు, చెట్టునీడకూడా ఉండదు కనుక, బాటసారి ఆతపతప్తుడై ఖిన్నుడవుతాడు. ఆ విధంగానే, సంసారంలో ఆధ్యాత్మిక- ఆధిభౌతిక - ఆధిదైవికాది క్లేశాలతో ఖిన్నుడనైన,

**(అహమ్)** - నేను,

**(అద్య)** - ఇపుడు, హరిసరస్సులో అవగాహనం చేసి, తేజోజలపానం చేసిన తరువాత - అని భావం.

**(ఖేదం త్యజామి)** - ఖేదాన్ని విడుస్తున్నాను. సంసారతాపంవల్ల కల్గిన శ్రమను విడచాను. ఇపుడు. ఇతర దేవతను గూర్చి చింతించకుండా, హరిని చింతనం చేసినందున సంసారతాపాన్ని త్యజించాను. ఇతరదైవాన్ని ఆశ్రయించి సంసారాన్ని వెల కొనేవారున్నారా? అని పల్కుతున్నారని భావం.

## 10. సరసిజనయనే సశంఖచక్రే మురభిధి మా విరమస్వ చిత్త రంతుమ్।
## సుఖతర మపరం న జాతు జానే హరిచరణస్మరణామృతేన తుల్యమ్॥

స్వచిత్త = ఓ మనసా, సరసిజనయనే = కమలమును పోలిన కన్నులు కలవాడు, సశంఖచక్రే = శంఖచక్రములతో కూడినవాడు అయిన, మురభిది = మురుని సంహరించినవాడు అయిన శ్రీమహావిష్ణువునందు, రంతుం = విహరించుటకు, మా విరమ = వెనకడుగువేయకుము, హరి = విష్ణువుయొక్క, స్మరణ = సంకీర్తనమనే, అమృతేన = అమృతముతో, తుల్యం = సమానమయిన, సుఖతరం = మిక్కిలి ఆనందమును కలిగించేటటువంటి, అపరం = మరొక వస్తువును, జాతు = ఒకప్పుడు, న జానే = గుర్తు ఎరుగను.

**అవతారిక :**

“అద్యైవ మే విశతు మానసరాజహంసః” (నా మనస్సు అనే రాజహంస ఈనాడే శ్రీకృష్ణుడేని పాదాలనేఏ పంజరంలోకి ప్రవేశించాలి) అని ప్రార్థించినట్లే, శ్రీకృష్ణానుగ్రహంవల్ల అతనిని ఈ ఆళ్వార్ల మనస్సు ఆశ్రయించినా, శ్రీకృష్ణుని కంటే, క్లేశవివర్తకుడు, భోగ్యభూతుడైన ఇంకొక వస్తువు ఉన్నదా? అనే సందేహంతో, వేఱొక చోటకు మనస్సు పోతుందా? మనస్సు అన్యత్ర వేఱొక చోటుకు పోకుండా ఉన్నప్పుడు కదా “హరిసరసి విగాహ్య” అని అవగాహించి, ఖేదాన్ని విడువడం సంభవిస్తుంది- అనే భయం వల్ల తమ చిత్తాన్ని చూచి, సర్వక్లేశనివర్తకం, పరమభోగ్యభూతమైన వస్తువు శ్రీకృష్ణుడు తప్ప ఇంకొకడు లేదు. అందుచేత, శ్రీకృష్ణుని రమించడం (దర్శించి, ఆనందించడం) నుండి

విచ్ఛేదాన్ని పొందకు- దర్శించి ఆనందాన్ని పొందడం మానకు—అని దానిని అర్థిస్తున్నారు.

**వ్యాఖ్య :- (సరసిజేతి)** (సరసిజనయనే) గంభీరాంభస్సముద్భూతాలైన పద్మాలవలె (నిండు నీటిలో పూచిన తామరలవలె) కదా, స్వామినేత్రాలుంటాయి. మనం దర్శించి ఆనందించడానికి ఆ నేత్రసౌందర్యం ఒక్కటి చాలదా? స్వామిపుండరీకాక్షత్వాన్ని చూస్తే వేఱొక చోట పరత్వశంక కల్గుతుందా? పుండరీకాక్షత్వం పరత్వసూచకమని భావం. విరోధినివర్తనానికి ఆయుధాలు లేవా ? అంటే,

**(సశంఖచక్రే)** - "స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్"

(పంచజన్యశంఖం చేసిన ఆ గొప్ప ధ్వని కౌరవుల హృదయాలను పగులగొట్టింది) అనేవిధంగా శత్రునిరసనైకస్వభావమై, దివ్యాభరణంవలె భోగ్యమైన శంఖాన్ని, చక్రాన్ని చేతిలో ధరించాడు.

**(మురభిది)** - మురాసురుని భేదనం (సంహారం) చేసినట్లే, మన విరోధి పాపవర్గాన్ని కూడా భేదనం చేసేవాడు. ఇటువంటి శ్రీకృష్ణుని విషయంలో,

**(హే చిత్త)** - భగవద్విషయంలో ప్రావణ్యాన్ని కల నా మనసా!

**(రంతుం మా విరమస్వ)** - ఆనందించడం మానివేయకు. ఆనందించడానికి ఇంకొక సుఖతమమైన వస్తువు ఉన్నదని తలచి, మొదట ఆశ్రయించిన శ్రీకృష్ణుని విషయంలో ఆనందించడం మానకు. "మా విరమస్వ" అనేది ప్రార్థనలో లోట్. "మా విరమస్వ" అనే పాఠం కంటే "మా విరమేహ" అనే పాఠం మంచిది. 'విరమ" అనే పదమే శబ్దశాస్త్రసమ్మతం. 'మా విరమస్వ" అనేది శబ్దశాస్త్ర విరుద్ధమంటారు.

“మా విరమేహ” అనే పాఠంలో-

ఇహ మురభిది = శ్రీకృష్ణుని విషయంలో, రంతుం మా విరమ = క్రీడించడం మానకు- అని అర్థం. లేక, ఇహ ఈ లోకంలో “మురభిది మా విరమ” అని అన్వయం. లేక, ఇహ = ఈ లోకంలో, “హరి చరణస్మరణామృతేన తుల్యం న జాతు జానే" అని అన్వయం.

తనకు భవ్యమైన మనస్సును చాంచల్య స్వభావాన్ని చూచి, తలవంచి ప్రార్థిస్తున్నారు. “మనమే! ఉన్నై వల్వినైయే నిరన్దు" (ఓ మనసా! బలమైన పాపాలను కల నేను నిన్ను ప్రార్థిస్తున్నాను) అనే పాశురంలో వనస్థలిపుష్పిత శీతలతులసీమాలాలంకృతుడై, అందువల్లనే పరమభోగ్యభూతుడై, అసదృశుడైన అతనిని, ఓ మనసా! విడువకు. నీకు దాసుడను- అని మనస్సును నమ్మాళ్వార్లు ప్రార్థిస్తున్నారు.

శ్రీకృష్ణుని స్వరూపం సుఖరూపం కాదని విడచిపెట్టాలా ? విరోధినిరసన శీలత్వం లేదని విడచిపెట్టాలా ? సర్వం సంపూర్ణమై ఉండగా, ఏ రీతిలోను విడువడానికి కారణం లేదు- అని భావం. (ఈ వివరణ అంతా "సరసిజనయనే "అని మొదలైన విశేషణాలవల్ల భాసించే హార్దమయిన భావం. )

అయితే, శ్రీకృష్ణుని కంటే ఉత్కృష్టవస్తువు ఉండే పక్షంలో, ఇతనిని విడువవచ్చు. కాని, అటువంటి వస్తువు కాలత్రయంలోను ఉన్నదని నేను తెలియను. నీవు చూస్తే చెప్పు. తరువాత దానిని పొందవచ్చు- అనే భావంతో పల్కుతున్నారు.

**(అపరం సుఖతరం వస్తు)** - ఇతనికంటే వేఱు ఉత్కృష్టమైన సుఖమైనది, .

**(న జాతు జానే)** - ఏ కాలంలోను నేను తెలియను. ఇందువల్ల, నీవు చూస్తే చెప్పు- అనేది అర్థసిద్ధం ఉత్కృష్టవస్తువు లేకపోయినా, సమమైన వస్తువు అయినా ఉన్నదా? అంటే, పలు మాటలెందుకు? స్వరూపవిగ్రహాదులన్నిటిలో సమమైన వస్తువు సంగతి వదిలిపెట్టండి, . విగ్రహైకదేశమైన శ్రీచరణాల స్మరణమనే అమృతంతో తుల్యమైన వస్తువు ఉన్నదా? అంటే, అదికూడా లేదు.

**(హరిచరణస్మరణామృతేన తుల్యమ్)** హరిచరణస్మరణమే అమృతంవలె ఉంటుంది. దానితో తుల్యమైన వస్తువు ఇంకొకటి నాకు తెలియదు. "అపరం సుఖతరం న జాతు జానే, హరిచరణస్మరణామృతేన తుల్యం చ వస్తు న జానే" అని అన్వయం.

అందువల్ల ఓ మనసా!, ఇటువంటి కృష్ణుని విడువకుండా ఉంటే, నేను ఇప్పుడే హరిసరస్సులో మునిగి సంసారతాపాన్ని త్యజిస్తాను- అని గడచిన శ్లోకంతో అన్వయం.

**11. మా, యభీ ర్మంద! మనో విచింత్య బహుధా యామీ శ్చిరం యాతనా:**
**నామీ న: ప్రభవంతి పాపరిపవ: స్వామీ నను శ్రీధర: ।**
**ఆలస్యం వ్యపనీయ భక్తిసులభం ధ్యాయస్వ నారాయణం**
**లోకస్య వ్యసనాపనోదనకరో దాసస్య కిం న క్షమః? ॥**

మందమనః = ఓ మూఢమైన మనసా, యామీః = యముని సంబంధమైన, బహుధా = అనేకవిధములైన, యాతనాః = నరకబాధలను, చిరం = బహుకాలము, విచింత్య =తలంచి, మా భీః =భయపడవద్దు, అమీ = ఈ, పాపరిపవః = పాపములనే శత్రువులు, నః =మనకొఱకు, న ప్రభవంతి = సమర్థములు కావు, శ్రీధరః = విష్ణువు, నః= మనకు, స్వామీ నను =శేషిగదా, ఆలస్యం =జాగుచేయుటను, వ్యసనీయ = పోగొట్టి, భక్తిసులభం = భక్తి చేత సులువుగా పొందదగిన, నారాయణం = విష్ణువును, ధ్యాయస్వ = ధ్యానము చేయుము, లోకస్య = ప్రపంచములోని జనులయొక్క, వ్యసన = దుఃఖముయొక్క, అపనోదన = పోగొట్టుటను, కరః

= చేసే (సః = నారాయణ మూర్తి), దాసస్య = భక్తునియొక్క (వ్యసనాపనోదకరణే = వ్యసనమును పోగొట్టుటయందు), న క్షమః కిం = సమర్థుడు కాడా యేమి?

**అవతారిక**

శ్రీకృష్ణుడు సర్వేశ్వరుడై, పరమభోగ్యభూతుడై ఉన్నా, నేను చేసిన పాపాలు శత్రువులై, ఫలోన్ముఖాలై ఉన్నాయే! వాటి ఫలభూతాలైన నరకయాతనలను ఎంత కాలం అనుభవించినా నశించకుండా ఉన్నాయే! ఈ విధంగా ఉండగా- “మురభిది మా విరమస్వ” అని మీరు పల్కినట్లు ఏవిధంగా స్వామి దరికి చేరగలను?- అని మనస్సు అనగా, దానిని విని, "ఓ మూఢమనసా! ఈవిధంగా పలు విధాలుగా చింతించి భయపడకు. స్వామికి మనం సొత్తు కదా. అతడు తన సొత్తును రక్షించుకోడా? అంతేకాక, “త్వ ముచితై రుపాయై ర్విస్మార్య" (నిన్ను తగిన ఉపాయాలతో మరపింపజేసి) అని, “అల్లిమలర్ పోక మయక్కుక్కళ్" (పద్మనివాసిని అయిన లక్ష్మీదేవి భోగంలోని మోహాలు) అని పలికే విధంగా “న కశ్చిన్నాపరాధ్యతి" (తప్పు చేయనివాడు ఎవడు?) అని పల్కి, తన స్తనప్రదర్శనాదులతో శరణాగతుని గతంలోని అపరాధాధిక్యంతో (స్వామికి) కల్గిన కోపాన్ని తీర్చి, అతడు ఆశ్రితుల అపరాధాలను మఱచి పోయేటట్లు చేసే లక్ష్మీదేవి కదా వక్షస్సులో నిత్యవాసం చేస్తున్నది. అందువల్ల, పరమసులభుడై, ఆశ్రితదుఃఖాన్ని తీర్చే స్వభావాన్ని కల నారాయణుని ధ్యానించు. సర్వలోకవ్యసన నిరసనశీలుడైన అతడు దాసుల విషయంలో అసమర్థుడా ? ధ్యానిస్తే అతడు తప్పక దుఃఖాన్ని నిరసిస్తాడు. అందుచేత ధ్యానం చేయడమే ఉచితమనే భావంతో ఇందులో పల్కుతున్నారు.

**వ్యాఖ్య : (మా భీరితి) - (హే మందమనః)** - ఓ మూఢమనసా! అతని సౌలభ్యాది గుణాలను గమనించకుండా అపరాధాలను చూచి, భయపడే రీతిలో అజ్ఞానాన్ని కల ఓ మనసా- అని భావం.

**(యాతనాః)** - నరకదండనలను- అని అర్థం. ఒక్కొక్క యమయాతన చిరకాలంగా కొనసాగుతుంది. ఇటువంటి యాతనలు అసంఖ్యేయాలు- అని అర్థం.

**(బహుధా విచింత్య)** - అనేక ప్రకారాలుగా చింతించి, వర్తమానకాలంలో అనుభవించే యాతనలు ఈ నాటికీ తీరుతాయో? మఱునాటికి తీరుతాయో ? వంద సంవత్సరాల తరువాత తీరుతాయో? వేయి సంవత్సరాల పిమ్మట తీరుతాయో? ఒకవేళ ఇవి తీరినా, భావియాతనలు ఎన్నెన్నో ఉన్నాయి కదా! ఏమి చేయాలి?- అని బహుప్రకారంగా చింతించి- అని భావం.

**(మా భీః)** - భయపడకు.

**(తే)** - ఈ విధంగా యాతనలను కల్గించేవిగా ప్రసిద్ధాలైన,

**(అమీ పాపరిపవః)** - ఈ పాపాలనే శత్రువులు. అళ్వారులకు ఈ జన్మలో చేసిన పాపాలన్నీ బుద్ధిస్థమైనందున "అమీ" అని అంటున్నారు. ఒక్కొక్క శత్రువు యుద్ధభూమికి వచ్చి నిలచి, శక్తియష్టిముసలగదా పరశుబాణాదులైన నానావిధాయుధాలను వర్షించేటట్లు, ఒక్కొక్క పాపం నానావిధ కుంభీపాకరౌరవాద్యనేక యాతనలను కల్గిస్తుంది.

**(న ప్రభవంతి)** - ప్రభావాన్ని పొందలేవు. ఫలోన్ముఖంగా కాలేవు— అని భావం. పాపాలు ఉంటే కదా యాతనలు కల్గుతాయి. ఎందుకు ఫలాన్ని ఇవ్వలేవు? అని అంటే,

**(స్వామీ నను శ్రీధరః)** - శ్రియఃపతికదా మనకు స్వామి. స్వామి తన సొత్తును శత్రువుల చేతికి అప్పగిస్తాడా ? ఏదో ఒక సమయంలో ఉదాసీనుడై ఉన్నా, లక్ష్మీదేవి ఇతనికి తన ముఖం చూపిస్తుందా ? ఈమె తన ముఖాన్ని చూపకపోతే "పిత్తర్ పనిమలర్ మేల్

పాపైక్కు” (చల్లని తామర పువ్వులో నివసించే లక్ష్మీదేవి విషయంల వ్యామోహం కలిగినవాడు) అనేవిధంగా పుష్పవాసిని అయిన శ్రీదేవిపట్ల అత్యంత వ్యామోహాన్ని (పిచ్చిని) కలవాడు. “క్వచిన్మత్త ఇవాభాతి కాంతాన్వేషణతత్పరః" (ఒక్కొక్కసారి తన ప్రియురాలిని అన్వేషించే పిచ్చివానివాడు అనే స్థితిని పొందుతాడు). అందుచేత, ఆమె ప్రీతికోసం అయినా మనలను శత్రువుల చేతికి అప్పగించడు.

“నాట్టిలుళ్ళ పావమెల్లామ్ శుమ్మైనాదే కైవిట్టోడి త్తూఱుకళ్ పాయ్ న్దనవే”

(ఈ లోకంలో ఉండే పాపాలన్నీ కిమ్మనకుండా వదిలిపెట్టిపోయి, ముళ్ళ పొదాలలో దూరిపోయాయి) అనే విధంగా మనకు శ్రియఃపతి స్వామి- అనే విషయాన్ని విన్న మాత్రంలోనే పాపాలు ఫలించలేక, వెన్ను చూపి పారిపోతాయి— అని భావం. అందుచేత, ఓ మనసా! నీవు పాపాలను చూచి భయపడకు— అని భావం.

“నామీ నః ప్రభవంతి” అనే ఇంకొక పాఠమున్నది. అపుడు, నః- మనకు, అమీ పాపరిపవః న ప్రభవంతి - ఈ పాపశత్రువులు బాధించడానికి సమర్థులు కాలేవు. ఈ పాపాలనే శత్రువులు మనలను బాధించడంలో శక్తి లేనివి- అని భావం.

అయినా, సర్వేశ్వరుడై, పరాత్పరుడైన అతని దరిచేరగలమా? అతడు దుర్లభుడు కదా! అంటే,

"శత్రూణామ ప్రకంప్యోఽపి లఘుత్వ మగమత్ కపేః”

(శత్రువులకు కదపడానికి సాధ్యం కానివాడు అయినా, భక్తుడైన హనుమంతునకు తేలిక అయ్యాడు) అని, “పత్తుడై యడియవర్ క్కు ఎళియవన్ పిఱర్ కళుక్కు అఱియ విత్తకన్” (భక్తిని కల దాసులకు సులభుడు, ఇతరులకు తెలియడానికి దుర్లభుడు) అనే

విధంగా శత్రువులకు దుర్లభుడైనా, భక్తులకు పరమసులభుడై ఉంటాడని ఇక పల్కుతున్నారు.

**(భక్తిసులభమ్)** - భక్తి కలవారికి కొంగుకు ముడి వేసికొనే రీతిలో పరమసులభుడై ఉంటాడు.

**(నారాయణమ్)** - నీవు ధ్యానించేవాడు ఉదాసీనుడా ? అంటే, జనకత్వ, ప్రాప్యత్వ, ప్రాపకత్వ, స్వామిత్వ, ఆధారత్వ, శరీరత్వాదులలో సంబంధాన్ని కల్గి ఉంటాడు. ఇవి అన్నీ నారాయణశబ్దార్థాలనే విషయం మూలమంత్రాధికారంలో గమనించవచ్చు. విస్తరభీతితో విరమింపబడుతున్నది.

**(ఆలస్యం వ్యపనీయ)** - సోమరితనాన్ని వీడి,

**(ధ్యాయస్వ)** - ధ్యానించు. వైషమ్యనైర్ఘృణ్యపరిహారార్థం సకృదావృత్తి ధ్యానం చేయాలి తప్ప, వేఱు కర్తవ్యం లేదు. ఈ విషయంలో సోమరితనం వద్దు. లోకంలో దరిద్రుడై, తిండి లేక కష్టపడుతున్నా, ఏదో ఒక వృత్తిని చేసి, ధనంసంపాదనం చేయడంలో సోమరులై ఉన్నారు. "అలసాః స్వాదు కామాశ్చ" (సోమరితనం కలవారు, రుచికరమైన భోజనంలో కోరికను కలవారు) అని కొందఱు ఋషులు స్వాదువైన భోజనంలో ఆశను కలవారై, సంపాదించడంలో సోమరులై ఉన్నారు– అని శ్రీరామాయణ ప్రసిద్ధం. అందువల్ల నీవుకూడా, ఆలస్యాన్ని వీడి ధ్యానించు- అని భావం.

మనం ధ్యానిస్తే మన దుఃఖాన్ని తీరుస్తాడా ? అంటే ఇక పల్కుతున్నారు.

**(లోకస్య)** - జనాలయొక్క,

**(వ్యసనాపనోదనకరః)** - వ్యసనాన్ని తీర్చేవాడు. "వ్యసనాపనోదనం కరోతీతి వ్యసనాపనోదనకరః".

"వ్యసనేషు మనుష్యాణా భృశం భవతి దుఃఖితః"

తన రాజ్యంలో ఎవరికైనా దుఃఖం కలిగితే, శ్రీరాముడు, వారు పడే దుఃఖం కంటే తాను ఎక్కువ దుఃఖాన్ని పొందుతాడు) అనే విధంగా సాధారణ మానవునకు కష్టం కల్గినా, "అయ్యో! నా రక్షణలోని లోపం వల్ల కదా వీరికి ఈ వ్యసనం ప్రాప్తించింది"- అని చాలా దుఃఖితుడై, "పౌరాన్ స్వజనవన్నిత్యం కుశలం పరిపృచ్ఛతి" (పౌరులను, తన బంధువులను వలె, నిత్యం కుశల ప్రశ్నలను చేస్తాడు) అని కుశలప్రశ్న చేస్తూ, వ్యసనాన్ని తీరుస్తాడని భావం.

**(దాసస్య కిం న క్షమః)** - ఇటువంటివాడు దాసుని వ్యసనాన్ని తీర్చడంలో సమర్థుడు కాడా ? అందుచేత. అతడు తప్పక నీ దుఃఖాన్ని తీరుస్తాడు. భయపడకు.

"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః,
నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్"

(పాలసముద్రాన్ని తనకు నివాస స్థానంగా కలిగిన, లక్ష్మీసహితుడైన ఈ నారాయణుడు ఆదిశేషుడనే పడుకను విడచిపెట్టి, మధురానగరానికి వచ్చాడు కదా) అని శ్రీకృష్ణుడై అవతరించిన నారాయణుని ధ్యానించు- అని తమ మనస్సును ప్రార్థిస్తున్నారు. "ధ్యాయస్వ" అనేది విధిలో కాకుండా ప్రార్థనలో లోట్. సమానప్రకరణంలో "మనమే! యున్నై వల్వినైయే నిరన్దు" (ఓ మనసా! చాలా పాపాలను చేసిన నేను నిన్ను ప్రార్థిస్తున్నాను) అని నమ్మాళ్వార్లు పలికారు.

**12. భవజలధిగతానాం ద్వంద్వ వాతాహతానాం**
**సుతదుహితృ కళత్ర త్రాణభారార్దితానామ్।**
**విషమవిషయతోయే మజ్జతా మప్లవానాం**
**భవతు శరణమేకో విష్ణుపోతో నరాణామ్ ॥**

భవ = సంసారం అనే, జలధి = సముద్రమును, గతానాం = పొందినవారు, ద్వంద్వ = చలి వేడిమి, సుఖదుఃఖములు మొదలైన జంట దుఃఖములు అనే, వాత = గాలిచేతను, ఆహతానాం = కొట్టబడినవారు, సుత = కొడుకులు, దుహితృ = కుమార్తెలు, కళత్ర = భార్యలు - వీరి యొక్క, త్రాణ = రక్షించుట అనే, భార = బరువు చేత, అర్దితానాం = పీడింపబడినవారు, విషమ =కష్టమును కలిగించే, విషయ = ఇంద్రియ సుఖములు అనే, తోయే = నీతిలో, మజ్జతాం = మునుగువారు, అప్లవానాం = తెప్ప లేనివారు అయిన, నరాణాం = మనుష్యులకు, విష్ణుపోతః ఏకః = విష్ణువనే తెప్ప ఒక్కటే, శరణం = రక్షకముగా, భవతు = అగునుగాక

అవ : నారాయణునే ధ్యానించాలని నియమం ఏదైనా ఉన్నదా ? బ్రహ్మాదులను ధ్యానిస్తే వారు రక్షకులు కారా ? అంటే, సంసారసాగరంలో మునిగినవారికి బ్రహ్మరుద్రాదులు శరణం కాబోరు, నారాయణుడొక్కడే నావవలె శరణ మవుతున్నాడని ఇందులో అంటున్నారు.

వ్యాఖ్య : **(భవేతి)** - **(భవజలధిగతానామ్)** - సంసారమనే గొప్ప సముద్రాన్ని చేరినవారికి- అని అర్థం. సముద్రం అపారమై, అగాధమై ఉండేటట్లే, సంసారంకూడా అపారంగా, అగాధంగా ఉంటుంది.

**(ద్వంద్వవాతాహతానామ్)** సముద్రంలో పడి, తీరాన్ని చేరలేకుండా ఉండేటపుడు ద్వంద్వవాతాహతులై క్లేశపడతారు. సముద్రంలో పడికొట్టుకొని పోయేటపుడు గొప్ప దక్షిణగాలి, ఉత్తర గాలి మాటిమాటి వేగంగా వీచినపుడు, ఇటు వైపు కొంత సేపు, అటు

వైపు కొంత సేపు కొట్టుకొని బాధపడతాడు. పుణ్యమే ఉంటే దేవాదులుగానే ఉండవచ్చు. కేవలం పాపమే ఉంటే "శరీరజైః కర్మదోషైః యాతి స్థావరతాం నరః" అని స్థావరాదులుగా ఉండవచ్చు. ఆ రీతిలో కాకుండా పుణ్యపాపాలనే రెండిటితో "మాటి మాటి పల పిఱప్పుమ్ పిఱన్దు" అనేటట్లు అనేక జన్మలను పొంది, కొరడాతో కొట్టబడినట్లుగా గొప్ప కష్టాలను కల్గిస్తాయి. సముద్రంలో మునిగి, గాలిచే అటు ఇటు కొట్టబడడమే కాక, తలలో చెట్లు, రాళ్ళు మొదలైన బరువులను మోసినందున ఇంకా అధికమైన కష్టాన్ని పొందేటట్లే, సంసారసాగరంలో మునిగి, శీతోష్ణసుఖదుఃఖపుణ్యపాపాలతో బాధపడడమేకాక, పుత్రులు, పుత్రికలు భార్యలు, మొదలైనవారి రక్షణమనే మహాభారం వల్ల పీడింపబడుతున్నారు- అని అంటున్నారు.

**(సుతదుహితృకళత్రత్రాణ భారార్దితానామ్)** - ఒక భారం కాకుండా, సుతత్రాణభార దుహితృత్రాణభార కళత్ర త్రాణభారాదులతో పీడింపబడుతున్నారు. పరస్పర విలక్షణమైన రాళ్ళు, ఇనుము మొదలైన బరువులను తలపై పెట్టినట్లు ఉన్నది –సుతదుహితృ కళత్రాదుల రక్షణభారం. పుత్రుల రక్షణ కంటే పుత్రికల రక్షణం విలక్షణం, దానికంటే భార్యారక్షణం విలక్షణం. ఆకలికి బాధపడే పుత్రాదుల రక్షణకోసం వర్షవాతాతపాదిపీడితుడై, ధనసంపాదనేచ్ఛతో పరుగులు తీసి అంతటా తిరిగి ఎక్కడా ఫలప్రాప్తిని పొందలేక, పరాభవాన్ని పొంది, ఇంటికి వస్తే, కళత్రాదులచే గర్హింపబడినా, వారిని విడువలేక, తిరిగి మళ్ళీ ధనసంపాదన కోసం అకృత్యాలను చేసి, ఆ విధంగా సంపాదించిన అర్థాన్ని ఇస్తే, అపుడు తనపట్ల స్నేహాన్ని కలవారివలె వారు వర్తిస్తారు. అర్థసంపాదనలో శక్తి తగ్గగానే,

"కొణ్డపెణ్డిర్ మక్కళు*ఱ్ఱా*ర్ శు*ఱ్ఱ*త్తవర్ పిఱరుమ్
కణ్డదోడు పట్టదల్లాల్ కాదల్ మ*ఱ్ఱు* యాదుమిల్లై"

(గ్రహింపబడిన భార్యలు, కన్న బిడ్డలు, బంధువులు, దగ్గరివారు అనే వీరు చేతకానప్పుడు స్నేహం కలిగి ఉండడం తప్ప, వేరే విధంగా, సహజంగా కొంచెం కూడా స్నేహం కలిగి ఉండడం లేదు) అనేవిధంగా వారివల్ల చాలా పరిభవాన్ని పొందుతారు. ఈ విధంగా ఉన్నా, సుతాదులపట్ల ఉండే స్నేహం మాఱదు. “సంపాదించే యోగ్యత పోయిందే! ఏమి చేయను?” అని పశ్చాత్తాపాన్ని పొందడం తప్ప వైరాగ్యం కలుగదు. ఈ విధంగా సుతాదిత్రాణభారం ఇతనిని పీడిస్తుందని తాత్పర్యం. సముద్రంలో పడడమే కాక, సుడులతో, కెరటాలతో విషమమైన జలంలో మునిగిపోయేటట్లే, విలక్షణశబ్దాదివిషయాలనే జలంలో మునిగిపోతున్నారు- అని ఇక అంటున్నారు.

**(విషమవిషయతోయే)** - రసనేంద్రియ విషయమై, సరసాపేక్ష కంటే ఘ్రాణేంద్రియ విషయం వేరు. . దానికంటే శ్రోత్రేంద్రియ విషయం విలక్షణం. ఈ విధంగానే కాక, ఒక్కొక్క విషయం పలు విధాలుగా ఉంటుంది. “ఒన్ఱు శొల్లి ఒరుత్తనిల్ నిఱ్కిలాద ఓరైవర్" (ఒకే మాటను చెప్పి, ఒకరి విషయంలోనే నిలువని ఐదు పంచేంద్రియాలు) అనేటట్లు ఒక విషయాన్ని ఆశపడి, దానిని అనుభవించి ముగించడానికి ముందే విషయాంతరాన్ని ఆశపడతాడు. ఈ విధంగా లౌకికవిషయాలలో మునిగిపోతున్నారు– అని అంటున్నారు.

**(మజ్జతామ్)** - అని అన్నందున- ఇంతమునిగి ఉన్నా, ఒక నావ ఉంటే తీరం చేరవచ్చు. అది కూడా లేదు- అని ఇకపై పల్కుతున్నారు.

**(అప్లవానామ్)** - 'న విద్యతే ప్లవో యేషాం తే"– ఏవిధమైన తెప్ప లేనివారు. ఇటువంటి,

**(నరాణామ్)** - మనుష్యాది ప్రమాణాలకు- అని అర్థం. “ర” అని క్షయిష్ణువును తెల్పుతుంది. “నరః” అనేది నగ, నైకాది సమాసాలవలె నిష్పన్నమై, నాశం లేని, క్షయిష్ణువు కానివాడనే అర్థాన్ని తెల్పుతుంది. కనుక, నిత్యుడనే అర్థాన్ని ఇస్తుంది. ఇటువంటి స్వచ్ఛరూపుడై, నిత్యుడై ఉండే జీవునకు సంసారసముద్ర మజ్జనం

ఆగంతుకంగా వచ్చింది. ఇటువంటివారికి రక్షకంగా వేఱొక తెప్ప ఏదీ లేకపోయినా, అభేద్యమైన, విష్ణువనే పోతం రక్షకమవుతున్నది- అని ఇక పల్కుతున్నారు.

**(భవత శరణమేకో విష్ణుపోతః)** - 'ఎరుత్తు క్కొడియుడైయానుమ్ మరున్దఱివారు మిల్లై" (వృషభాన్ని ధ్వజంగా కలిగిన రుద్రుడు, ఇంకా ఎవరూ సంసారానికి మందును తెలిసినవారు లేరు) అనే రీతిలో బ్రహ్మాదిదేవతాంతరాలలో ఎవరూ సంసారాన్ని పోగొట్టగల్గినవారు కారు. విష్ణువు ఒక్కడే సమర్థుడు. దృఢమైన నావను ఆశ్రయిస్తే ఆవలి తీరాన్ని చేరవచ్చు. ఆ రీతిలో, విష్ణువును ఆశ్రయిస్తే తిరిగి సంసారియే అవుతాడు. కనుక "ధ్యాయస్వ నారాయణమ్" అని నారాయణునే ధ్యానించు- అని గడచిన శ్లోకంలో అన్వయించుకోవాలి.

"సంసారార్ణవశమగ్నానాం విషయాక్రాంతచేతసామ్,
విష్ణుపోతం వినా నాన్యత్కించిదస్తి పరాయణమ్"

(సంసారం అనే సముద్రంలో మునిగినవారు లౌకిక విషయాలచేత ఆవరింపబడిన మనసునుకలవారు అయినవారికి, ఆ సంసార సముద్రాన్ని దాటడం కోసం విష్ణువు అనే పడవ తప్ప వేరొక గొప్ప పడవ ఏదీ లేదు)

"సంసారసాగరం ఘోరం అనంతక్లేశభాజనమ్,
త్వామేవ శరణం ప్రాప్య నిస్తరంతి మనీషిణః"

(సంసారం అనే సముద్రం చాలా ఘోరమైనది. అంతులేని కష్టాలకు నిలయమైనది. తెలివైనవారు నిన్నే శరణంగా పొంది ఆ సముద్రాన్ని దాటుతున్నారు)

ఇత్యాది ప్రమాణాలు ఇక్కడ అనుసంధేయాలు.

**13. భవజలధి మగాధం దుస్తరం నిస్తరేయం**
**కథ మహ మితి చేతో మా స్మ గా: కాతరత్వమ్।**
**సరసిజదృశి దేవే తావకీ భక్తిరేకా**
**నరకభిది నిషణ్ణా తారయిష్యత్యవశ్యమ్॥**

చేతః = ఓ మనసా!, అగాధం = లోతైనది కనుకనే, దుస్తరం = దాటదానికి శక్యము కాని, భవజలధిం = సంసారమనే సముద్రమును, కథం = ఎట్లు, అహం = నేను, నిస్తరేయం = దాటగలను?, ఇతి = అని, కాతరత్వం = పిఱికితనమును, మా స్మగాః = పొందవద్దు, సరసిజదృశి = కమలమువంటి నేత్రములు కల, దేవే = భగవంతుడగు, నరకభిది = నరకాసురుని సంహరించిన శ్రీ కృష్ణునియందు, నిషణ్ణా = కూర్చుండిన, తావకీ = నీదైన, భక్తిః ఏకా = భక్తి ఒక్కటే, అవశ్యం = ముఖ్యముగా, (త్వం = నిన్ను), తారయిష్యతి = దరి చేర్చగలదు.

**అవతారిక**

ఈ విధంగా "మా భీర్మంద! మనః" అనే శ్లోకంలో భయపడిన మనస్సును "ధ్యాయస్వ నారాయణమ్" అని ఆళ్వార్లు ఆశ్వాసించారు. తరువాత, "భవజలధి" ఇత్యాదిగా సంసారంయొక్క క్రౌర్యాన్ని పల్కి, అటువంటి సంసారంనుండి రక్షించడానికి విష్ణుపోతం తప్ప ఇంకొక శరణం లేదన్నారు. ఈ విధంగా అయినా, లోకంలో పులిచేతికి చిక్కినవాడు ఆ పులిని సంహరించి, రక్షించే సమర్థుడైనవాడు దగ్గరలో ఉన్నా, పులిలోని క్రౌర్యాన్ని తలచి "నేను దీని బారినుండి తప్పించుకొని బయటపడి బతకగలనా?" అని మాటిమాటికి భీతిల్లి ఆక్రందించేటట్లే, విష్ణుపోతం దగ్గరలోనే ఉన్నా, సంసారదుస్తరత్వాన్ని తలచి, "నేను ఏశవిధంగా దీనిని దాటగలను?" అని భీతిల్లిన తమ మనస్సును ఉద్దేశిస్తూ "నీవు భయపడకు" భగవద్భక్తి అనేది తప్పక తరింపజేస్తుంది". అని మళ్ళీ ఓదారుస్తున్నారు.

**వ్యాఖ్య : (హే చేతః)** - ఓ మనసా!

**(అహమ్)** -అత్యంతం అశక్తుడనైన నేను,

**(అగాధమ్)** - దాటడానికి సాధ్యం కాని రీతిలో లోతైనది; అందువల్లనే,

**(దుస్తరమ్)** - ఏ రీతిలోను దాటడానికి వీలుకానిది అయిన,

**(భవజలధిమ్)** - సంసారసాగరాన్ని,

**(కథం నిస్తరేయమ్?)** - ఏ విధంగా దాటగలను ?

**(ఇతి కాతరత్వం మా స్మ గాః)** - అని భయపడవద్దు.

**(సరసిజదృశి దేవే)** - నారాయణుని విషయంలో– అని అర్థం. దేవశబ్దం బ్రహ్మరుద్రాదిసవాచకం కూడా అయినా, పుండరీకాక్షత్వం వీరికి లేదుకదా. నేత్రసౌందర్యాన్ని చూస్తే పురుషప్రయత్నం అక్కర లేకుండానే భక్తి తానే కల్గుతుంది.

**(నరకభిది)** - నరకాసురుని భేదించినవాడైన- ఆశ్రితులకు నరక బాధానివర్తకుడైన- అని కూడా అర్థం. “సరసిజదృశి” అని అన్నందున భోగ్యత్వం వివక్షితం. పాలు పిత్తాదినివర్తకంగాను, భోగ్యంగాను ఉండేటట్లే, ఇతడు నరకనివర్తకుడై, భోగ్యుడై ఉన్నాడు. దేవతాంతరాలకు నరకనివర్తకత్వం భోగ్యత్వం లేదు. ఇటువంటి నారాయణునిపట్ల,

**(నిషణ్ణా తావకీ భక్తిరేషా)** - నిలిపిన ఈ నీ భక్తి – అని అర్థం.

అగాధమైన సంసార సముద్రాన్ని తరణం చేయించే రీతిలో భక్తి ఉంటే కదా "తారయిష్యత్యవశ్యమ్" అని అనవచ్చు. అటువంటి భక్తిలేదు కదా! అంటే, ఆ విధమైన భక్తిలేకపోయినా, ఇపుడుండే అత్యల్పభక్తికూడా తప్పక తరింపజేస్తుంది- అని "ఏషా" అనే పదంద్వారా సూచితం.

**(ఏషా)** - ఇపుడున్న అత్యల్పమైన భక్తి -అని అర్థం.

**(అవశ్యం తారయిష్యతి)** - తప్పక దాటిస్తుంది. అందుచేత భయపడకు- అని తాత్పర్యం.

"స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్"

(అల్పమైనది అయినా, ధర్మం, పెద్ద భయాన్ని కూడా దాటిస్తుంది)

అని స్వల్పమైన ధర్మానికి భయనివర్తకత్వమున్నట్లే, భగవద్భక్తికి సంసారసంతరణకరత్వం కైముతికన్యాయసిద్ధం కదా! భక్తితో ప్రపన్నుడై, సర్వేశ్వరుడు సంసారసముద్ర తరణం చేయిస్తాడని శ్లోకపరమతాత్పర్యం.

**14) తృష్ణాతోయే మదనపవనోద్ధూతమోహోర్మిమాలే(జాలే)**
**దారావర్తే తనయ సహజగ్రాహ సంఘాకులే చ ।**
**సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం న స్త్రిధామన్!**
**పాదాంభోజే వరద! భవతో భక్తినావం ప్రయచ్ఛ॥**

తృష్ణాతోయే = ఆశ అనే నీళ్ళు కలది అయిన, మదన = మన్మథుడు అనే, పవన = గాలిచేత, ఉద్ధూత = పైకి లేపబడిన, మోహ = అజ్ఞానమనే, ఊర్మి = అలలయొక్క, మాలే = వరుస కలది, దారా = భార్య, ఆవర్తే = సుడులు గలది, తనయ = బిడ్డలను, సహజ =తోడబుట్టినవారు, గ్రహ = మొసళ్ళ యొక్క, సంఘ = గుంపుచేత, ఆకులే = కలత పెట్టబడినది అయిన, సంసార + ఆఖ్యే = సంసారము అనే పేరు కల, మహతి = గొప్ప, జలధౌ = సముద్రమునందు, మజ్జతాం = మునుగుచున్న, నః = మాకు, త్రిధామన్ = ఓ త్రిధాముడా!, వరద = ఓ వరములను ఇచ్చేవాడా, భవతః = నీ యొక్క, పాద + అంభోజే = కమలములవంటి పాదములందు, భక్తినావం = భక్తి అనే ఓడను, ప్రయచ్ఛ = ఇమ్ము

**అవతారిక :**

“అగాధమైన సంసారసముద్రాన్ని ఏ విధంగా దాటగలం?" అని భయపడిన మనస్సును చూచి, భగవద్విషయంలో నీకు కల భక్తియే తరింపజేస్తుందని ఆళ్వార్లు అనగా, అటువంటి భక్తి నాకు లేదు కదా –అని మనసు అనగా, ఇప్పుడు ఉండే అల్పభక్తియే చాలు, అది దాటించగలదు. , నీవు. స్వామిని ధ్యానించు- అని అన్నారు–గడచిన శ్లోకంలో. ఇంకా, నిరూపించి చూస్తే, అల్పభక్తి ఉన్నదని కదా అన్నాను. అదికూడా లేదే. సంసారసాగరాన్ని చూస్తే అగాధమై ఉన్నది. అంతేకాక, అవద్యకరమైన గ్రాహావర్తాదులతో సంకులమై ఉన్నదే- అని భీతిల్లి “భగవన్! భక్తిమపి ప్రయచ్ఛ మే” (భగవన్! భక్తిని కూడా నాకు అనుగ్రహించు) అనే న్యాయంలో "భక్తి అనే నావను నీవే ఇవ్వాలి" అని భగవంతుని ఇందులో అర్థిస్తున్నారు.

**వ్యాఖ్య : (తృష్ణేతి) (తృష్ణాతోయే)** - ఆశ అనే జలాన్ని కల్గినది, జలం సర్వతోముఖంగా ప్రసరించేటట్లే, ఆశ అనేది అవధి లేకుండా సర్వతోముఖంగా

ప్రసరించినందున జలంగా రూపించారు. “ఇందులో ఆశ ఉన్నది, ఇందులో ఆశ లేదు” అనే రీతిలో కాక, అంతటా ఆశ గూడు కట్టుకొన్నదని తాత్పర్యం.

**(మదనపవనోద్ధూతమోహోర్మిజాలే)** - మన్మథుడనే వాయువుచే పైకి ఎగురగొట్టబడిన మోహమనే కెరటాల సమూహాన్ని కల్గినది. గాలిచే కెరటాలు పైకి లేవగొట్టబడి, పురుషుని లోపలకు ముంచి ప్రాణాలు తీస్తాయి. అదేవిధంగా మన్మథోద్రేకంతో మోహం ఉన్మస్తకమై, కృత్యాకృత్యవివేకాన్ని కోల్పోయేటట్లుచేసి, నశింపజేస్తుంది- అని భావం.

**(దారావర్తే)** - మన్మథోద్రేకంతో మోహం తల ఎత్తగా, కాంతలనే సుడిగుండాలతో చిక్కుకొని మునిగిపోతాడు. సుడి తనలో చిక్కుకొన్న గడ్డిపరకను "అది ఇక్కడకు పోయింది" అని తెలియనీయకుండా లోపలకు తీసికొని పోతుంది. స్త్రీల విషయంలో చిక్కుకొంటే ఇక పైకి రాలేదు కనుక, స్త్రీలు సుడిగుండాలుగా చెప్పబడ్డారు. ఒక్క పర్యాయం అయినా స్త్రీలను కన్నెత్తి చూడని ఋష్యశృంగుడు ఒకసారి దాసీజనాన్ని చూడగానే అస్వస్థహృదయుడై, తండ్రిని కూడా మరచి వేశ్యాపరతంత్రుడై పోయాడు.

ఈ విధంగా స్త్రీపరతంత్రుడై, వారి పట్ల ఆసక్తుడైతే పుత్రాదులు కల్గుతారు. ఆ పుత్రులు మొదలైనవారు కూడా “తండ్రీ! మంచి వస్త్రాలను ఇవ్వండి, ఆభరణాలను ఇవ్వండి, అన్నం పెట్టండి" అని అనేకవిధాలుగా మొసళ్ళు పట్టి పీడించినట్లు పట్టుకొని బాధిస్తారు. దానికోసం ధనం సంపాదించి ఇస్తే, సోదరులు, భ్రాతలు "నాకు ద్రోహం చేయకు, నా భాగాన్ని పంచి ఇయ్యి” అని మొసళ్ళవలె పట్టుకొంటారు- అని అంటున్నారు.

**(తనయసహజగ్రాహసంఘాకులే చ)** - తనయశబ్దం కూతుళ్ళకు కూడా ఉపలక్షణం, సహజశబ్దం సహోదరికి కూడా ఉపలక్షణం. “తనయాశ్చ సహజాశ్చ తనయసహజాః, తా ఏవ గ్రాహాః, తేషా సంఘై రాకులే” అని విగ్రహం. సముద్రం మొసళ్ళసమూహంతో కలత

పొందేటట్లు, సంసారం కూడా సుతదుహితృసహోదర సహోదర్యాదులతో వ్యాకులంగా ఉంటుంది—అని భావం.

**(సంసారాఖ్యే మహతి జలధౌ)** - సంసారమనే పేరు గల మహాసముద్రంలో- అని అర్థం. సముద్రాన్ని అగస్త్యుడు ఆపోశన పట్టాడు, కాని, సంసారసముద్రాన్ని అతడు కూడా ఆపోశన పట్టలేకపోయాడు. ఇప్పటికీ సంసారాన్ని దాటి ముక్తుడు కాలేదు. అందువల్ల ఇది "మహతి" —గొప్పది, పెద్దది.

**(మజ్జతాం నః)** -

"ఆవారార్ తుణై ఎన్ఱు అలైనీర్కడలుళ్ అழுన్దుమ్
నావాయ్ పోల్ పిఱవిక్కడలుళ్ అన్ఱు నాన్ తుళఙ్గ"

(నాకు ఎవరు సహాయం కాగలరు? అని కెరటాలతో నిండిన సముద్రంలో మునిగిపోయే నావవలె నేను సంసారం సముద్రంలోపల దుఃఖపడుతూ ఉండగా)

అనే విధంగా సంసారసముద్రంలో పడి, ఎవరు సహాయపడతారు! అని తపించే మాకు,

**(హే త్రిధామన్!)** - "అంభస్య పారే భువనస్య మధ్యే నాకస్య పృష్ఠే"

(క్షీరాబ్ధి ఆవలి వైపున లోకం మధ్యలో పరమపదం లోపల) అని అతిదూరంలో ఉండే పరమపదంలో, క్షీరాబ్ధిలో, సూర్యమండలంలో వేంచేసి ఉండే స్వామీ!,

**(వరద!)** - నీకు వరదత్వం లేకపోతే నిన్ను నేను అర్థించను. వరదత్వ మున్నందున యాచిస్తున్నాను. దేనిని యాచిస్తున్నాను? అంటే,

**(భవతః పదాంభోజే భక్తినావం ప్రయచ్ఛ)** - నీ శ్రీచరణ పద్మాలలో భక్తి అనే నావను అనుగ్రహించు. నీవు అత్యానందస్వరూపుడవై, అతిభోగ్యుడవై, సంసారతరణోపాయ భూతుడవై ఉన్నావు. నీ శ్రీచరణాలు నీకంటే మిక్కిలి భోగ్యమైనవి. ఈ విధంగా ఉన్నా, నాకు నీ భక్తి కలుగలేదు. భక్తి కల్గితేనే, దానిని తెప్ప గ్రహించి, తీరాన్ని చేరవచ్చు. కనుక నీవే ఆ భక్తి అనే నావను నాకు అనుగ్రహించాలి.

**15. మాద్రాక్షం క్షీణపుణ్యాన్ క్షణమపి భవతో భక్తిహీనాన్ పదాబ్జే**
**మాశ్రౌషం శ్రావ్యబంధం తవ చరితమపాస్యా నన్యదాఖ్యానజాతమ్।**
**మాస్మార్షం మాధవ! త్వామపి భువనపతే! చేతసాపహ్నువానాన్**
**మాభూవం త్వత్సపర్యా వ్యతికర రహితో జన్మ జన్మాంతరేఽపి॥**

మాధవ = ఓ లక్ష్మీపతీ, క్షీణపుణ్యాన్ = పాపము చేసినవారిని, క్షణమపి = క్షణమైనను, భవతః = నీయొక్క, పద+ అబ్జే = కమలములవంటి పాదములయందు, భక్తిహీనాన్ = భక్తి లేనివారిని, మాద్రాక్షం = చూడకుందును గాక, శ్రావ్యబంధం = వినదగిన రచన గల, తవ = నీయొక్క, చరితం = కథను, అపాస్య = విడిచి, అన్యత్ = ఇతరమైన, ఆఖ్యానజాతం = చరిత్రముల సమూహమును, మాశ్రౌషం = వినకుందును గాక, భువనపతే = లోకనయకుడవగు శ్రీకృష్ణమూర్తీ!, త్వాం = నిన్ను, చేతసా అపి = మనస్సులోనయినను, ఆపహ్నువానాన్ = తిరస్కరించువారిని, మాస్మార్షం = తలంచకుందునుగాక, జన్మజన్మానాంతరే అపి = ప్రతిజన్మములోను, త్వత్ = నీయొక్క, సపర్యా = సేవయొక్క, వ్యతికరరహితః = సంబంధము లేనివాడుగా, మా భూవం = కాకుందును గాక!

**అవతారిక :**

ఈ విధంగా ఆళ్వార్లు భక్తిని ప్రార్థించగా, శ్రీకృష్ణుడు సంతోషించినవాడై, నా దగ్గర పుత్రపశ్వన్న స్వర్గకైవల్యాదులను అర్థించి, తావన్మాత్రంతో తృప్తిచెంది వెళ్ళిపోయే మూఢులవలె కాకుండా, భక్తిని అర్థిస్తున్నారుకదా! “స మహాత్మా సుదుర్లభః" (అటువంటి మహాత్ముడు చాలా అరుదైనవాడు) అనే విధంగా ఇటువంటి మహాత్ములు దొరకడం అరుదు కదా! అని చింతించి, తత్ క్షణంలో భక్తిని అనుగ్రహించారు. ఆ భక్తి పరమభాగవతులతో సల్లాపాదులను చేయడంకోసం, ఈవిధంగా ఉండనివారి సంబంధాన్ని లేకుండా చేసికోవడంకోసం హేతువైనది.

“వరం హుతవహజ్వాలాపంజరాంతః వ్యవస్థితిః,
న శౌరిచింతావిముఖజన సంవాసవైశనమ్”

(భగవంతుని భజించడంలో వైముఖ్యాన్ని కలిగిన వారితో కలసి జీవించడం కంటే అగ్ని జ్వాలలను కలిగిన పంజరం లోపల ఉండడం అయినా మెరుగే)అని కదా చెప్పబడుతున్నది. అందువల్ల భగవత్సంబంధం లేనివారి సంబంధాన్ని నిషేధిస్తున్నారు.

వ్యాఖ్య : **(మేతి)** - **(క్షీణపుణ్యాన్)** - పుణ్యమనేది ఉంటే, భక్తి లేకుండా పోదు. భక్తి లేనందున “కార్యాభావాత్ కారణాభావః" (కార్యం లేనందున కారణం లేదు) అనే న్యాయంలో పుణ్యం లేనివారై ఉంటారు.

**(భవతః)** - నిరతిశయానందం మొదలైన అసంఖ్యేయకల్యాణగుణాలతో, స్వరూపంతో, విగ్రహంతో పరమభోగ్యభూతుడవైన నీయొక్క,

**(పదాబ్జే)** - తామరపూవువలె సుకుమారాలై, సుందరాలై, నిరతిశయ సుగంధయుక్తాలైన శ్రీచరణాలలో,

**(క్షణమపి భక్తిహీనాన్ నాద్రాక్షమ్)** - క్షణకాలం కూడా భక్తి లేనివారిని కన్నులతో చూడను. నీ స్వరూపాదులలో ఒక్కొక్కదానిలోను అభినివేశాన్ని పొంది, ఎల్లప్పుడు భక్తిని కల్గి ఉండవలసి ఉండగా, క్షణం కూడా వీరు భక్తి లేకుండా ఉన్నారే! ఇదేమి మందభాగ్యం! వీరితో ఏకొంచెం సంబంధం కల్గి ఉన్నా, "నశ్యతే త్రై స్తు సంగమే" (భగవంతుని సేవించనివారితో పాటు చేసే స్నేహం మనలను నశింపజేస్తుంది) అని మనకుండే భక్తికూడా నశిస్తుంది. అందువల్ల. వీరిని కన్నెత్తి కూడా చూడను- అని భావం. "సదా పరగుణావిష్టో ద్రష్టవ్య స్సర్వదేహిభిః"(ఎల్లప్పుడూ భగవంతుని కళ్యాణ గుణాలలో ఆసక్తిని కలిగి ఉండే భక్తుని ఎల్లప్పుడూ దర్శించాలి) అని భగవద్భక్తులను కదా దర్శించాలి- అని భావం. ఈ విధంగా, భగవద్గుణ ప్రతిపాదకాలైన ప్రబంధాలను వీడి, ఇతర పాశుపతాది ప్రబంధాలను చెవులతో కూడా వినను- అని ఇక అంటున్నారు.

**(శ్రావ్యబంధమ్)** –"సంశ్రవే మధురం వాక్యమ్" (తీయని వాక్యాన్ని విన్నాడు) అని "సమ మధురోపనతార్థవాక్యబద్ధమ్" (మాధుర్యాన్ని కలిగిన అర్థాలను తెలియజేసే వాక్యాలతో కూడినది) అని పలికేటట్లు, శ్రావ్యాలైన పదవాక్యాలతో బద్ధమైన— అని అర్థం. ఇక్కడ శ్రావ్యపదానికి శ్రావ్యవాక్యపర్యంతం లక్షణయా అర్థం. నీ చరిత్రను ప్రతిపాదించే శ్రీరామాయణాది ప్రబంధాలను విడచి,

**(అన్యదాఖ్యానజాతమ్)** - ఇతర పాశుపతాది ప్రబంధాలను,

**(మా శ్రౌషమ్)** - చెవులతో వినను. ఇతరాఖ్యానాలను కంటితో చూడకపోవడమేకాక, ఎవరైనా దూరంలో నుండి పల్కినా, "శాంతమ్ పాపమ్" అని పల్కి, చెవులను మూసికొని, వేఱొక చోటుకు పరుగెత్తి పోతానని భావం. ఇంతేకాక శ్రియఃపతివి అయిన నీవు స్వరూపరూపగుణ విభూతులలో నీకు స్వరూపనిరూపక అయిన శ్రీవిషయంలో అపహ్నవం చేసేవారిని మనస్సులో కూడా స్మరించను- అని ఇక పల్కుతున్నారు.

**(మా స్మార్షమితి) - (మాధవ!)** శ్రియఃపతీ!,

**(భువనపతే!)** - ఉభయవిభూతులకు స్వామి అయినవాడా!,

**(త్వామపి)** - నిన్ను కూడా,

**(అపహ్నువానాన్)** - తిరస్కరించేవారిని,

**(చేతసా)** - మనస్సుతో,

**(మా స్మార్షమ్)** - స్మరించను. "త్వా" మనే దానికి సంబోధ్యతావచ్ఛేదకావచ్ఛిన్నంలో శక్తి కనుక (మాధవ! అనే సంబోధనచేత తెలియబడే భగవంతునకు విశేషణంగా ఉండే లక్ష్మీతో కూడుకున్నవాడు అనే అర్థంలో దృష్టి కనుక), ఇక్కడ "త్వా" మనే దానికి లక్ష్మీవిగ్రహవిభూత్యాది విశిష్టుడవై, జ్ఞానానందస్వరూపుడవైన నిన్ను- అని అర్థం. రెండు సంబోధనలు ఏతాదృశార్థ తాత్పర్య గ్రాహకాలు. కొందఱు పరమాత్మకు స్వరూపం లేదన్నారు. కొందఱు స్వరూపాన్ని అంగీకరించినా, గుణాలు లేవన్నారు. కొందఱు విగ్రహం లేదన్నారు, కొందఱు. విభూతి లేదన్నారు కొందఱు విభూతిని అంగీకరించి, దానికి నీతో గల సంబంధాన్ని తిరస్కరించారు. ఈ విధంగా పలు రీతులలోని ఈశ్వరాపహ్నకాలు- అని అర్థం. వీటిలో దేనిని పలికేవారైనా, వారి స్మరణం కూడదు- అని భావం. ఇక్కడ "మా స్మార్షమ్" అని అన్నందువల్లనే "చేతసా" అనేది అర్థాత్ సిద్ధమైనా, "చేతసా మా స్మార్షమ్" అని ప్రయోగం వ్యర్థం కదా! అంటే, అపుడు "చేతసా" అనే దానికి "అపహ్నువానాన్" అనేదానితో అన్వయం. అజ్ఞానంవల్ల అపహ్నానం చేయడం కాక, ప్రమాణజాతాలను చూచినా, వానిని కూడా మనఃపూర్వకంగా అపలపిస్తున్నారు. ఇటువంటివారు మహాపాపులుకదా! వీరి స్మరణమే తగదు- అని భావం. ఈ విధంగా

భగవత్ సంబంధాల గంధం ఏ మాత్రం లేనివారి ప్రస్తావం రాగా, తాముకూడ కాలవిశేషంలో (ఒకానొక సమయంలో) భగవత్సపర్యారహితులైతే ఏమి చేయాలి? అని కలత చెంది, జన్మజన్మాంతరాలలోను భగవత్పూజారహితులుగా తాము కాకూడదని ఇక అర్థిస్తున్నారు.

**(మా భూవమితి) - (జన్మజన్మాంతరేఽపి)** అన్ని జన్మలలో,

**(త్వత్సపర్యావ్యతికరరహితః)** - నీ పూజాసంబంధం లేనివాడనుగా,

**(మా భూవమ్)** - కాకూడదు.

## 16. జిహ్వే! కీర్తయ కేశవం మురరిపుం చేతో! భజ శ్రీధరం పాణిద్వంద్వ! సమర్చయాచ్యుత కథాః శ్రోత్రద్వయ! త్వం శృణు। కృష్ణం లోకయ లోచనద్వయ! హరే ర్గచ్ఛాంఘ్రి యుగ్మాలయం జిఘ్ర! ఘ్రాణ ముకుంద పాదతులసీం మూర్ధన్! నమాధోక్షజమ్ ॥

జిహ్వే = ఓ నాలుకా, కేశవం = కేశవుని, కీర్తయ = పాడుము, చేతః= ఓ మనసా!, మురరిపుం = మురాసురునికి శత్రువైన విష్ణువును, భజ = సేవింపుము, పాణిద్వంద్వ = చేతులజంటా! (రెండు చేతులారా), శ్రీధరం = లక్ష్మీదేవిని (రొమ్మునందు) ధరించినవానిని, సమర్చయ = చక్కగా పూజ చేయుము, శ్రోత్రద్వయ = ఓ చెవుల జంటా, అచ్యుతకథాః = విష్ణుకథలను, త్వం = నీవు, శృణు = వినుము, లోచనద్వయ = ఓ కన్నుల జంటా, కృష్ణం = శ్రీకృష్ణుని, లోకయ = చూడుము, అంఘ్రియుగ్మ = ఓ కాళ్ళజంటా, హరేః = విష్ణువుయొక్క, ఆలయం = గుడిని, గచ్ఛ = పొందుము, ఘ్రాణ = ఓ నాసికా, ముకుందపాద తులసీం = విష్ణువుయొక్క పాదములందలి తులసీదళమును, జిఘ్ర = వాసనచూడుము, మూర్ధన్ = ఓ శిరమా, అధోక్షజం = విష్ణువును, నమ = మ్రొక్కుము

**అవతారిక :**

ఈ విధంగా భగవద్భక్తిహీనుల సంబంధాన్ని తిరస్కరించి, తమ జ్ఞానకర్మేంద్రియాలను చూచి "మీ మీ వృత్తులు భగవద్విషయంలో అన్వయించేటట్లుగా వర్తించండి" అని ఒక్కొక్క ఇంద్రియాన్ని సంబోధిస్తూ అర్థిస్తున్నారు. మీ వృత్తులు భగవద్విషయంలో ప్రవర్తింపజేయనపుడు మీకు దృక్త్వశ్రోతృత్వపాణిత్వాది జాతులే సిద్ధించవు- అని,

"పుళ్ళూర్తరుమ్ పొన్మలైయై క్కాణాదార్ కణ్ణెన్లుమ్ కణ్ణల్ల కణ్ణామే"

(గరుడుని అధిరోహించి నడిపే బంగారు కొండవంటి భగవంతుని దరిశించని వారి కన్నులు కన్నులు కావు),

"తొణ్డర్ క్కినియానై క్కేళా చ్చెవికళ్ శెవియల్ల కేట్టామే"

(భక్తులకు భోగ్యుడైన వాని కథలను విననని చెవులు చెవులు కానే కావు),

"శంగెన్దుమ్ కైయానై తొழா క్కైయల్ల"

(పాంచజన్యశంఖాన్ని చేతిలో ధరించినవానిని నమస్కరించనివారి చేతులు చేతులు కావు)

ఇత్యాదులలో తిరుమంగై ఆళ్వార్లు అనుగ్రహించారు.

వ్యాఖ్య : **(జిహ్వే ఇతి)** - ఈ ఆళ్వార్ల ఇంద్రియాలు ముందుగానే భగవద్విషయంలో ప్రావణ్యాన్ని పొందగా, ఇక, వీరు ప్రార్థించడం ఎందుకు? అంటే, ఇంద్రియాలు భగవత్ ప్రావణ్యాన్ని కల్గి ఉన్నా, తమ అతిచాపల్యం వల్ల ఒకవేళ భగవద్వైముఖ్యాన్ని పొందితే, ఏమి చేయాలి? అనే అస్థానే భయశంకతో కలత చెంది ప్రార్థిస్తున్నారు.

అయినా, శేషభూతుని శేషి విధించడం ఉచితం తప్ప, ప్రార్థించడం తగునా? వీరికి శేషమై ఉండే ఇంద్రియాలను “ఈ విధంగా చేయి” అని విధించకుండా, ప్రార్థిస్తున్నారేమి? అంటే, తన పుత్రులు మంచివారైనా, పరగృహంలోని పుత్రులు తండ్రికి అణగి ఉండకుండా, స్వతంత్రులై, దుష్టులై ఉండడం గమనించి, తన పుత్రులను కూడా తండ్రి కార్యాన్ని సాధించేటట్లు, "ఎన్నై యాళుమ్ వన్కో వోరైన్దు" (నన్ను పరిపాలించేవి, చాలా క్రూరంగా ఉండేవి అద్వితీయాలైనవి అయిన పంచేంద్రియాలు) అని చేతనులకు శేషభూతాలైన ఇంద్రియాలు, తాను వెళ్ళే దారిలో శేషిని కూడా ఆకర్షించి పట్టి లాగుతాయి. కనుక, ఆ విధంగానే తమ ఇంద్రియాలు కూడా తమను అపథంలోకి పట్టి లాగుతాయో ? ఏమో! అనే శంకతో వాటిని అనుసరించి, కార్యాన్ని సాధిస్తున్నారు. ఇంతేకాక, తమకు శేషభూతులైనా, వారికి భగవత్సంబంధం ఉంటే, వారిని అనునయించి కార్యం సఫలం చేసికోవాలి తప్ప, విధించరాదనే శాస్త్రార్థం ఇక్కడ వ్యక్తం చేయబడింది. నమ్మాళ్వార్లు కూడా “మనమే ఉన్నై వల్వినైయే నిరన్దు" (మనసా! చాలా పాపం చేసిన నేను నిన్ను ప్రార్థిస్తున్నాను) అని తమ మనస్సు తమకంటే ముందే భగవద్విషయంలో ప్రావణ్యాన్ని పొందినప్పటికీ, చాపలాతిశయంతో అస్థానే శంకను పొంది, యాచించి, కార్యాన్ని సాధించారు కదా!

**(జిహ్వే)** - విషయాస్వాదాలను అనుభవించడం, మానవాధములనుగూర్చి కవిత్వం పల్కడం, పరనిందను చేయడమే స్వభావంగా కల ఓ నా జిహ్వే!,

**(కేశవం కీర్తయ)** - కేశవుని కీర్తించు. కేశవుని కీర్తిస్తే ఏమి ఫలం? అంటావా? 'ఇన్నాళ్ళుగా మనుష్యాదులను కీర్తించి ఏమి ఫలం కల్గుతుంది? "కేశవనై ప్పాడవుమ్ నీ" (కేశవుని పాడినప్పటికీ) అనే విధంగా కేశవకీర్తనం చేస్తే "పాఠ్యే గేయే చ మధురమ్" (పఠించడానికి, పాడడానికి తీయనిది) అని అది పలికే కాలంలోనే మధురమై ఉంటుంది. ఇంతకంటే వేఱే ఏమి ఫలం కావాలి? అదే స్వయం ప్రయోజనమై కదా ఉన్నది. కేశవుని అందం ఒక్కటి చాలదా ?

"ఉదగ్రపీనాంసవిలంబికుండలాలకావళీ బంధురకంబుకంధరమ్"

(గొప్ప, బలమైన భుజాలపై వేలాడే కుండలాలు, ముంగురులు అనే వీటిచేత చాలా అందమైన శంఖంవంటి కంఠాన్ని కలవానిని),

"దినపరిక్షయే నీలకుంతలై ర్బిసరుహాసనం బిభ్రదావృతమ్"

(సాయంకాల సమయంలో నల్లని ముంగురులతో కప్పబడిన, అందమైన తామర పువ్వు వంటి ముఖాన్ని కలిగినవానిని),

, "కుటిలకుంతలమ్" (ఉంగరాల జుట్టును కలిగినవానిని),

"మైవణ్ణమ్ నఱుమ్ కుంజి కు*ழ*ల్ పిన్ తా*ழ*;",

(కాటుకవలె నల్లని రంగును కలిగిన, సువాసనను కల కేశపాశం వెనుక వేలాడుతూ ఉండగా),

“కొళ్ కిన్ఱ కోళిరుళై చ్చుకిర్ న్దిట్ట కొ(ప్రుమ్ శురుళిన్
ఉట్కొణ్డ నీల నన్నూల్ తణైళ్లుకొల్! "

(లోకం అంతా వ్యాపించే, నల్లని చీకటిని గ్రహించి, దాని పై పొరను ఒలిచి, ఆ విధంగా ఉండే చక్కని గుండ్రని ఉండనుండి తీయబడిన, మంచి, నల్లని నూలా! అని భగవంతుని కేశాలు)

ఇత్యాదిగా అందంగా కదా స్వామి కుంతలాలుంటాయి. కేశవనామానికి "అందమైన కేశాలను కలవాడు" అనే అర్థమున్నది. అర్ణవశబ్దానికి “అర్ణః అస్యాస్తీతి అర్ణవః" అనే విగ్రహం చెప్పినట్లుగా, 'కేశాః అస్య సంతీతి కేశవః" అనే విగ్రహాన్ని పల్కి, ప్రశస్త కేశాలను కలవాడనే అర్థం గ్రహించాలి. వాలీత్యాదివత్. “కేశవః క్లేశనాశనః” అనేవిధంగా క్లేశాన్ని తీర్చేవాడు, ఇంతేకాక "కేశవః కేశిహంతా” కేశి అనే అసురుని నిరాకరించినట్లే మనకు విరోధులైన రజస్తమస్సులను నివర్తింపజేస్తాడు. రజస్తమస్సులను, క్లేశాలను నివర్తింపజేయడంలో స్వామికి శక్తి ఉన్నదా ? అంటే,

“క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽహం సర్వదేహినామ్,
ఆవాం తవాంగే సంభూతౌ తస్మాత్కేశవనామవాన్"

(క అనే అక్షరంతో బ్రహ్మ చెప్పబడుతున్నాడు. నేను సకల ప్రాణులకు ఈశ్వరుడను. మేమిద్దరము నీ శరీరం నుండి పుట్టాము. అందువల్ల నీవు కేశవుడవు అనబడుతున్నావు) అని స్రష్టృత్వేన, , సంహర్తృత్వేన ప్రసిద్ధులైన బ్రహ్మరుద్రాదులకు కూడా కారణభూతుడై కదా ఉన్నాడు. అందువల్ల, అతడు సర్వశక్తుడని భావం. ఇంతేకాక, కేశవుని కీర్తిస్తే,

“యావంతి త్వక్షరాణ్యత్ర గీయమానే యశస్విని,

తావద్వర్షసహస్రాణి స్వర్గలోకే మహీయతే”

(ఎవడు, ఎన్ని అక్షరాలతో భగవంతుని కీర్తిస్తాడో, అతడు అన్ని వేల సంవత్సరాల పాటు స్వర్గలోకంలో ఆనందాన్ని పొందుతాడు)

అని ఒక్కొక్క అక్షరానికి స్వర్గాది ఫలం తెలుపబడుతున్నది కదా!

**(హే చేతః! మురరిపుం భజ)** - ఓ మనసా! మురాసురహంత అయిన శ్రీకృష్ణుని సేవించు. ఓ మనసా! సర్వేంద్రియ వ్యాపారాలు నీ అధీనంలో ఉన్నందున నీవు మురరిపును భజనం చేస్తే, మిగిలిన ఇంద్రియాలు కూడా దొంగతిండి తినకుండా భగవద్విషయంలో ప్రావణ్యాన్ని పొందుతాయి. అందుచేత నీవు శ్రీకృష్ణుని భజించాలి- అని ప్రార్థిస్తున్నారు. "కీర్తయ, భజ" ఇత్యాదులు ప్రార్థనార్థకంలో లోట్ రూపాలు. "చంచలం హి మనః కృష్ణ! "(శ్రీకృష్ణ మనస్ చాలా చంచలమైనది) అని మనస్సు కపివలె చంచల స్వభావాన్ని కల్గి ఉన్నది కదా!, అది ఏ విధంగా స్థిరంగా నిలచి, భజనం చేస్తుంది?- అని సందేహించవద్దు. మురాసురుని సంహరించినట్లుగా, ఒకసారి స్వామిని స్మరిస్తే, చాంచల్యాన్ని పోగొట్టి ఏకాగ్రతను కల్గిస్తాడు. అంతేకాక, "భజన సుఖ మేకస్య విపులమ్" అని భజన సమయంలోను అది అత్యంతం భోగ్యమై ఉంటుంది.

**(పాణిద్వంద్వ! శ్రీధరం సమర్చయ)** -అతిపరిమళతులసీ మల్లికామందార పుష్పాలతో "మలర్ మకళ్ కై వరుడ మలర్ పోదిల్ శివన్దన" (లక్ష్మీదేవి తన చేతులతో సంవాహనం చేయగా, భగవంతుని పూలవంటి సుకుమారమైన పాదాలు ఎర్రబడ్డాయి) అని పుష్పసారభూత అనదగిన అతిసుకుమారి లక్ష్మీదేవి సంవాహనం చేస్తేనే ఎఱ్ఱబడే రీతిలోని సుకుమారమైన శ్రీచరణాలు క్లేశపడకుండా ఉండే రీతిలో భయపడుతూ అర్చనం చేయడం, అందమైన కేశాలలో పుష్పాలను చుట్టడం, ఇత్యాది కైంకర్యాలను చేయాలి. "అర్చయ" అనేది చేతులతో చేయదగిన కైంకర్యాలకు అన్నిటికీ ఉపలక్షణం. రుద్రాదులను అర్చించకూడదా ? అంటే,

"అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్మేల్ మంగై యుఱై మార్బా! ”

("నిన్ను అర క్షణంకూడా విడువలేను" అని పలికే లక్ష్మీదేవిని వక్షఃస్థలంలో కలిగిన వాడా!) అనే విధంగా శ్రీదేవి నిత్యావాసం చేసే రీతిలోని సర్వసంపత్ సమృద్ధి కలవానిని విడచి, బిచ్చమెత్తేవాడు, **(బ్రహ్మ)** జటల ముడిని కలవాడైన రుద్రునకు పూజాదులు తగునా ?- అని భావం. “చిక్కుత్తలైయనుక్కుమ్ పిచ్చైయుణ్ణిక్కుమ్ పూవుమ్ పూశనైయుమ్ తకుమో! ” (చిక్కుపడిన తలలను కలవడానికి, భిక్షం ఎత్తి భుజించేవానికి పూలు, పూజ తగునా?) అని అడుగరాదుకదా! - అని ఎమ్బార్ సూక్తి. “పాణిద్వంద్వ” అని రెండు చేతులను చేర్చిపల్కినందున ఒక చేతితో (ఒంటి చేతితో) అర్చనాదులు చేస్తే కైంకర్యం కాకపోవడమేకాక,

“ఏకహస్తేన పద్మాక్షం ప్రణమంత్యర్చయంతి యే,
తేషాం గతిం ప్రపద్యేయ యద్యహం నాగమే పునః"

(ఒక చేతితో భగవంతుని ఎవరు నమస్కరిస్తున్నారో, లేక అర్చన చేస్తున్నారో, వారు పోయే గతికి, నేను చెప్పినట్లు రాకపోతే, నేను పొందుతాను) అనే విధంగా అపరాధంలోకి చేరుతుంది- అనే అర్థం సూచితం.

**(శ్రోత్రద్వయ! అచ్యుతకథాః త్వం శ్రుణు)** - భగవత్కథలను, ఓ నా శ్రోత్రయుగ్మమా!, ఆలకించు. వినేటపుడు ఒక చెవితో స్త్రీలు మొదలైన విషయాంతర కథలను, వినడం ఒక చెవితో భగవత్కథలను వినడం చేయకు. ఏకకాలావచ్ఛేదంగా రెండిటితో భగవత్కథలను విను. రుద్రాదికథలను శ్రవణం చేయకూడదా? అంటే, “మన్నుఱిల్” అనే విధంగా ఒక్కసారి కూడా ద్యుతి కలుగకుండా స్థిరంగా ఉండాలంటే, “

అభూతసంప్లవే ప్రాప్తే ప్రలీనే ప్రకృతౌ మహాన్,
ఏక స్తిష్ఠతి విశ్వాత్మా స తు నారాయణః ప్రభుః”

(అపూర్వమైన ప్రళయం సంభవించినప్పుడు, ప్రకృతిలో మహాన్ అనే తత్వం లీనమైనప్పుడు, విశ్వానికి అంతటికి ఆత్మ అయిన, ప్రభువైన ఆ నారాయణుడు ఒక్కడే నిలచి ఉన్నాడు) అని ప్రళయకాలంలో కూడా చ్యుతి లేనందున అచ్యుతుడనే తిరునామాన్ని పొందిన నారాయణుని కథలను విను. “న విద్యతే చ్యుతం చ్యుతిః యస్య సః” (ఎవరికి నాశనం లేదో అతడు అచ్యుతుడు), “శక్యా గణయతుం లోకే న వ్యతీతాః పితామహాః” (ఇంతవరకు ఎంతమంది బ్రహ్మలు వెళ్లిపోయారో, వారి లెక్కను కట్టడం సాధ్యం కాదు) అని అస్థిరులైన బ్రహ్మరుద్రాదుల కథాశ్రవణం చేస్తే మనకు స్థైర్యం కల్గుతుందా ? అంతేకాక

“తవ కథామృతం తప్తజీవనం కవిభిరీడితం కల్మషాపహమ్, శ్రవణ మంగళమ్"

(నీ చరిత్రలనే అమృతం సంసారతాపాన్ని పొందినవారికి జీవింపచేసేది, కవులచే కీర్తింపబడేది, మా దోషాలను తీర్చేది, చెవులకు మంగళాన్ని కలిగించేది) అని సంసారదవానల తప్తునకు అమృతంవలె శీతలమై, భోగ్యమై, జీవనహేతువై ఉండడంతోపాటు శ్రవణమైన (శ్రవణేంద్రియమైన) నీకు మంగళావహమై ఉంటుంది.

"శ్మశాననిలయో రుద్రో భస్మోద్ధూళనతత్పరః,
భూతప్రేత పిశాచాదిపరివారసమర్చితః,
క్రూరైః మహావిషైః సర్పైః భూషితావయవ స్సదా”

(రుద్రుడు, స్మశాన భూమిని నివాసంగా కలవాడు, ఎల్లప్పుడూ శరీరానికి బూడిదను రాసుకునేవాడు, భూతాలు, ప్రేతాలు, పిశాచాలు మొదలైన పరివారంతో కూడి ఉంటాడు. భయాన్ని కలిగించే గొప్ప విషాన్ని కలిగిన పాములను తన శరీరావయవాలలో ఆభరణాలుగా ఎల్లప్పుడూ కలిగి ఉంటాడు)

అని రుద్రకథను విన్న మాత్రంలోనే భయంకరంగా ఉంటుంది.

**(లోచనద్వయ! కృష్ణం లోకయ)** - ఒక కంటితో స్త్రీలు మొదలైనవారిని దర్శించడం, ఇంకొక కంటితో శ్రీకృష్ణుని దర్శించడం కాకుండా, రెండిటితోను శ్రీకృష్ణుని దర్శించు- అంటున్నారు.

"కృష్ణ మాగత మాకర్ణ్య విదర్భపురవాసినః,
ఆగత్య నేత్రాంజలిభిః పపు స్తన్ముఖపంకజమ్,

(కృష్ణుడు వచ్చాడని తెలిసి, విదర్భపురంలో ఉండే జనులు అందరు వచ్చి, తమ నేత్రాలు అనే దోసిళ్ళతో అతని ముఖం అనే తామర పువ్వులో ఉండే తేనెను తాగారు),

"లోచనాభ్యాం పిబన్నివ" (కళ్ళతో పానం చేస్తూ),

"కృష్ణసందర్శనం మహ్యం కథం స్యాదితి చింతయన్" శ్రీకృష్ణుని దర్శనం నాకు ఏ విధంగా కలుగుతుంది అని ఆలోచిస్తూ) అని ఆశపడే రీతిలోని శ్రీకృష్ణుని దర్శించు.

"య శ్చ రామం న పశ్యేత్తు యం చ రామో న పశ్యతి,
నిందితః స భవేత్"

(ఎవడు శ్రీరాముని చూడలేదో, ఎవరిని శ్రీరాముడు చూడలేదో, అతడు లోకంలో నిందింపబడుతున్నాడు)
అని ఎవడైనా శ్రీరాముని దర్శించకపోతే అతని ఆత్మకూడా తనను గర్హిస్తుందని చెప్పబడింది కదా! కృష్ణుడనే తిరునామాన్ని కల్గి ఉండడంతోపాటు, కృష్ణవర్ణాన్ని కల్గి ఉంటాడు. అన్ని వర్ణాలలోను కృష్ణవర్ణం కంటికి సుఖావహమై ఉంటుందనేది లోకప్రసిద్ధం. ఈ విధంగా కంటితో చూస్తే సుఖాన్ని కల్గించే వర్ణాన్ని కల్గి ఉన్నాడనేది తాత్పర్యం.

**(హరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయమ్)** - క్షుద్రప్రభువులవద్దకు ధనంకోసం వెడితే నిష్ఫలమే కాక, వారు కోపిస్తారు కూడా. సర్వేశ్వరుడైన హరియొక్క ఆలయానికి వెడితే "యావంతో ౨ స్య పదన్యాసా స్తావత్ స్వర్గే మహీపతే" (భగవంతుని ఆలయానికి వెళ్లడం కోసం ఒకడు ఎన్ని అడుగులు పెడతాడో, ఆంత కాలం అతడు స్వర్గంలో ఆనందిస్తాడు) అనేవిధంగా ఒక్కొక్క పాదన్యాసానికి మహాఫల మున్నది. "హరిర్హరతి పాపాని" అని నడచిపోయే ఉద్యోగమాత్రంతో సర్వపాపాలను హరించడంతో పాటు, ఆలయానికి వెళ్ళి, హరిని కంటితో దర్శిస్తే, సర్వక్లేశం నివృత్తమై, మహానందం కల్గుతుంది కదా. సేవార్థం నడచి వచ్చిన అక్రూరుని, కుచేలుని గాఢాలింగనం చేసికొని కుశల ప్రశ్నం మొదలైన ఉపచారాలను చేశాడుకదా స్వామి! అందువల్ల, ఓ పాదాలలారా! మీరు కూడా హరి ఆలయానికి నడచి వెళ్ళండి" - అని అంటున్నారు. రాజుయొక్క అంఘ్రి అయినందున యానారూఢుడై పోవాలనే గర్వాన్ని పొందకుండా, "పద్భ్యామేవ మహాబాహు: ప్రవివేశ మహద్వనమ్" (కాళ్ల నడకతోనే గొప్ప బాహువులను కల భరతుడు ఆ మహారణ్యంలో ప్రవేశించాడు) అని భరతాళ్వాన్ కాళ్ళతో నడచి వనానికి పోయినట్లే, నడచిపోవడం కూడా ఆనందావహమై ఉంటుంది. నడచి ఆలయానికి వెడితే, శ్రీకృష్ణుడు తిరునాడుకు వేంచేశాడు కదా! ఆ స్వామిని దర్శించడం ఏవిధంగా ? అని ఆర్తిని పొందిన కన్నులు కూడా

"తం వైశ్రవణసంకాశ ముపవిష్టం స్వలంకృతమ్,
అనులిప్తం పరార్థ్యేన చందనేన పరంతపమ్,

స్థితయా పార్శ్వత శ్చాపి వాలవ్యజనహస్తయా,
ఉపేతం సీతయా సార్థం చిత్రయా శశినం యథా”

(కుబేరునితో సమానమైనవాడు, సింహాసనంలో కూర్చున్నవాడు చక్కగా అలంకరింపబడినవాడు, గొప్ప చందనంతో పూయబడినవాడు, పక్కన, చామరంతో చేతిలో కలిగిన చామరగ్రాహిణితో కూడుకున్నవాడైన, సీతతో పాటు వేంచేసి ఉండే ఆ శ్రీరాముడు, చిత్రా నక్షత్రంతో కూడిన చంద్రుని వలె ఉన్నాడు)

అనే విధంగా దివ్యాలంకారాలంకృతమై దివ్యదేవేరులతో కూడా ఆ శ్రీకృష్ణుడు తాను శ్రీరంగాద్యాలయాలలో వేంచేసి ఉన్నందున అతనిని దర్శించి ఆ కన్నులు ఆనందాన్ని పొందుతాయి. ఈ విధంగా ఆలయానికి వెడితే, భగవానుని శ్రీచరణ కైంకర్యవరులచే అర్చింపబడిన తులసి లభిస్తుంది. దానిని, ఓ ఘ్రాణేంద్రియమా! నీవు ఆఘ్రాణించు. వాసన చూడగానే ఆ తులసి స్వాభావికపరిమళంతోను, అతిపరిమళ భగవచ్చరణారవింద సంబంధంతోను కల్గిన దివ్యపరిమళంతో నీకు ఆ కాలంలో గొప్ప తృప్తిని కల్గిస్తుంది. అంతేకాక, దుర్గంధాఘ్రాణం వల్ల ఏర్పడిన పాపాలు కూడా పోతాయి- అనే అభిప్రాయంతో ఇక పల్కుతున్నారు.

**(జిఘ్ర ఘ్రాణ! ముకుందపాదతులసీమ్)** - అని అన్నందున ఆ తులసి కూడా ముక్తిప్రదుడైన ముకుందపాద తులసికదా, అది సులభంగా లభించదు. నమ్మాళ్వార్లు,

"అల్లిమలర్ త్తణ్ణు*ழ*ాయుమ్ తారాన్”

(అమరపూవులతో కూడిన చల్లని తులసిని భగవానుడు మనకు ఇవ్వడం లేదు) అని,

“తాళిణై మేలణి త్తణ్ణన్దు*ழ*ాయెన్ఱే శొల్లుమాల్"

(భగవంతుని పాదాలకు అలంకారమై ఉండే చల్లని, అందమైన తులసి కావాలని పరాంకుశ నాయకీ పలుకుతున్నదే! అయ్యో!)

ఇత్యాదులలో భగవచ్చరణారవింద దివ్యతులసీదళంలోని ఆశతో ప్రార్థించి ఆశపడినా, అది లభించనందున, క్లేశపడి, "కోట్పట్ట శిన్దైయాయ్" అనే పాశురంలో సహజంగా కూసే అణిల్ పక్షిని చూచి, ఓ అణిల్ పక్షీ! నేను భగవచ్చరణారవింద తులసి లభించనందున కేశపడుతున్నట్లుగానే, నీవు కూడా స్వామి శ్రీచరణాలలోని తులసిని ఆశపడి, అది లభించనందున ఆక్రందిస్తున్నావా ? అని బాధపడ్డారు. ఆళ్వార్లకు దుర్ఘటమైన తులసి నీకు మహాభాగ్యం వల్ల లభిస్తున్నది. అందుచేత నీవు దానిని అలక్ష్యం చేయవద్దు- అని భావం.

**(మూర్ఘన్! నమాధోక్షజమ్)** - ఆలయానికి వెడితే నమ్మాళ్వార్లు మొదలైనవారికి కూడా దుర్లభమైన తులసి లభించడమే కాక, 'న సందృశే తిష్ఠతి రూపమస్య" (ఈ భగవానుని రూపం బాహ్యచక్షువులకు కనిపించదు), "పాఱియుణర్ వవైయిలన్" (బాహ్యాలైన ఇంద్రియాలకు భగవంతుడు అందేవాడు కాడు) ఇత్యాదిగా ఇంద్రియజన్యజ్ఞానానికి అందదు కనుక, అధోక్షజుడని పేరుపొందిన సర్వేశ్వరుడు కూడా అనుగ్రహవిశేషంతో అందఱు తన రూపాన్ని దర్శించేటట్లు అర్చారూపాన్ని స్వీకరించి, శ్రీరంగాదిదివ్యదేశాలలో సన్నిహితుడై ఉన్నాడు, అతనిని చూచి, "కిరీటార్హమైన ప్రభువుయొక్క శిరస్సు" - అని గర్వం పొందకుండా, "దండవత్ ప్రణమేద్భువి" అనే రీతిలో కిందకు వాలి నమస్కారం చేయి—అని శిరస్సును చూచి ఇక పల్కుతున్నారు—

**(మూర్ధన్! నమాధోక్షజమ్)** - అని అంటూ. "అధః కృతః అక్షజమ్, ఇంద్రియ జన్యజ్ఞానం యేన సః- ఇంద్రియ జన్యజ్ఞానావిషయ ఇత్యర్థః". (ఇంద్రియాల జ్ఞానానికి విషయం కాని వాడు —అని అధోక్షజనామానికి అర్థం. "పశ్యత్యచక్షు స్స శృణోత్యకర్ణః" (ఆ భగవంతుడు

కన్నులు లేకుండానే చూడగలడు. చెవులు లేకుండానే వినగలడు) అనే విధంగా "ఇంద్రియజన్యజ్ఞానాశ్రయ ఇతి వార్థః". ఇంద్రియనిరపేక్షంగా "యో వేత్తి యుగపత్ సర్వం" (ఒకేసారి అన్నిటిని తెలుసుకుంటున్నాడు) అనేవిధంగా సర్వజ్ఞుడు కనుక పరాత్పరుడైన అతనిని నమస్కరించు- అని కూడా అర్థం. ఇంద్రియకార్యాన్ని జయించినవాడు- జితేంద్రియుడని అర్థం. జితేంద్రియుని విడచి, ఇంద్రియవశ్యులైన దేవతాంతరాలను నమస్కరిస్తే ఏమి ప్రయోజనం? అంతేకాక,

"ప్రేక్షావతః ప్రవృత్తి ర్యా ప్రహ్వీభావాత్మికా స్వతః,
ఉత్కృష్టం పర ముద్దిశ్య తన్నమః పరిగీయతే"

(చాలా గొప్పవాడైన పరమాత్మను ఉద్దేశించి వినయంతో కూడిన సహజమైన పండితుల ప్రయత్నం ఏది ఉన్నదో, అది, నమస్కారం అని చెప్పబడుతున్నది),

అనేటట్లు నంతప్యనకు ఉండవలసిన పరత్వ మిచట చెప్పబడింది.

**17. హే లోకా శ్శృణుత ప్రసూతి మరణ వ్యాధే శ్చికిత్సా మిమాం**
**యోగజ్ఞాః సముదాహరంతి మునయో యాం యాజ్ఞవల్క్యాదయః।**
**అంతర్జ్యోతి రమేయ మేక మమృతం కృష్ణాఖ్య మాపీయతాం**
**తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణ మాత్యంతికమ్॥**

హే లోకాః = ఓ జనులారా, ఇమాం =నేను చెప్పబోవుచున్నట్టి, ప్రసూతి మరణ వ్యాధేః = చావు పుట్టుకలు అనే రోగమునకు, చికిత్సాం = మందును, శృణుత = వినుడు, యాం = ఏ ఔషదమును, యోగజ్ఞాః = యోగ శాస్త్రము తెలిసినట్టి, యాజ్ఞవల్క్యాదయః = యాజ్ఞవల్క్యమహాముని మొదలుగా కలవారైన, మునయః = ఋషులు, సముదాహరంతి = చెప్పుచున్నారో, అంతః జ్యోతిః = లోపలనే వెలుతురు కలది - స్వయం ప్రకాశమైనది, అమేయం = లెక్కపెట్టదగనిది అయిన, కృష్ణాఖ్యం = శ్రీకృష్ణమూర్తి అనే పేరు కల, అమృతమ్ ఏకం = అమృతం ఒక్కటే, ఆపీయతాం = త్రాగబడునుగాక, పీతం = పానము చేయబడిన, తత్ = ఆ, పరమౌషధం = ముఖ్యమైన ఔషధమే, ఆత్యంతికమ్ = మిక్కిలి అధికమైన, నిర్వాణం = ఆనందమును (మోక్షమును) వితనుతే =కలుగజేస్తున్నది

**అవతారిక :**

ఈ విధంగా ఆళ్వార్లు ప్రార్థించగానే, వారి జిహ్వ మొదలైన కరణాలు ససంభ్రమంగా పరుగెత్తి, వచ్చి నిలచి, "మేము శేషి అయిన మీకు శేషభూతులం కదా! మమ్మలను నియమించాలి తప్ప, ప్రార్థించవచ్చునా? నియమిస్తే, “పచేయ మపి పావకే” అనే విధంగా అగ్నిలో కూడా దూకే రీతిలోని మమ్మలను అమృతాన్ని పానం చేయమని కదా నియమిస్తున్నారు” అని అనగా, ఆళ్వార్లు అది విని హృష్టులై, చల్లగా కటాక్షించి, అనుగ్రహించారు. అపుడుశఇంద్రియాలు కూడా ప్రసాదాన్ని పొందుతూ, తమ తమ వృత్తులను భగవద్విషయంలో ప్రవర్తింపజేసి, ఆనందం ఉన్మస్తకం అయినది.

“త్వక్చ దృక్చ నిపిపాసతి, జిహ్వా విహ్వాలా శ్రవణవత్ పరవృత్తౌ”

(తగింద్రియం, నేత్రం పానం చేయాలని కోరుతున్నవి. జిహ్వా చెవి వలె తనది కాని వ్యాపారంలో ఆసక్తిని పొందుతున్నది) అని, “ముడియానే మూవులకుమ్” ఇత్యాదులలో వలె ఆ యా ఇంద్రియాలు స్వవృత్తితో పాటు పరవృత్తిని కూడా ఆశపడేటట్లుగా ఉండే రీతిని చూచి, ఇంకా చాలా సంతుష్టులై, ఈ ఆనందాన్ని "ఏక స్స్వాదు న భుంజీత" (మంచి వస్తువును ఒక్కడే ఆనందించకూడదు) అనే న్యాయంలో “తొణ్డీర్! ఎల్లారుమ్ వారీర్! ” (భక్తులారా! అందరూ రండి) అనే విధంగా పలువురితో చేరి, అనుభవించాలని ఆశ కల్గి, అందుకోసం లోకులను గమనించి చూచారు. వారు, అందఱు సంసారవ్యాధిగ్రస్తులై ఉండడం గమనించి, పరమకృపతో వీరికి చికిత్సను చేసి, వ్యాధిని తీర్చి, వీరిలో కలసి అనుభవించాలని తలచి, లోకులను చూచి, "ఓ లోకులారా! వినండి. ఎద్దును ధ్వజచిహ్నంగా కలవాడు, బ్రహ్మ, ఇంద్రుడు, ఇంకా అన్యులు ఎవరూ ఈ జన్మ అనే వ్యాధికి మందు తెలిసినవారు లేరు “పిఱవి యెన్నుమ్ నోయ్ క్కు మరున్దుఱివారుమిల్లై" (సంసారం అనే వ్యాధికి ఏది మందో తెలిసిన వారు లేరు) అనే విధంగా ఈ సంసారవ్యాధికి మందును తెలిసినవారు లేనందున, తానే వైద్యుడై ఉండడమే కాక, మందుగా కూడా ఉండే విలక్షణామృతాన్ని మాత్రమే రస్యంగా మీరు పానం చేయండి. అది సంసారవ్యాధిని నిశ్శేషంగా నివర్తిస్తుంది. ఇంతేకాక, మహానందం కల్గుతుంది. దీనినే యాజ్ఞవల్క్యాది యోగులు స్మృతులు మొదలైనవానిలో వ్యక్తపరచారు- అని ఇక పల్కుతున్నారు.

వ్యాఖ్య : **(హే లోకా! ఇతి)** ప్రసూతి, మరణమనే సంసారం వ్యాధివలె పీడాకరమై ఉన్నదని, దీనికి ఇది చికిత్స- అని తెలియలేక, తడబడే అలమటించే ఓ మూఢజనులారా! అని భావం.

**(ప్రసూతిమరణవ్యాధేః)** - జన్మమరణాలనే విలక్షణవ్యాధికి- అని అర్థం. వ్యాధి అనేది అనుభవించే కాలంలో మహాదుఃఖకరంగా, శరీరనాశకరంగా ఉంటుంది. ప్రసూతి కూడా మహాదుఃఖావహంగా ఉంటుంది. ఉల్బసంవేష్టితుడై, భుగ్నపృష్ఠగ్రీవుడై, పూయశోణిత

మూత్రమలపంక శాయియై, ప్రసూతిమారుత బలంవల్ల అధోముఖంగా మహాదుఃఖంతో భూమిపై పడి మూర్ఛితుడై ఉంటాడు. ఆ విధంగానే, ఉత్క్రాంతివ్యసనంకూడా అతిబలవత్తరంగా ఉంటుంది. ప్రసూతి మరణాలు తత్కాలంలో దుఃఖపరమై ఉండడంతో పాటు ఆత్మనాశకాల ఉంటాయి. వ్యాధి శరీరనాశకరం, సంసారవ్యాధి ఆత్మనాశకరం. ఈ వ్యాధికి–

**(ఇమాం చికిత్సాం శ్రుణుత)** - ఈ చికిత్సను నేను పల్కుతున్నాను, వినండి. లోకంలో మందును తాగితేనే తప్ప కార్యకరం కాదు. (వ్యాధి తగ్గదు). ఈ మందు శ్రవణమాత్రంలోనే సంసారవ్యాధిని నివర్తింపజేస్తుంది. "య ఇదం శృణుయాన్నిత్యమ్" అని కదా చెప్పబడుతున్నది. అంతేకాక, కొన్ని చికిత్సలను వినేటపుడు కూడా అవి కర్ణకఠోరంగా ఉంటాయి. ఇది కర్ణసుఖావహంగా ఉంటుంది. అందువల్ల, సావధానంగా వినండి. లోకంలో, స్వబుద్ధితో మందును చేసి ఇస్తే, అది ప్రతికూలం కావచ్చు. ఆ విధంగానే, మీరు పలికే సంసారవ్యాధికి మందు స్వబుద్ధితో కల్పితమై ఉంటే, అది సంసారవ్యాధిని తీరుస్తుందా ? వృద్ధి చేస్తుందా? ఇతరమతస్థులచే సంసారనివర్తకమని స్వబుద్ధితో కల్పించిన దేవతాంతరోపాసనలు సంసారవర్ధకాలుగా లేవా? అంటే, "ఈ చికిత్సను నేను స్వబుద్ధితో కల్పించి చెప్పలేదు. యాజ్ఞ్యవల్క్యాదులు పలికినదానినే తెలిపాను. అంతే. వారు కూడా ఉపదేశపరంపరగా దీనినిగూర్చి అర్థగ్రహణం చేయడమే కాక, స్వయోగమహిమసాక్షాత్కృత పరావరతత్త్వజ్ఞానాన్ని కలవారై ఉన్నారు. అందువల్ల, వారు పల్కినది అంతా ప్రమాణతమమనే ఉద్దేశ్యంతో ఇక పల్కుతున్నారు.

**(యోగజ్ఞా ఇత్యాది) (యోగజ్ఞా:)** - యోగజ్ఞానాన్ని కలవారైన– అని అర్థం. జ్ఞానానికి అనుష్ఠానపర్యంతంగా లక్షణను చెప్పుకోవాలి. యోగస్వరూపాన్ని చక్కగా తెలిసి, అనుష్ఠానం చేసేవారు- అని భావం.

**(యాజ్ఞ్యవల్క్యదయః మునయః)** - స్వయంగా మననశీలురై ఉండేవారు.

**(యామ్)** - ఏ చికిత్సను,

**(సముదాహరంతి)** - చక్కగా ఉదాహరిస్తున్నారో- అని అర్థం. మైత్రేయీ బ్రాహ్మణంలో "అమృతత్వస్యతు నాశాస్తి విత్తేన" అని ఆరంభించి, "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్య! " (ఈ ఆత్మ వినదగినది, మననం చేయదగినది, మనసులోపల ధ్యానించదగినది, ప్రత్యక్ష సమానాకారంగా దర్శించదగినది) ఇత్యాదులలతో సంసారనివృత్తి అర్థాదులలతో రాదు. పరమాత్మ విషయకమైన శ్రవణమనన నిదిధ్యాసనాలను చేయాలి- అని ఉపదేశించి, తరువాత, యోగయాజ్ఞ్యవల్క్యమనే గ్రంథంద్వారా ఉదాహరించారు. ఇది చికిత్స ఏవిధంగా అయింది?- అనే విషయాన్ని శ్లోకం ఉత్తరార్ధంలో వివరిస్తున్నారు.

**(అంతర్జ్యోతిః)** - "సదా జనానాం హృదయే సన్నివిష్టః" (ఎల్లప్పుడూ జనుల హృదయంలో వేంచేసి ఉంటాడు) అనే విధంగా అంతర్హృదయంలో సన్నిహితుడై ఉండేటపుడు "జ్యోతిరివాధూమకః" (పొగలేని జ్యోతిస్సువలె) అనే విధంగా నిరతిశయజ్యోతిస్స్వరూపుడై ఉన్నాడు. ఈ విధంగా హృదయాంతర్వర్తిగా ఉంటే అతని స్వరూపం పరిచ్ఛిన్నమా ? అంటే,

**(అమేయమ్)** - ఎటువంటి స్వరూపాన్ని కల్గి ఉంటాడో తెలియడం సాధ్యం కాదు. "సర్వస్మాత్ జ్యాయాన్" (అందరి కంటే గొప్పవాడు)గా ఉంటాడు. "జ్యాయాన్ పృథివ్యాం జ్యాయానంతరిక్షాత్"(హృదయంలో ఉండే పరమాత్మ భూమి కంటే గొప్పవాడు, అంతరిక్షం కంటే గొప్పవాడు)? అనే శ్రుతి హృదయాంతర్వర్తిత్వ ప్రయుక్తమైన అల్పత్వనివృత్తి పరమైనట్లే, హృదయాంతర్వర్తిత్వప్రయుక్తమైన అల్పత్వాన్ని నివారించే పదం శ్లోకంలోని "అమేయ"మనే పదమని తాత్పర్యమ్.

**(ఏకమ్)** - హృదయాంతరర్జ్యోతిస్స్వరూపుడై, అప్రమేయుడై ఉండేవాడొకడేనా ? పలువురున్నారా? అని సందేహించవద్దు- అని భావం.

**(అమృతమ్)** - "యత్తచ్ఛాతం తమభయ మమృతం ఆనందో జరోఒమృతః" ఇత్యాది క్రమంలో అమృతంవలె భోగ్యభూతుడై ఉన్నాడు. ఇది శ్లోకంలో విశేష్యపదం "కృష్ణాఖ్య మమృత మాపీయతామ్" అని అన్వయం. అమృతంవలె భోగ్యమై ఉండేవాడెవడు? అనే విశేషాకాంక్ష రాగా, శ్రీకృష్ణుడై వచ్చి అవతరించి, ఉలూఖల బంధనాదులను అనుభవించి, పరమసులభుడైన శ్రీకృష్ణుడే- అని పల్కుతున్నారు–

**(కృష్ణాఖ్యమ్)** - అని అంటూ.

**(ఆపీయతామ్)** - రస్యంగా మీచే పానం చేయబడుగాక. “భవద్భిః” అనే పదాన్ని అధ్యాహరించుకోవాలి. శ్లోకం “ఉత్తరార్ధంలో యాజ్ఞ్యవల్క్యోక్తమైన అర్థాన్ని సంగ్రహించడం జరుగుతున్నది. ఏ విధంగా? అంటే,

**(అంతః)** అంతర్వర్తి- అని అర్థం. "జీవాత్మని అంతర్యామితయా అవస్థితః" (జీవాత్మలో అంతర్యామిగా ఉన్నవాడు) అని అర్థం. ఇందువల్ల “ఆత్మా వా అరే ద్రష్టవ్య శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః" అని ఉపాస్యంగా యాజ్ఞవల్క్యునిచే చెప్పబడిన జీవవాచియైన ఆత్మశబ్దం, విజ్ఞానఘనశబ్దం “అవస్థితే రితి కాశకృత్స్నః" (ఆత్మలోపల ఉండేవాడైనందున పరమాత్మను తెలుపుతుంది అని కాశకృత్స్నులు చెప్పారు) అనే విధంగా అంతర్యామియైన పరమాత్మను తెల్పుతున్నదని శ్రీభాష్యకారులచే వ్యాక్యాన్వయాధికరణంలో నిర్ధారితమైన అర్థం చెప్పబడింది. “అమేయమ్” అని అన్నందున “యేనేదం సర్వం విజానామి తం కేన విజానీయాత్" (ఎవని వల్ల దీనిని అంతటినీ నేను తెలుసుకుంటున్నానో, అతడు దీని చేత తెలియపడుతున్నాడు?) అనే శ్రుతికి “పరమపురుష ప్రసాదాదృతే కేన విజానీయాత్, న కేనాపీతి" (పరమ పురుషుని

అనుగ్రహం చేతనే తెలుసుకుంటున్నాడు, ఇక దానికంటే వేరైన దేనిచేత తెలుసుకోవడం లేదు) అని నిర్ణయింపబడిన దురవగమత్వం చెప్పబడింది. అమృతపదం ద్వారా 'అమృతత్వస్య తు నాశాస్తి" (మోక్షాన్ని ధనంచేత పొందదలచడం కూడా కుదరదు)అనే అమృతపదం సూచింపబడడమే కాక, "న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి ఆత్మన స్తు కామాయ" (ప్రతి కోరిక కోసం పతి ప్రియుడు అవడం లేదు, ఆత్మ కోరిక కోసం ప్రతి ప్రియుడు అయినాడు) అనేచోట ఉపాయభూతుడైన పరమాత్మకు నిరతిశయప్రియత్వంలో తాత్పర్యమని తెలుపబడిన అర్థం చెప్పబడింది. ఏకశబ్దంద్వారా "పత్యాదిప్రియం సర్వం పరిత్యాజ్య"మని(భార్య మొదలైన ఇష్టమైనవారు అందరూ విడువదగినవారు) చెప్పబడిన అర్థం సూచితం. "కృష్ణాఖ్యమ్" అని అన్నందున లింగభూయస్త్వాధికరణంలో నిర్ధారితమైన ఉపాస్యవిశేషం చెప్పబడింది.

**(పీతం తత్)** - మీచే పానం చేయబడ్డ ఆ అమృతం,

**(పరమౌషధం సత్ ఆత్యంతికం నిర్వాణం వితనుతే)** ఉత్తమౌషధమై, సంసారవ్యాధిని నశింపజేసి, మోక్షానందాన్ని కల్గిస్తుంది—అని భావం.

## 18. హే మర్త్యా:! పరమం హిత శృణుత వో వక్ష్యామి సంక్షేపత:
## సంసారార్ణవ మాపదూర్మి బహుళం సమ్యక్ ప్రవిశ్య స్థితా:!
## నానాజ్ఞాన మపాస్య చేతసి నమో నారాయణాయే త్యముం
## మంత్రం సప్రణవం ప్రణామసహితం ప్రావర్తయధ్వం ముహు:!!

ఆపత్ = ఇడుమలు అనే, ఊర్మి = అలలచేత, బహుళం = గొప్పదైన, సంసార + ఆర్ణవం = సంసారమనే సముద్రమును, సమ్యక్ = లెస్సగా, ప్రవిశ్య = ప్రవేశించి, స్థితాః = నిలుకడగా ఉండే, హే మర్త్యాః = ఓ మనుష్యులారా, వః = మీకు, పరమం హితం = మిక్కిలి మేలు కలిగే సంగతిని, సంక్షేపతః = సంగ్రహముగా, వక్ష్యామి = చెప్పబోవుచున్నాను, శృణుత = వినుడు, నానాజ్ఞానం

= సకల విధములైన అజ్ఞానములను, అపాస్య = విడిచిపెట్టి, సప్రణవం = ఓంకారరూప ముఖ్యప్రణవములతో గాని, అంకారరూప గౌణప్రణవములతోగాని కూడినదియు, ప్రణామ సహితం = నమస్కారములతో కూడినది అయిన, నమో నారాయణాయ + ఇతి = నమో నారాయణాయ అను, అముం మంత్రం = ఈ మంత్రమును, చేతసి = మనసునందు, ముహుః = పలుమారు, ప్రావర్తయధ్వం = జపము చేయండి

అవ : ఈ విధంగా గడచిన శ్లోకంలో "కృష్ణాఖ్య మాపీయతామ్" అని అనగా, దీనిని విన్న మాత్రంలో పాపాలు తీరినవారైన జనులు కించిత్తు ఆభిముఖ్యాన్ని చూపారు. , తిరిగి దార్ఢ్యం కోసం ఇపుడు మూలమంత్రోపదేశాన్ని చేస్తున్నారు. నమ్మాళ్వార్లు కూడా

"ఎణ్ణుమ్ తిరునామమ్ తిణ్ణమ్ నారణమే"
(ధ్యానం చేయదగిన తిరునామం నారాయణ నామమే అనేది నిశ్చయం),

"వణ్ పుకழ் నారణన్ తిణ్ కழల్ శేరే"
(ఉదారమైన కళ్యాణ గుణాలను కల శ్రీమన్నారాయణని దృఢమైన పాదాలను చేరండి) అని మూలమంత్రావయవమైన నారాయణపదోపదేశాన్ని చేశారు. తిరుమంగై ఆళ్వార్లు కూడా "అన్దణర్ మాట్టన్దివైత్త మన్దిరత్తై" అని తన మనస్సును ఉద్దేశించి మూలమత్రానుసంధానం చేశారు.

వ్యాఖ్య : **(హే మర్త్యా ఇతి) (ఆపదూర్మిబహుళమ్ సంసారార్ణవమ్)** - సముద్రంలో అలలు పైపైకి ఎగసి పడేటట్లు, సంసారంలో కూడా ఆపదలు పై పైకి ఎగసి పడతాయి- అని భావం. ఇంతేకాక, అలలు ఒకటి, రెండు కాకుండా అసంఖ్యేయంగా నిరంతరంగా ఉన్నట్లే, సంసారంలో ఆపదలు కూడా అనేకంగా, నిరంతరంగా ఉంటాయి.

**(సమ్యక్ ప్రవిశ్య స్థితా:)** - స్వయంగా సముద్రంలో దిగేవారివలె, స్వయంగానే సంసారంలో ప్రవేశించినవారై ఉన్నారు. ఏ నాడూ తీరాన్ని చేరడానికి తగిన ఉపాయమేదీ లేని రీతిలో సముద్రంలో నడుమ మునిగిపోయేవారివలె, సంసారంలో లోపల ము పోయి ఉన్నారని భావం.

**(హే మర్త్యాః!)** - జ్ఞానహీనాలైన తిర్యక్కులవలె కాకుండా, అజ్ఞానాన్ని కల మానవజన్మలో పుట్టినవారలారా! అని భావం.

**(పరమం హితమ్)** - స్వర్గాదిసాధనాలైన యజ్ఞాదులు, తత్తన్మంత్రాలు హితాలైనా, అవి తత్ కాలంలో ఆభాససుఖాన్ని ఇచ్చి, సంసారాన్ని వృద్ధిచేస్తాయి. అందువల్ల అవి పరమహితాలు కావు. "ప్లవా హ్యేతే అదృఢాః యజ్ఞరూపాః" (యజ్ఞాల రూపంలో ఉండే ఇవి అన్నీ బలహీనమైన తెప్పల వంటివి) అని కదా చెప్పబడుతున్నది.

**(వః)** - ఆ పరమహితాన్ని విస్తరంగా వినడానికి తగిన బుద్ధికౌశలాన్ని లేని మీకు,

**(సంక్షేపేణ వక్ష్యామి, శ్రుణుత)** - సంగ్రహంగా పల్కుతాను, అనాదరించకుండా సావధానంగా ఆలకించండి— అని అర్థం.

**(నానాజ్ఞాన మపాస్య)** - నానావిధాలైన జ్ఞానాలను విడచిపెట్టి - అని అర్థం. కొందఱు తత్త్వమసీతి వాక్యజన్యజ్ఞానం మోక్షకారణమని అంటారు. కొందఱు "భగాసనస్థ మాత్మానం ధ్యాత్వా నిర్వాణ మృచ్ఛతి" (భగాన్ని ఆశానంగా కలిగిన ఆత్మను ధ్యానించి, ఆనందాన్ని పొందుతున్నాడు)అని అంటారు. ఏది వాస్తవమో? అనే వివిధజ్ఞానాలను వీడి - అని అర్థం. లేక, "శాస్త్రజ్ఞానం బహుక్లేశం బుద్ధే శ్చలనకారణమ్" (శాస్త్రజ్ఞానం సంపాదించడం చాలా కష్టం, అది బుద్ధిని చలింపజేస్తుంది) అని వివరంగా అభ్యసించడానికి తగిన నానాశాస్త్రాలను వీడి- అనికూడా అర్థం.

**(నమో నారాయణాయేత్యముం మంత్రమ్)** - “నాడు నకరముమ్ నన్గఱియ నమో నారాయణాయ” (గ్రామాలు, నగరాలు బాగా తెలిసేటట్లు "నమో నారాయణాయ" అనే మంత్రాన్ని పలుకుదాం, ),

“నల్ వకైయాల్ నమో నారాయణా"
(మంచి రీతిలో "నమో నారాయణాయ" అనే మంత్రాన్ని పలుకుదాం),

“నిన్ తిరువెట్టెழுత్తుమ్ కఱ్ఱు”
(నీ అష్టాక్షరీ మహామంత్రాన్ని అభ్యసించి),

“బహవో హి మహాత్మానో మునయ స్సనకాదయః,
అష్టాక్షరం సమాశ్రిత్య తే జగ్ము ర్వైష్ణవం పదమ్,
హే పుత్రశిష్యాః! శ్రుణుత న మంత్రోఽష్టాక్షరాత్ పరః"

(సనకుడు మొదలైన మహాత్ములైన మునులు చాలామంది అష్టాక్షరీ మహా మంత్రాన్ని ఆశ్రయించి పరమపదాన్ని పొందారు. అందువల్ల, ఓ పుత్రులారా !శిష్యులారా! వినండి. అష్టాక్షరీ మహా మంత్రం కంటే గొప్పది లేదు)

ఇత్యాదులలతో కీర్తింపబడిన ఈ మూలమంత్రాన్ని,

**(సప్రవణమ్)** - ప్రణవంతో కూడినదిగా,

**(చేతసి ముహుః ప్రణామసహితం ప్రావర్తయధ్వమ్)** - ప్రణామంతో కూడ మనస్సులో ఆవర్తనం చేయండి. సప్రణవమైన ఈ మూలమంత్రాన్ని సాష్టాంగప్రణామం చేసి, మనస్సులో

సదా ధ్యానించండి. ఇదే మీకు పరమహితం. "ఓమ్ నమోనారాయణాయేత్యముం మంత్రమ్" అని చేర్చి పలుకకుండా "మంత్రం సప్రణవ"మని ప్రత్యేకంగా పల్కినందున, ప్రణవ శూన్యమైనా మంత్రత్వమున్నది, త్రైవర్ణికులు ప్రణవంతో పలకాలి. స్త్రీశూద్రాదులు తత్ ప్రతిచ్ఛందాక్షరంతో చెప్పాలనేది సూచితం.

**19. పృధ్వీ రేణు రణు: పయాంసి కణికా: ఫల్గుస్ఫులింగోఽ నల:**
**తేజో ని:శ్వసనం మరుత్ తనుతరం రంధ్రం సుసూక్ష్మం నభ:।**
**క్షుద్రా రుద్రపితామహ ప్రభృతయ:కీటా స్సమస్తా స్సురా:**
**దృష్టే యత్ర స తావకో విజయతే భూమావధూతావధి:॥**

యత్ర = ఏ నీ మహిమ, దృష్టే సతి = చూడబడినదగుచుండగా, పృధ్వీ = భూమి, అణుః = సూక్ష్మమయిన, రేణుః = ధూళియో, పయాంసి = సముద్రజలములు, కణికాః = నీటి తుంపరలో, ఆలఘుః = గొప్పదైన, తేజః = సూర్యచంద్రాగ్నుల వెలుగు, ఫల్గుః = చిన్నదగు, స్ఫులింగః = మిణుగురో, మరుత్ = గాలి, తనుతరం = మిక్కిలి సన్నదైన, నిశ్శ్వసనం = నిట్టూర్పు, నభః = ఆకాశము, సుసూక్ష్మం = మిక్కిలి సన్నని, రంధ్రం = బెజ్జమో, రుద్ర = ఈశ్వరుడు, పితామహ = బ్రహ్మ దేవుడు, ప్రభృతయః = మొదలుగ కలవారైన, సమస్తాః సురాః = దేవతలందరూ, క్షుద్రాః = చిన్న, కీటాః = పురుగులో, సః = అటువంటి, తావకః = నీదైనట్టి, ఆవధూతావధిః = అంతము లేనట్టి, భూమా = మహిమ, విజయతే = అంతటా వ్యాపించి సర్వోత్కర్షతో విరాజిల్లుచున్నది.

**అవతారిక :**

ఓ ఆళ్వార్లూ! లోకానికి "మద్విషయక మంత్రోచ్చారణపూర్వకంగా నా ఉపాసనం చేయండి, సంసారరూపవ్యాధి తీరుతుంది" అని గడచిన రెండు శ్లోకాలలో మీరు పలికారు. అటువంటి మహిమ నాకున్నదా? ఏమి! లోకంలో మాహాత్మ్యాన్ని కల వస్తువులు అనేకం

ఉన్నాయి కదా! ” అని ముకుందుడనగా, సూర్యుని చూడనపుడు ఖద్యోతపోతం (మిణుగురు పురుగుపిల్ల) గొప్ప ప్రకాశాన్ని కల్గినదిగా తోచినా, సూర్యుని చూడగానే ఆ ఖద్యోతం చాలా తక్కువగా తోస్తుంది. ఆ రీతిలోనే, నీ మహిమ తెలియడానికి ముందు ఇతర వస్తువులు మాహాత్మ్యాన్ని కల్గినదిగా తోచినా, నీ దర్శనానికి తరువాత ఇతర పదార్థాలు అత్యల్పంగా తోస్తాయి- అనే అభిప్రాయంతో ఈ శ్లోకాన్ని పల్కుతున్నారు.

**వ్యాఖ్య : (పృథ్వేతి) - (హే ముకుంద) (యత దృష్టే)** - నీ మహిమ దర్శింపబడినది అయినపుడు,

**(పృథ్వీ అణుః రేణు:)** - భూమి పంచాశత్ కోటివిస్తీర్ణాన్ని కల్గి ఉండడమనే గొప్పతనం ఉన్నా, అత్యల్పమైన రేణువుగా కన్పిస్తున్నది. భూమి రేణువుగా కన్పించినా, అపకృష్టమహత్వాశ్రయమైన రేణువువలె కన్పించకుండా పరమాణురేణువుగా కన్పిస్తున్నదని భావం. అయినా, "అద్భ్యః పృథివీ" అని పృథివికి కూడా కారణమైనందున, జలానికి మాహాత్మ్యం లేదా మఱి? అంటే, లోకంలో జలం అంతా, ఇతనిని చూచినపుడు అత్యల్పకణికగా కన్పిస్తున్నది- అని అంటున్నారు. బహువచనంవల్ల ఆవరణసప్తకాంతర్గతజలాదులైన పయస్సులన్నీ కలసి ఒకటిగా చేరినా, అత్యల్పకణికగా కన్పిస్తున్నది- అని సూచింపబడింది.

**(తేజః)** - "అగ్నేరాపః" (అగ్ని వల్ల జలం పుట్టింది) అని జలానికి కారణంగా బృహత్తు అయిన తేజస్సు కూడా,

**(లఘుః ఫల్గుః స్ఫులింగః)** గురువుగా లేకుండా ఉండే అల్పమైన స్ఫులింగంగా కన్పిస్తున్నది. చిన్న అగ్నికణానికి స్ఫులింగమని పేరు. పాషాణంయొక్క అణుభాగానికి గురుత్వమున్నది. పత్తియొక్క అణువుకు గురుత్వం లేదు.

**(తేజః)** - ఇది జాత్యేకవచనం. సర్వతేజస్సు లఘువైన పత్తిపింజవలె గౌరవం లేని అత్యల్పమైన స్ఫులింగంగా కన్పడుతున్నది. లఘుపదం గురుత్వానాశ్రయపరం, పల్గుపదం అల్పత్వార్థకం.

**(మరుత్)** - "వాయోరగ్నిః" (వాయువు వల్ల అగ్ని పుట్టింది) అని అగ్నికి కూడా కారణమైనందున బృహత్తు అయిన గాలికూడా,

**(అణుతరం నిఃశ్వసనమ్)** - గతిసూక్ష్మమైన నిఃశ్వాసంగా తోస్తున్నది.

**(నభః)** - "ఆకాశాత్ వాయుః" (ఆకాశము నుండి వాయువు పుట్టింది) అని వాయువుకు కూడా కారణంగా, పెద్దదైన ఆకాశంకూడా.

**(సుసూక్ష్మం రంధ్రమ్)** - చీమల రంధ్రంవలె, అతిసూక్ష్మమైన రంధ్రంవలె ఉన్నది. "జ్యాయాన్ పృథివ్యాః జ్యాయాన్ అంతరిక్షాత్" (పృథ్వి కంటే పెద్దది, అంతరిక్షం కంటే పెద్దది) అని పంచభూతాలలో ఆద్యంతాలను పల్కినందున, నడుమలో ఉండే మూడిటికి ఉపలక్షణమనే అర్థం ఇక్కడ వ్యక్తమైనది. ఇక్కడ పంచభూతాలను ప్రస్తావించడం కూడా ప్రకృతి మహదహంకారాదులకు కూడా ఉపలక్షణం. "తథా చ పృథివ్యాది మూలప్రకృత్యంతానా మచేతనానాం భగవతోఽపేక్షయా మాహాత్మ్యవిషయ అల్పత్వ ముక్తం భవతి". (అందుచేత, పృథావి మొదలైనవాటినుండి మూలప్రకృతి వరకు ఉండే అచేతనాలు అన్ని భగవంతునితో పోలిస్తే చాలా తక్కువ మహిమ కలిగినవి అని చెప్పబడినట్లు అయినది). అచేతనానికి మాహాత్మ్యం లేకపోయినా, "అక్షరాత్ పరతః పరః" (అక్షరశబ్దంచేత చెప్పబడే ప్రకృతి కంటే జీవతత్వం గొప్పది) అని అక్షరశబ్దవాచ్యమైన ప్రకృతి కంటే పరమని ప్రసిద్ధమైన చేతనవర్గానికి మాహాత్మ్యం లేదా? అంటే, బదులు పల్కుతున్నారు.

**(రుద్రా ఇత్యాది)** - సంసారకర్తగా, సృష్టికర్తగా ప్రసిద్ధులైన రుద్రచతుర్ముఖాదులైన సమస్తదేవతలు క్షుద్రకీటాలుగా కన్పిస్తున్నారు. ఉత్తమవజ్రకీటాలవలె కాక, గోమయాద్యుత్పన్నమైన అతినీచకీటాలని అర్థం. ఈ విధంగా బ్రహ్మాదిదేవతలకు కూడా అతినీచత్వం కైముతికన్యాయంద్వారా సిద్ధమని భావం. ఈ విధంగా భూమావిషయంలో చేతనాచేతన వస్తువులన్నీ అల్పమైనా, అతని భూమికు అవధి ఉన్నదా? అని అంటే, అదికూడా లేదు– అని పల్కుతున్నారు.

**(అవధూతావధి:)** - అవధి లేనివాడని భావం.

**(తావకస్య భూమా విజయతే)** - నీకు చెందిన ఆ మాహాత్మ్యం నిన్ను ప్రతిపాదించే మూలమంత్రానికి విశేషమహిమ ఉన్నదని లోకానికి తెలియజేశానని అంటున్నారని భావం. ఈ శ్లోకం ద్వారా "యత్రాన్యత్పశ్యతి, అన్యచ్ఛృణోతి అన్యద్విజానాతి తదల్ప" (దేనిని చూసిన తరువాత ఇంకొక దానిని చూస్తున్నాడో, ఇంకొక దానిని వింటున్నాడో, ఇంకొకదానిని తెలుసుకుంటున్నాడో, అది ఆల్పం) మనే శ్రుత్యర్థం వివరింపబడింది.

**20. బద్ధేనాంజలినా నతేన శిరసా గాత్రైః స్సరోమోద్గమైః**
**కంఠేన స్వరగద్గదేన నయనేనోద్గీర్ణ బాష్పాంబునా।**
**నిత్యం త్వచ్చరణారవింద యుగళధ్యానామృతాస్వాదినామ్**
**అస్మాకం సరసీరుహాక్ష! సతతం సంపద్యతాం జీవితమ్॥**

సరసీరుహాక్ష = ఓ కమలములవంటి కన్నులు గలవాడా!, బద్ధేన = కట్టబడిన, అంజలినా = అంజలిచేతను, నతేన = వంచబడిన, శిరసా = శిరస్సు చేతను, స రోమోద్గమైః = గగుర్పాటుతో కూడిన, గాత్రైః = కరచరణాది అవయవమల చేత, స్వరగద్గదేన = గొంతు చప్పుడుచేత కుతుకు పడుచుండు, కంఠేన = కంఠముచేతను, ఉద్గీర్ణ =బయటికి వచ్చుచుండు, బాష్పాంబునా = కన్నీరు గల, నయనేన = నేత్రముల చేతను, నిత్యం = ఎల్లప్పుడు, త్వత్ =

నీయొక్క, చరణారవింద = కమలములవంటి పాదములయొక్క, యుగళ = జంటయొక్క, ధ్యాన = చింతను సేయుటయును, అమృత = అమృతమును, ఆస్వాదినాం = పానం చేయునట్టి, అస్మాకం = మాకు, సతతం = ఎల్లప్పుడు, జీవితం = జీవనము, సంపద్యతాం = గడచిపోవునుగాక!

అవ : ఈ విధంగా, "మూలమంత్రానుసంధానపూర్వకంగా ముకుందానుభవాన్ని పొందండి"- అని వీరు లోకంలోనివారికి ఉపదేశించగానే, లోకంలోనివారికి కూడా వీరి ఉపదేశంవల్ల భగవద్భక్తి అతిశయించి, తమవలె,

“ఆహ్లాదశీతనేత్రాంబు: పులకీకృతగాత్రవాన్,
సదా పరగుణావిష్టో ద్రష్టవ్యః సర్వదేహిభిః”

(ఆనందంతో చల్లని కన్నీటి భాష్పాలను కలవాడు, రోమాంచం కలిగిన శరీరాన్ని కలవాడు, ఎల్లప్పుడూ భగవంతుని కల్యాణ గుణాలలోనే ఆసక్తిని కలవాడు అయిన మహాత్ముడు జీవులందరికీ ఎల్లప్పుడు దర్శించదగినవాడు)

అనేవిధంగా రోమాంచాదులతో ముకుందచరణారవిందాస్వాదనం పొందగా, వారిని చూచి, హృష్టులై, “వీరి అనుభవానికి, తమ అనుభవానికి “శ్రేయాంసి బహువిఘ్నాని” (మంచి కార్యాలకు చాలా ఆటంకాలు ఉంటాయి) అని ఏమి విఘ్నం వస్తుందో! ” అని శంకించి, "ఈ రీతిలోనే మా జీవితం సదా సంపన్నంగా ఉండేటట్లు నీవు కటాక్షించాలి" అని లోకంలోనివారిని తమతో కలుపుకొని ఇందులో ప్రార్థిస్తున్నారు. లేక, వీరి ఉపదేశంతో లోకంలోనివారికి భగవద్భక్తి తమకువలె అంకురించగానే, దానిని చూచి, అంకురితమైన ఈ భక్తియే ఉత్తమకాష్ఠను పొంది, స్వరనేత్రాంగవిక్రియాదులతో సర్వకాలం భగవచ్చరణానుభవపరులుగా ఉజ్జీవించేటట్లు వీరిని కటాక్షించాలనే భావంతో ఈ శ్లోకాన్ని పల్కుతున్నారు.

వ్యాఖ్య : **(బద్ధేనేతి)** దీనికి “ధ్యానామృతాస్వాదినామ్" అనే పదంతో అన్వయం. తరువాత కూడా ఈ విధంగానే గమనించాలి.

“ఆయాంత్యా పరిదుర్మనాయిత మివ త్వాం వీక్ష్య బద్ధ స్తయా
కాతర్యాదరవిందకుట్మలనిభో ముగ్ధః ప్రణమోంజలి:"

అని అరవిందకుట్మలంవలె బద్ధమైన అంజలితో- అని అర్థం. ఆ విధంగా ఉంటేనే ముగ్ధమై ఉంటుంది. ఇటువంటి అంజలియే అపరాధ నివర్తకమవుతుందని భావం.

“తాన్యంజలిసహస్రాణి ప్రగృహీతాని నాగరైః,
ఆకోశానీవ పద్మాని దదర్శ భరతాగ్రజః"

(నగరంలోని జనులచేత చేయబడిన వేలాది అంజలులను భరతుడు తామర పువ్వుల మొక్కలవలె చూశాడు) అని అంజలికి పద్మకుట్మలసన్నిభత్వాన్ని, ఈ అంజలియే శ్రీరాముడు కన్నెత్తి చూచాడని వాల్మీకి భగవానుడు పలికాడు. “బద్ధేన” అనేదానికి ఏతావత్పర్యంతమైన అర్థం చెప్పకపోతే అది నిష్ప్రయోజనమే కాగలదు. చేతులను విడదీయకుండా ముకుళంవలె మూసిన అంజలి "నేను ప్రయోజనాంతరాన్ని ఆశపడడం లేదు" అనే అర్థాన్ని సూచింపజేస్తూ “అంజలిః పరమా ముద్రా క్షిప్రం దేవప్రసాదినీ" (అంజలి అనేది చాలా గొప్ప ముద్ర. భగవంతుని వేగంగా అనుగ్రహించేటట్లు చేస్తుంది) అనే విధంగా భగవదనుగ్రహాన్ని కల్గిస్తుంది. “స చ మమ ప్రియః" (అతడు అయితే నాకు ఇష్టమైనవాడు) " తే అతీవ దయితా మమ"(వారు నాకు చాలా ఇష్టమైన వారు) అని ప్రయోజనాంతరాన్ని ఆశ పడనివాడు తనకు మిక్కిలి ఇష్టమైనవాడని సర్వేశ్వరుడే స్వయంగా పలికాడు.

**(నతేన శిరసా)** – “త్వం మే” అని పల్కినా, “అహం మే” అని మదించి పల్కి, “న నమేయం కథంచన” (ఏ విధంగానూ నేను నమస్కరించను) అనే ముందున్న స్థితి పోయి, “ఆరావముదే! ” అంటే “అడియేన్” క్రిందకు వాలేటట్లే, త్వచ్చరణారవిందామృతాన్ని చూడగానే పాంసుదిగ్ధలలాటాన్ని కలవాడయేటట్లు నమస్కరించిన తలతో- అని భావం. ఇందువల్ల- "నీ రక్షకత్వానికి నీవే బాధ్యుడవు”అని నా తలపై భారాన్ని పెట్టకుండా, అత్యంతాశక్తుడనైన నేను ఆ భారాన్ని మోయలేనని తలను కింద వాల్చిన స్థితి సూచింపబడుతున్నది.

**(సరోమోద్గమైః గాత్రైః)** - పులకితాలైన అవయవాలతో- అని భావం. కాంతానుభవంవల్ల కలిగే పులకలు పోయి, భగవదనుభవంవల్ల అంగాలలో పులకలు కలగాలి- అని భావం.

**(స్వరగద్గదేన)** - “స్వరః గద్గదః యస్మిన్ సః" -ఆనందాతిశయంవల్ల స్తుతించడం ఆరంభించిన కంఠంలో స్వరం గద్గదమవుతుందని భావం. “హర్షగద్గదయా గిరా” ఆనందంవల్ల గద్గదమైన మాటలతో) అని వాల్మీకి భగవాన్ పల్కినదానినిబట్టి ఇక్కడ ఈ విగ్రహవాక్యం స్వీకరింపబడింది.

**(కంఠేన)** - కంఠంతో,

**(ఉద్గీర్ణబాష్పాంబునా నయనేన)** - బయటకు వచ్చిన (పెల్లుబికిన) ఆనందబాష్పాలను కల కన్నులతో,

**(నిత్యం)** - ప్రతిదినం,

**(త్వచ్చరణారవిందయుగళధ్యానామృతాస్వాదినామ్)** - దేవరవారి శ్రీచరణాలలోని ధ్యానం - అమృతంవలె భోగ్యమై ఉన్నదని భావం. ధ్యానం భోగ్యమైనపుడు ఆ ధ్యానానికి

విషయమైన చరణాలకు కూడా భోగ్యత్వం అర్థాత్ సిద్ధం. "ధ్యానస్య భోగ్యత్వే, విషయభూతచరణస్యాపి భోగ్యత్వ మర్థాత్ సిద్ధమ్"(ధ్యానానికి భోగ్యత్వం ఉన్నప్పుడు, ఆ ధ్యానానికి విషయంగా ఉండే చరణానికి కూడా బోగ్యత్వం అర్థం ద్వారా సిద్ధిస్తుంది). ధ్యానవిషయానికి భోగ్యత లేకపోతే, దాని ధ్యానానికి భోగ్యత్వం రాదుకదా! "సర్వస్యాప్రియత్వాదేవ హి తత్ జ్ఞానస్యాప్రియత్వమ్" (సర్పం అప్రియం కనుకనే దాని జ్ఞానం కూడా అప్రియమై ఉంటుంది). ఇంతేకాక, అరవిందదృష్టాంతంవల్ల భోగ్యత్వం సిద్ధం. "సర్వరసః" (భగవంతుడు సర్వరసస్వరూపుడు) అని సర్వావయవాలు రస్యమై ఉన్నా, భోగ్యతావిషయంలో అమృతానికి మించిన వస్తువు ఇంకొకటి లేనందున, ధ్యానాన్ని అమృతంగా చెప్పడం జరిగింది. శ్రీచరణాల ధ్యానాన్ని గమనించి చూస్తే అమృతం కూడా చేదుగా తోస్తుంది కదా! తల్లికి అనేక అంశాలున్నా, బిడ్డలకు స్తనయుగళంలో దృష్టిపడేటట్లే, భగవంతుని ధ్యానించేవారికి స్వామి శ్రీచరణాలలోనే దృష్టిపడుతుంది.

**(అస్మాకమ్)** - తమ ఉపదేశంలో భక్తి కల్గినవారైన లోకులనుకూడా చేర్చి "అస్మాకమ్" అనే బహువచనాన్ని ప్రయోగించారు.

**(సరసీరుహాక్ష!)** - శ్రీపాదాలపై పడినవానిని "లోచనాభ్యాం పిబన్నివ" (కళ్ళతో తాగుతున్నట్లుగా) అనే రీతిలో ఉండే తామరలవంటి కన్నులలో "ఉన్ తామరై క్కణ్గళాల్ నోక్కాయ్" (తామర పూలవంటి నీ కన్నులతో కటాక్షించు) అనే విధంగా చల్లగా కటాక్షించాలని అర్థం.

**(సతతం జీవితం సంపద్యతామ్)** ఈషత్తు అంకురించిన భక్తి విచ్ఛిన్నమై, విషయపరవశుడను కాకుండా, ప్రతిదినం సర్వకాలాలలో ఆహ్లాదశీతనేత్రాంబు గద్గదస్వరగాత్ర పులకాదులతోకూడ నీ చరణారవింద యుగళ ధ్యానామృతాస్వాదాన్ని చేసేవారమై మా జీవితం సఫలం కావాలి. మా ఆయుస్సు పూర్ణంగా ఇదే రీతిలో జరగాలి. అదే మాకు రక్షణం- అని ప్రార్థిస్తున్నారని శ్లోకపరమతాత్పర్యం.

**21. హే గోపాలక! హే కృపాజలనిధే! హే సింధుకన్యాపతే!**
**హే కంసాంతక !హే గజేంద్రకరుణాపారీణ! హే మాధవ! ।**
**హే రామానుజ! హే జగత్త్రయ గురో !హే పుండరీకాక్ష !మాం**
**హే గోపీజననాథ !పాలయ పరం జానామి న త్వాం వినా॥**

హే గోపాలక = ఓ పశువులను పాలించువాడా (గోశబ్దమునకు భూమి అని కూడా అర్థం), హే కృపాజలనిధే = దయకు సముద్రము అయినవాడా, హే సింధుకన్యాపతే = సముద్రుని కూతురగు లక్ష్మీ దేవికి ప్రియుడా, హే కంసాంతక = ఓ కంసుని సంహరించిన కృష్ణమూర్తీ, హే గజేంద్రకరుణా పారీణ= గజేంద్రునియొక్క దుఃఖమును పోగొట్టి దరిజేర్చిన వాడా, హే మాధవ = ఓ లక్ష్మీ వల్లభుడా, హే రామానుజ = ఓ బలరాముని తమ్ముడా, హే జగత్రయగురో = ఓ ముల్లోకములను ఏలువాడా, హే పుండరీకాక్ష = ఓ తెల్లతామరల వంటి నేత్రములు కలవాడా, హే గోపీ జననాథ = ఓ గోపస్త్రీ ప్రియుడా, మాం = నన్ను (త్వం = నీవు), పాలయ = కాపాడుము, త్వాం వినా = నిన్ను తప్ప, పరం = ఇంకొకనిని (అహం = నేను), న జానామి = ఎఱుగను

అవ : పూర్వం, “మేము విషయాసక్తులుగా కాకుండా చరణారవిందానుభవంలో ఆసక్తులుగా ఉండాలి. ఇదే మా రక్షణం" అని అన్నారు కదా. నేను ఆవిధంగా ఎవరినైనా రక్షించానా ? నాకు అటువంటి గుణాలు ఉన్నాయా?” అనే భగవంతుడు అంటే, ఆళ్వార్లు, ఈశ్లోకంలో బదులు పల్కుతున్నారు.

వ్యాఖ్య : **(హే గోపాలకేతి) (హే గోపాలక)** - నీవు జ్ఞానం లేని గోవులను “ఇట్టమాన పశుక్కళై ఇనిదు మఱిన్దు నీరూట్టి" (నీకు ఇష్టమైన గోవులను సంతోషంతో మేపి నీటిని తాగించి) అని, "గో శ్చారయంతా” అనే విధంగా మేపి, నీరు తాగించి రక్షించలేదా! ఇంతే కాక, “మేయ్ నిరై కీழ் పుక మా పురళ" (మేసే గోవులు కిందకు జారి దొర్లిపోయేటట్లుగా) అని ఇంద్రుడు సప్తకాలమేఘాలను వర్షింపజేసి, గోపగోపీజనాన్ని బాధించగా, గోవర్ధనాన్ని

ఎత్తి రక్షించలేదా? "పాలయ" (రక్షించు) అని అనడం కూడా తెలియని గోవులను రక్షించిన నీవు "పాలయ" అని అర్థించే నన్ను రక్షించరాదా! అని భావం. "మిమ్ములను రక్షిస్తే నాకేమి ఫలం ?" అంటే "అవాప్తసమస్తకాముడైన నీకు నావల్ల అవాప్తవ్యమనేది ఒకటి ఉన్నదా? అది నావల్ల చేయడం సాధ్యమా? కేవలం కృపతోనే రక్షించాలి. కృపయే దేవరవారివద్ద నిండి ఉన్నది" - అని ఇక అంటున్నారు.

**(హే కృపాజలనిధే!)** - సముద్రం జలాలకు నిధి అయినట్లే, నీవు కృపాగుణానికి నిధియై ఉన్నావు- అని భావం. ఈ రెండు సంబోధనల ద్వారా రక్షణోపయుక్త గుణాలైన వాత్సల్య, కారుణ్యాలు చెప్పబడ్డాయి.

"అయినా, అనుభవించే రీతిలోని భోగ్యత్వాదులు నాకున్నాయా?" అంటే, సమాధానం ఇక పల్కుతున్నారు.

**(హే సింధుకన్యాపతే!)** - దీనికి భోగ్యత్వంలో తాత్పర్యం. అమృతమథన సమయంలో అమృతసాగరంలోని సారమే కన్యగా అవతరించింది. అని చెప్పబడినట్లున్నదై, అమృతశీకరాలంకృతయై, సర్వాభరణభూషితయై, యువతియైన లక్ష్మీదేవి "కా త్వా ముకుంద" అనే శ్లోకానుసారం నిన్నే సర్వాంశంలోను తనకు తగినవాడని తలచి, ఆశపడి, బ్రహ్మరుద్రేంద్రాది దేవతలంతా చూస్తూ ఉండే సమయంలోనే "యయౌ వక్షఃస్థలం హరేః" (లక్ష్మీదేవి హరి వక్షఃస్థలాన్ని చేరింది) అని నిన్ను ఆశ్రయించింది. అందువల్ల నీవు పరమభోగ్యభూతుడవు కదా! - అని భావం. క్షీరపరిపూర్ణస్తన అయిన తల్లి దగ్గరగా ఉన్నా, బిడ్డ ఆకలితో "అమ్మా" అని ఆక్రందించేటట్లే, పరమభోగ్యభూతుడవై నీవు సమీపంలోనే ఉన్నా. నేను అనుభవించలేక, నీ తిరునామాలను పల్కుతూ ఆక్రందిస్తున్నానే— అని తాత్పర్యం.

" నా అనుభవానికి విరోధులైన మీ పాపాలు తీరినపుడు కదా నన్ను అనుభవించవచ్చు" అని అనగా, “ఆశ్రితవిరోధి అయిన కంసుని నిరాకరించినట్లే, నా పాపాలను నీవే నాశం చేయరాదా ?"- అనే భావంతో ఇక పల్కుతున్నారు.

**(హే కంసాంతక!)** - కంసునకు మాతులత్వాదిసంబంధం ఉన్నా, అతడు సాధువిరోధి అయినందున, సాదుపరిత్రాణదీక్షితుడవైన నీవు అతనిని నిరసించావు. నాతో నీకు అటువంటి సంబంధం ఏమీ లేదు. ఇక నా పాపాలు ఎందుకు నాశం చేయకూడదు?- అని భావం. కేవలకృపతో గోవులను రక్షించేటట్లే, నన్ను నీవే రక్షించాలి- అని భావం.

"నేను దధిఘృత నవనీతాదిలోలుడను కనుక, గోవుల పాలనను చేశాను తప్ప, కేవలం కృపతో మాత్రం కాదు, మిమ్ములను రక్షిస్తే నాకేమి ఫలం?"అంటే, నీవు కరుణాసర్వస్వాన్ని గజేంద్రాళ్వాన్ విషయంలో చూపి, అతని విరోధి అయిన మొసలిని వధించడం ఎందుకోసం? ఆ రీతిలోనే నా పాపాలను కూడా నాశం చేసి ఎందుకు రక్షించకూడదు? అనే భావంతో పల్కుతున్నారు.

**(హే గజేంద్రకరుణాపారీణ!)** - గజేంద్రాళ్వాన్ విషయంలో కరుణాపారంగతుడవు నీవు. అతనిపట్ల సంపూర్ణకృపను చూపావు. “మూలమూలేతి ఖిన్నే” అని నక్రాక్రాంతుడైన గజేంద్రాళ్వాన్ “ఆదిమూలమా?” అని ఎలుగెత్తి పిలచినపుడు, ఇతర దేవతలంతా “నాహం నాహం న చాహమ్” (నేను కాదు, నేను కాదు, నేను కాదు) అని చేతులు ముడుచుకోగా, “ముదలైమేల్ శీఱి వన్దాయ్" (మొసలి పై కోపించి వచ్చావు) అని కోపించి వచ్చి,

“అతంత్రితచమూపతిప్రహిత మస్వీకృత
ప్రణీతమణిపాదుకం కిమితి చాకులాంతఃపురమ్,

అవాహనపరిష్క్రియం పతగరాజ మారోహతః
కరిప్రవరబృంహితే భగవతః స్వరాయై నమః”

(తనను రక్షించమని గజేంద్రుడు ఆక్రందించగానే, భగవంతుడు తన సేనకు అధ్యక్షుడైన విష్వక్సేనుని పిలువకుండానే, తీసికొని వచ్చిన మణిపాదుకలను ధరించకుండానే, అంతఃపురంలోని జనులంతా ఏమి జరిగింది? అని సంభ్రమం చెందుతూ ఉండగా, తనకు వాహనమైన గరుడునకు ఏ అలంకారం చేయకుండా, అతనిని ఎక్కి వేగంగా వచ్చే భగవంతుని తొందరకు నమస్కారం)అనే విధంగా

‘నారాయణాత్ జగత్ సర్వం సర్గకాలే ప్రజాయతే”

(సృష్టికాలంలో భగవంతుని నుండి ఈ లోకం అంతా పుడుతున్నది),

“అహం కృత్స్నస్య ప్రభవః” నేనే అన్నిటి ఉత్పత్తికి కారణం) అని సర్వకారణభూతుడవైన నీవు సేనాపతి యాళ్వాన్ చే కైదండ ఇవ్వబడినా, దానిని స్వీకరించకుండా, పాదుకలను ధరించకుండా, అంతఃపురస్త్రీలు ఏనాడు చూచి తెలియని రీతిలో “ఇదేమి సంభ్రమం! ” అని వ్యాకులాన్ని పొందేటట్లు, గరుడుని ఏ అలంకారం చేయకుండా ఆరోహించి, “ఆకర్షన్ ద్విజరాజ మప్యతిజవాత్" అని పక్షిరాజు వేగాన్ని కూడా చాలనందున, అతనిని లాగి ఎత్తి తన చేతిలో పెట్టుకొని, 'స్రగ్భూషాంబర మయథాయథం దధానః" (ఆభరణాలను, పూలమాలికలను, వస్త్రాలను తగని విధంగా ధరిస్తూ)అని వస్త్రాదులను సరిగా ధరించకుండా, జుట్టుముడి వీడేటట్లు, నడుమున వస్త్రం జారిపోయేటట్లు వేగంగా పయనించినా, "ధిఙ్మా మిత్యనుజగర్జ మాజగంధ" (గజేంద్రుని ఆక్రందన వినగానే, " ఛీ! నేను ఎంత ఆలస్యం చేశాను!" అని సిగ్గుపడుతూ భగవంతుడు వచ్చాడు)అని గజేంద్రాళ్వాన్ పిలిచిన తరువాత కదా రాగలిగాను, సహాయపడగలిగాను. ముందుగానే వచ్చి రక్షించలేకపోయానే! " అని కేశపడేటట్లుగా కదా, నీ కృపాతిశయం ఉన్నది.

గజేంద్రాళ్వాన్ గోవుల వలె నీకు పాలను ఇచ్చాడా? అతనిని రక్షించడానికి నీ కృప ఒక్కటి తప్ప ఏ ప్రయోజనం కన్పించదుకదా. ఆ రీతిలోనే నన్ను కూడా రక్షించకూడదా! - అని భావం.

గజేంద్రాళ్వాన్ ఒక మొసలిచే మాత్రమే ఆక్రమింపబడ్డాడు. నేను పంచేంద్రియాలనే అయిదు విధాలైన మొసళ్ళచేత ఆక్రమింపబడ్డాను. గజేంద్రుడు దేవమానంలో వేయి సంవత్సరాల కాలం పీడితుడై ఉండగా, పరమకృపాళువు అయినవాడు ఇంత కాలం నేను ఉపేక్షించవచ్చునా? అంటే, “గజ ఆకర్షతే తీరే గ్రాహ (నక్ర) ఆకర్షతే జలే" (ఏనుగు తీరానికి లాగుతున్నది, ముసలి నీటిలోనికి లాగుతున్నది) అని గజేంద్రాళ్వాన్ తన సామర్థ్యంతో మొసలిని జయిస్తానని భావించాడు కనుక, ఉపేక్షించాడని భావం. ఈ విధంగా ఎలుగెత్తి పిలిచినా, నీవు రక్షించనపుడు, నమ్మాళ్వార్లు “శిన్దై కలఙ్గ తిరుమాల్! ఎన్ఱళైప్పన్” (మనస్సులో కలత చెందగా శ్రియఃపతీ! అని నిన్ను పిలుస్తున్నాను) అని కలత చెందిన మనస్సుతో “మాధవ! ” అని ఎలుగెత్తి పిలుస్తున్నాను.

**(హే మాధవ!)** ఈ పదం“తిరుమాల్” అనేదానికి అర్థం. "తిరు = లక్ష్మీదేవి, మాల్ = పతి, లేక తిరు = లక్ష్మీదేవి విషయంలో, మాల్ = వ్యామోహాన్ని కలవాడు, మాల్ = వ్యామోహం. నీవు కాంతలపట్ల వ్యామోహాన్ని కలవాడవు. మహాకాముకుడవు, మగతనం లేనివాడవు అంటే, అది నీకు అవద్యాన్ని కల్గించేది కాదా! అని అర్థం. ఆ విధంగానే, నేనుకూడా “మాధవ! ” అంటాను. స్త్రీల పేరును పురస్కరించుకొని, "ఈమెకు భర్త"- అని అంటే, అది నీకు అగౌరవం కాదా! - అని భావం. లేక, తండ్రి కుపితుడైనపుడు, బిడ్డ తల్లిని ముందుంచుకొన్నట్లు “మాధవ” అని లక్ష్మీదేవిని పురస్కరించుకొన్న రీతి ఇది— అని చెప్పవచ్చు

**(హే రామానుజ!)** - “ఏష నారాయణః శ్రీమాన్! ” (పాలసముద్రాన్ని నివాస స్థానంగా కలిగిన ఈ శ్రీమన్నారాయణుడు నాగ పర్యంకాన్ని వదిలి మధురకు వచ్చాడు) అనే

విధంగా క్షీరాబ్ధిని విడచి, ఇక్కడకు వచ్చి, యదువంశంలో బలరామునకు తమ్ముడై పుట్టడం "పరిత్రాణాయ సాధూనామ్" (మంచివారిని రక్షించడం కోసం) ఇత్యాదిగా సాధుపరిత్రాణం చేయడానికే కాదు- అని భావం. రామానుజుడై పుట్టడం గీతోపదేశాన్ని చేసి, భూమిలో ఉండేవారికి మాత్రం అజ్ఞానాన్ని నివర్తింపజేశావు- అని అంత మాత్రమేకాదు. లోకత్రయంలోనివారికి జ్ఞానోపదేశం చేసి అజ్ఞానంధకారాన్ని నివృత్తి చేశావు- అని పల్కుతున్నారు.

**(హే జగత్త్రయగురో!)** - "గుశబ్ద స్త్వంధకార స్స్యాత్ రుశబ్ద స్తన్నివర్తకః" (గు అనే పదం చీకటిని తెలుపుతుంది, ర అనే పదం దానిని పోగొట్టేదానిని తెలుపుతుంది) అనే విధంగా లోకత్రయంలోనివారి అజ్ఞానాంధకారానికి నీవే నివర్తకుడవై ఉండగా, నా అజ్ఞానాంధకారాన్ని నిరసించి నన్ను రక్షించకూడదా! - అని తాత్పర్యం.

**(హే పుండరీకాక్ష!)** - నేను పరదేవత కాదు- అని చెప్పడానికి వీలున్నదా? పరతత్త్వవ్యంజకమైన పుండరీకాక్షత్వం కదా నీకు ఉన్నది! పుండరీకాక్షత్వం పరత్వవ్యంజకమనే విషయం శ్రుతప్రకాశికాదులలో గమనించవచ్చు. ఇది "పుండరీకమేవ మక్షిణీ" అనే శ్రుతిద్వారా ప్రసిద్ధం. ఇంతేకాక, ఇది సర్వజనాకర్షకమై ఉంటుంది.

"కరియవాకి పుడై పరన్దు మిళిర్ న్దు శెవ్వరియోడు
నీణ్డ అప్పెరియవాయ కణ్ గళ్ ఎన్నై ప్పేదమై శెయ్ దనవే"

(నల్లనివై బాగా విస్తరించి, మెరిసి, ఎర్రని రేఖలను కలిగినవై, దీర్ఘంగా ఉండే చాలా పెద్దవి అయిన ఆ శ్రీరంగనాథుని నేత్రాలు నన్ను ముగ్ధుని చేస్తున్నాయి) అని తిరుప్పాణ్ ఆళ్వార్లు వ్యామోహాన్ని పొందినది నేత్రసౌందర్యంలోనే. "ప్రహసితం ప్రియ ప్రేమవీక్షితం కుహక నో మనః క్షోభయంతి హి" (ప్రియుడా! నీ నీ చిరునవ్వు, ప్రేమతో చూచే నీ చూపులు, మోసగాడా! మా మనస్సును బాధపెడుతున్నాయి కదా) అని గోపిలకు ఇది

మనఃక్షోభకరమై ఉన్నది. పరత్వాదులతోపాటు సౌశీల్యాదులు కూడా ఇందులో గూడుకట్టుకొని ఉన్నాయి- అని ఇక పల్కుతున్నారు.

**(హే గోపీజననాథ!)** - పరత్వం, సౌశీల్యాదులు ఒకదాని కంటే ఒకటి అతిశయాన్ని కల్గించేవిగా ఉంటాయి. సౌశీల్యాదులు లేని పరత్వం, పరత్వం లేని సౌశీల్యాదులు నిష్ప్రయోజనాలు. "గోపీజననాథ! " అని అన్నందున కామాతరులై, గోపికాగీతతో ఆక్రందించిన గోపీజనులకు రాసక్రీడలో వారి భావం గ్రహించి సంశ్లేషించి, దానివల్ల నాయకుడైన రీతి చెప్పబడింది. ఇక్కడ “గోపీజన” అని స్త్రీలను మాత్రం చెప్పినందున రాసక్రీడలో నాయకుడైన రీతి చెప్పబడిందని వ్యాఖ్యానించిన రీతి ఇది. కాళియనిరసన గోవర్ధనోద్ధరణాదులను చేసినందున నాథుడైన రీతి గోగోపాలురకు సామాన్యం (సాధారణం కదా). ఈ విధంగా మహాగుణాలను కల నీవు.

**(మాం పాలయ)** - నీ తిరునామాలను పల్కి ఆక్రందించే నన్ను రక్షించు.

"నాకంటే పరుడైన వానిని ఆశ్రయించకూడదా! " అంటే,

**(త్వాం వినా పరం న జానామి)** - అని అంటున్నారు. నిన్ను తప్ప వేఱెవ్వరిని నేను పరునిగా భావించడం లేదు. సర్వజ్ఞుడవైన నీకు తెలిస్తే, "అతడు వీడు"- అని చెప్పుచూద్దాం- అని అంటున్నారు.

**22. భక్తాపాయభుజంగగారుడమణి: త్రైలోక్యరక్షామణి:**
**గోపీలోచన చాతకాంబుదమణిః సౌందర్యముద్రామణి:।**
**య: కాంతామణి రుక్మిణీ ఘన కుచ ద్వన్ద్వైకభూషామణి:**
**శ్రేయో దేవశిఖామణి ర్దిశతు నో గోపాలచూడామణి: ।।**

భక్త = భక్తులయొక్క, అపాయ = కష్టములు అనే, భుజంగ = సర్పములకు, గారుడమణిః = శ్రేష్ఠమైన గారుడమంత్రమును, త్రైలోక్య = ముల్లోకముల యొక్క, రక్షా = కాపాడుటయందు, మణిః = శ్రేష్ఠుడు, గోపీ = గోపికల యొక్క, లోచన = కన్నులను, చాతక = వానకోయిలలకు, అంబుదమణిః = కాలమేఘమైనవాడును, సౌందర్యముద్రామణిః = అంగమునకు దృఢమైన ముద్ర అయినవాడును, కాంతామణి = స్త్రీలలో ఉత్తమురాలైన, రుక్మిణీ = రుక్మిణీదేవియొక్క, ఘన = గొప్పవి అయిన, కుచద్వంద్వ =స్తనముల జంటకు, ఏక = ముఖ్యమైన, భూషామణిః = శ్రేష్ఠమైన ఆభరణప్రాయమైనవాడు, దేవశిఖామణిః = దేవతలకు శిరోభూషణమైనవాడు, గోపాలచూడామణిః = గొల్లలో శ్రేష్ఠుడును, యః = ఎవడో, సః = ఆ శ్రీకృష్ణుడు, శ్రేయః = సంపదను, నః = మాకు, దిశతు = ఇచ్చునుగాక!

**అవతారిక :**

ఈ విధంగా "జానామి న త్వాం వినా" అని ఆళ్వార్లు పల్కగా, స్వామి నిరుత్తరుడై నిలచాడు. "ఈ ముకుందుడే పరదేవత, సర్వానిష్టనివృత్తిపూర్వక సర్వఫలప్రదుడు"- అని నిశ్చయించి, ఫలాన్ని నేరుగా అర్థించవలసి ఉండగా, అతని సౌందర్యాది గుణాలను చూచి, పాపి అయిన నా దృష్టిదోషం వాటికి తగులుతుందేమో! - అని కలత చెంది ముఖాన్ని తిప్పుకొని, "శ్రేయో నో దిశతు" అని ప్రార్థిస్తున్నారు.

వ్యాఖ్య : **(భక్తేతి)** - **(భక్తాపాయభుజంగగారుడమణి:)** - గరుడపచ్చ సమీపంలో సర్పాలు నిలువలేక నశించిపోయేటట్లు, శ్రీకృష్ణసన్నిధానంలో దుఃఖాలు నిలువవు- అని భావం. లోకులు మణిమంత్రౌషధాదులు సర్పవిరోధులని పల్కడంకూడా గరుడమణిని ఉద్దేశించే.

“కృష్ణేతి మంగళం నామ యస్య వాచి ప్రవర్తతే,
తస్య నశ్యతి రాజేంద్ర! మహాపాతకకోటయః"

(కృష్ణ అనే మంగళ రూపమైన నామం ఎవని వాక్కులో ప్రవర్తిస్తుందో, రాజేంద్రా!, అతని కోట్లాది మహాపాపాలు నశిస్తాయి) అని భగవన్నామానికి మహాపాతకనాశకత్వమున్నది అంటే, భగవత్సన్నిధానానికి మహాదుఃఖనివర్తకత్వం ఉన్నదా? అని అడగాలా? దీనివల్ల ఉన్నదని వ్యంజితమైనది. ఈ విధంగా ఉండగా, నా దుఃఖాలు మాత్రం పోలేదే! అయ్యో! ఏమి నా పాపం! - అని భావం.

"నేను భక్తాపాయభుజంగ గారుడమణినే. మీకు అటువంటి భక్తి లేదా! " అంటే, "మూడు లోకాలలోని అందఱిని రక్షించినట్లుగా అయినా నన్ను రక్షించకూడదా! "అనే భావంతో ఇక పల్కుతున్నారు.

**(త్రైలోక్యరక్షామణిః)** - జగద్రక్షణకు ఒక రత్నం ఉంటే, అది ఆశ పడదగినదిగా, రంజకంగా, కొంగుకు ముడికట్టుకొనే విధంగా సులభంగా ఉండేటట్లే, ఇతడు కూడా ఆ విధంగా ఉన్నాడని భావం. ఒక మణిని మంత్రాభిమంత్రణం చేసి, పిశాచాది బాధానివర్తకంగా మెడలో కడితే, ఆ మణి ఆ విధమైన బాధలను తీర్చి, ఆరోగ్యాది శ్రేయస్సులను కల్గించేటట్లే, సర్వజీవలోకానికి ఏ హాని కలుగకుండా ఉండేటట్లు చేసి, శ్రేయస్సును స్వామి కల్గిస్తాడు.

"రక్షితా జీవలోకస్య స్వజనస్య చ రక్షితా"

(సమస్త జీవులను రక్షించేవాడు, తన పరిజనాన్ని రక్షించేవాడు) అని కదా చెప్పబడుతున్నది. “రక్షితా జీవలోకస్య" అనేదానిని సరిగా “త్రైలోక్యరక్షామణిః” అని, “స్వజనస్యచ రక్షితా” అనే దానికి సరిగా “భక్తాపాయ భుజంగగారుడమణిః" అని ఇక్కడ

పలికారు. పూర్వం విశేషణద్వయం ద్వారా సాధారణంగా చెప్పిన అర్థాన్ని ఇక విశేషించి పల్కుతున్నారు.

**(గోపిలోచనచాతకాంబుదమణిః)** - గోపికల నేత్రాలకు సామాన్యమేఘంవలె కాకుండా అంబుదశ్రేష్ఠమై ఉన్నాడు. సామాన్యమేఘం ఒకసారి వర్షించకుండా, ఉండవచ్చు. ఒకసారి స్వల్పంగా వర్షించవచ్చు. ఉత్తమాంబుదం నిరవధికంగా వర్షిస్తుంది. ఆ విధంగానే శ్రీకృష్ణుడు నిరవధికానందవర్షిగా ఉంటాడని భావం.

"చాతక స్త్రిచతురః పయః కణాన్ యాచతే జలధరం పిపాసయా,
సోఽపి పూరయతి విశ్వమంభసా హంత! హంత! మహతా ముదారతా"

(చాతక పక్షి, దాహం కారణంచేత, మూడు నాలుగు నీటి బిందువుల కోసం మేఘాన్ని ప్రార్థిస్తుంది. కానీ, ఆ మేఘం కూడా ఆ చాతకాపక్షికే కాక, లోకాన్ని అంతటినీ నీటితో నిండిస్తుంది. ఆహా! గొప్ప వారి ఔదార్యం ఎంత గొప్పదో కదా!)అని నాల్గు మూడు జలకణాలను యాచించే చాతక పక్షికోసం మేఘం జగత్తు అంతా వర్షించేటట్లే, "కళ్ళతో దర్శించడానికి రండి" అనేవిధంగా "జలరుహాననం చారు దర్శయ" (అందమైన, పద్మం వంటి నీముఖాన్ని మాకు చూపించు) అని ముఖారవిందాన్ని కన్నులారా దర్శించి ఆనందించేటట్లు చేయాలి- అని గోపికలు ప్రార్థించగా,

"దివౌకసాం సదారాణా మౌత్సుక్యనిభృతాత్మనామ్,
తతో దుందుభయో నేదుః నిపేతుః పుష్పవృష్టయః"

(చాలా ఆసక్తితో నిండిన మనస్సు కలిగినవారు, భార్యలతో కూడినవారైన దేవతలు అప్పుడు దుందుభులను మోగించారు, పుష్పవృష్టిని కురిపించారు)అని తమ స్త్రీలతో

కూడిన దేవతలు చూచి ఆనందించి, ఆ ఆనందపరీవాహంగా దుందుభుల వాద్యం మోగేటట్లుగా, పుష్పవృష్టి కురిసేటట్లుగా,

"తాసా మావిరభూచ్ఛౌరి: స్మయమానముఖాంబుజః"

(వారి ముందు చిరునవ్వుతో కూడిన పద్మం వంటి ముఖాన్ని కలిగినవాడై శ్రీకృష్ణుడు ప్రత్యక్షమయ్యాడు) అనే విధంగా, గోపికలు 'జలరుహాసనమ్ చారుదర్శయ" అని పల్కినట్లుగా, స్మయమానముఖాంబుజాన్ని కలవాడై, ఆనందాన్ని మేఘంవలె వర్షించాడని భావం. ఇందువల్ల, వాంఛితాధికఫలప్రదత్వం చెప్పబడింది. ఈ విధంగా సనకాదులకు దుర్లభమైన మహాశ్రేయస్సును సామాన్యమైన గోపీజనాలకు ఇచ్చినవాడు నాకు తదేకదేశశ్రేయస్సును ఇవ్వవచ్చుకదా! - అని హార్దభావం. గోపికలు దర్శించి అభిలషించడానికి హేతువు స్వామికి కల నిరతిశయ సౌందర్యమని అంటున్నారు—

**(సౌందర్యముద్రామణిః)** - అని అంటూ.

**(యః కాంతామణిరుక్మిణీఘనకుచద్వంద్వైకభూషామణిః)**

"అస్యైవ భార్యా భవితుం రుక్మిణ్యర్హతి నాపరా,
అసా వప్యనవద్యాత్మా భైష్మ్యా స్సముచితః పతిః"

(ఈ రుక్మిణి ఈ శ్రీకృష్ణునకు మాత్రమే కాదగినది, ఇంకొకరు కాదు. ఏ దోషం లేనివాడైన ఈ శ్రీకృష్ణుడు కూడా రుక్మిణికి తగిన భర్త) అని ఇద్దరు పరస్పరానురూపులై ఉన్నా,

"తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్,
రాఘవో ఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా"

(సమానమైన శీలాన్ని, వయస్సును, ప్రవర్తనను కలిగినది, సమానమైన అభిజాత్యలక్షణాన్ని కలిగినది, తెల్లని కన్నులను కలిగినది అయిన ఈ సీతాదేవి శ్రీరామునకు తగినది, అతడు కూడా ఈమెకు తగినవాడు)

అని శ్రీరామునకు, సీతకు సర్వాంశలో తౌల్యమున్నా, సీతాదేవి నేత్రసౌందర్యం అధికం అయినట్లుగా, రుక్మిణికి స్తనసౌందర్యమధికం కనుక, అందులో అభినివేశాన్ని పొంది పరాధీనుడై ఉంటాడని అర్థం. రుక్మిణి వక్షస్సులో అనేకాభరణాలున్నా, ఇతడే ముఖ్యమైన భూషణంగా ఉన్నాడని భావం. నాకు శ్రేయఃప్రదానం చేయకపోయినా, రుక్మిణీదేవి దివ్యస్తనయుగళంలోని ఆశతో దాని నివాసస్థానంగా కల్గి ఉండడానికి అయినా నాకు శ్రేయఃప్రదానం చేయాలికదా! నాకు శ్రేయస్సును అనుగ్రహించకపోతే, రుక్మిణీదేవి తన స్తనాలను నీకు వాసస్థానంగా ఇస్తుందా? ఆమె నీకంటికే కన్పించదు సుమా! నేను రుక్మిణీపరికరంలోకి చేరినవాడను కదా. ఆమె స్తనయుగాన్ని నీవు క్షణకాలం చూడకపోతే నీ ఆత్మ నిలువదు. అందువల్ల, నీవు ఆత్మరక్షణార్థమైనా నాకు శ్రేయఃప్రదానాన్ని చేయాలి- అని భావం. "తప్తకాంచనవర్ణాభా" (పుటం పెట్టిన బంగారంరంగువంటి రంగును కలిగినది) అని స్వర్ణవర్ణ అయిన రుక్మిణీదేవి స్తనానికి గారుడమణివంటి కృష్ణుడు తన తిరుమేనితో పరభాగశోభను కల్గిస్తున్నందున "భూషామణిః" అని అంటున్నారు.

**(దేవశిఖామణిః)** - నాకు శ్రేయస్సును అనుగ్రహిస్తే అడ్డుపెట్టే వారుంటారా ? నీవు దేవశిఖామణి కదా! నీవు అనుగ్రహించగోరితే ఎవరికైనా అడ్డుపెట్టడానికి వీలున్నదా ? నీ ఆశ్రితకోటిలో చేరిన గోపాదులను వర్షంతో బాధించడం ఆరంభించిన ఇంద్రుడు కూడా భక్తుడయ్యాడు కదా!

**(గోపాలచూడామణిః)** - పశువులను మేపి, నీరు తాగించి రక్షించే గోపాలురకు శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడు— అని అర్థం. శ్రేష్ఠ్యమంటే- గోవుల భావాన్ని గ్రహించి మేపడం, నీరు తాగించడం, స్నానం చేయించడం - ఇత్యాది రక్షణాలను చేయడం. మిగిలినవారికి పశువుల మనస్సును గ్రహించి, వాటిని మేపడం తెలియదు. అందువల్ల వారికంటే ఇతడే శ్రేష్ఠుడు. ఇంతేకాక, గోపాలురు తమకు జీవాతువు అని గోవులను రక్షిస్తారు. శ్రీకృష్ణునకయితే అది ఆనందాన్ని కల్గించే వ్యాపారం. "తివత్తినిల్ పశునిరై మెయ్ ప్పుపత్తి" (పరమపదంలో కూడా గోవులను మేపడం ఇష్టపడతావు) అని యమునాతీర వనాలలో పశువులను మేపడం, యుమునవాటికి నీరు తాగించడం- ఇత్యాదులను చేసినట్లే, శ్రీవైకుంఠంలో కూడా విరజాతీరవనంలో పశువులను మేపడం, విరజలో నీరు తాగించడం ఆనందకరంగా కలవాడని నమ్మాళ్వార్లు పలికారు.

**(నః)** - మాకు- అని అర్థం. నా తిరుమంత్రోపదేశంలో వైష్ణవులుగా మారినవారికి కూడా.

**(శ్రేయః దిశతు)** - దాసునకు "ఇది కావాలి"- అని కోరడం తెలియదు. ఏది శ్రేయస్సో, దానిని నీవే ఇవ్వాలి- అని ప్రార్థిస్తున్నారు.

**23. శత్రుచ్ఛేదైక మంత్రం సకలముపనిషద్వాక్య సంపూజ్య మంత్రం**
**సంసారోత్తారమంత్రం సముపచిత తమస్సంఘ నిర్యాణ మంత్రమ్।**
**సర్వైశ్వర్యైక మంత్రం వ్యసన భుజగ సందష్ట సంత్రాణ మంత్రం**
**జిహ్వే! శ్రీకృష్ణమంత్రం జప జప సతతం జన్మసాఫల్య మంత్రమ్॥**

జిహ్వే = ఓ నాలుకా, శత్రుచ్ఛేదైకమంత్రం = శత్రుసంహారమందు ప్రధాన మంత్రమును, సకలం = సమస్తములైన, ఉపనిషద్వాక్య =వేదాంత వాక్యములలో, సంపూజ్య = గౌరవింపదగిన, మంత్రం = మంత్రమును, సంసార = సంసారమునుండి, ఉత్తార = తరింప చేసే, మంతం = మంత్రమును, సముపచిత = ప్రోగుచేయబడిన, తమః = అజ్ఞానమును చీకటియొక్క, సంఘ = రాశిని, నిర్యాణ

= పోగొట్టదగిన, మంత్రం = మంత్రమును, సర్వైశ్వర్య = అన్ని ఐశ్వర్యములకు, ఏక = ముఖ్యమైన, మంత్రం = మంత్రమును, వ్యసన = దుఃఖములనెడు, భుజగ = పాములచేత, సందష్ట = మిక్కిలి కఱవబడిన వారిని, సంత్రాణ = పరిరక్షణము చేయు, మంత్రం = మంత్రమును, జన్మసాఫల్య మంత్రం = జన్మమునకు సాఫల్యమును కలుగజేయు మంత్రమును (అగు) శ్రీకృష్ణమంత్రం = శ్రీకృష్ణుడను మంత్రమును, సతతం = ఎల్లప్పుడు, జప జప = పలుమారు జపము చేయుము

**అవతారిక :**

"ఈ విధంగా నేను "శ్రేయో నో దిశతు" అని ప్రార్థించినా, సర్వేశ్వరుడు ఫలప్రదానాన్ని చేయకుండా ఉండడానికి కారణం నా వద్ద ఏ ఉపాయానుష్ఠానం లేనందునవల్లకావచ్చు"- అని భావించి, ఆళ్వారులు, ఉపాసనాదులు అవశ్యాలు కనుక, "యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి" (యజ్ఞాలలో నేను జపయజ్ఞాన్ని),

"జప్యేనాపి చ సంసిద్ధిం బ్రాహ్మణో నాత్ర సంశయః"

అనేవిధంగా జపరూపోపాయమే శ్రేష్ఠమని, భగవన్మంత్రజపాలలో,

"ఏకోఽపి కృష్ణే సుకృతప్రణామో దశాశ్వమేధావబృథేన తుల్యః,
దశాశ్వమేధాత్ పునరేతి జన్మ కృష్ణప్రణామీ న పునర్భవాయ"

(శ్రీకృష్ణుని విషయంలో చేసిన నమస్కారం ఒక్కటి అయినా, అది పది అశ్వమేధ యోగాలతో సమానమైనది. కానీ, విశేషం ఏమంటే పది అశ్వమేధ యాగాలు చేసినవాడు మళ్లీ జన్మిస్తున్నాడు. శ్రీకృష్ణుని నమస్కరించినవాడు మాత్రం మళ్లీ జన్మించడం లేదు)

"ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపఃకర్మాత్మికాని వై,
యాని, తేషా మశేషాణాం శ్రీకృష్ణానుస్మరణం పరమ్"

(తపస్సులు కర్మలు మొదలైన ప్రాయశ్చితాలు అన్నిటిలోనూ శ్రీకృష్ణ నామాన్ని స్మరించడం గొప్ప ప్రాయశ్చిత్తం)

అని శ్రీకృష్ణమంత్ర జపం శ్రేష్ఠమైనందున, ఆ జపం జిహ్వాసాధ్యం కనుక, జిహ్వను కృష్ణమంత్రజపం చేయమని ఇందులో ప్రార్థిస్తున్నారు.

వ్యాఖ్య : **(శత్రుచ్ఛేదేతి)** - శ్రీకృష్ణమంత్ర జపం చేస్తే విరోధి అయిన పాపం పోతుందా? అంటే బదులు పల్కుతున్నారు.

**(శత్రుచ్ఛేదైకమంత్రమ్)** - బాహ్యశత్రువులను పోగొట్టుకోవాలనే ఆశ ఉంటే కృష్ణమంత్రజపం చేస్తే, శత్రువిజయాన్ని పొందవచ్చు. ఉద్గీథప్రణవాదిదృష్టిని పొందవలసిన పనిలేదు. కామక్రోధాదిరూపమైన ఆంతరశత్రు విజయాపేక్షతో కృష్ణమంత్రజపం చేస్తే కామాదిజయం కల్గుతుంది. ఈ విధమైన ఆంతర బాహ్య శత్రువులను నిరసించడానికి వేరు వేరుగా ఉండే మంత్రాలవలె కాకుండా, అన్నిటికి పనికి వచ్చే ఒకే మంత్రమై ఉంటుందని భావం.

అయితే, ఈ మంత్రం ఉపనిషద్వాక్యాలలో ప్రతిపాదింపబడిందా? అంటే, ఉపనిషద్వాక్యాలలో పూజ్యతమంగా ప్రతిపాదింపబడిన సకలమంత్ర స్థానాలలో ఈ ఏకమంత్రమే నిలుస్తుందని అంటున్నారు.

**(సకలమితి)** - ఇది సంపూజ్యమంత్రమనేదానికి విశేషణం. ఉపనిషద్వాక్యాలతో సంపూజ్యమంత్రాలేవి? అంటే, "ఓమిత్యగ్రే వ్యాహరేత్" ఇత్యాది వాక్యప్రతిపాద్యమైన అష్టాక్షర—విష్ణుషడక్షర—వాసుదేవద్వాదశాక్షరాదుల స్థానంలో ఈ శ్రీకృష్ణమంత్రం ఉన్నది. అంటే- ఆయా మంత్రాలిచ్చే ఫలాలను ఈ మంత్రమే ఇస్తుందని భావం.

**(ఉపనిషద్వాక్యసంపూజ్యమంత్రమ్)** - ఉపనిషద్వాక్యాలలో ఆదరణీయ మంత్రమని భావం. అభిచారాదులు ప్రతిపాద్యమైనా, వాటిలో ఆదరం లేదు. ఆ అభిచార మంత్రాలు నరకప్రదాలై ఉంటాయికదా! నరకప్రదాలు కాకుండా, కామ్యఫలమాత్రప్రదాలై ఉండే మంత్రాలు వేదంలో ప్రతిపాదింపబడినందున, శ్రీకృష్ణమంత్రం కూడా కామ్యఫలాన్ని మాత్రం ఇస్తుందా ? అనే శంకకు బదులిస్తున్నారు.
**(సంసారోత్తారమంత్రమ్)** - సంసారంనుండి ఉత్తారణం చేసే మంత్రమై ఉన్నది. ఈ అర్థం గతవిశేషణం వల్ల సిద్ధమైనా, దార్ఢ్యార్థం పునరుక్తి.

"అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే"

(కర్మ ద్వారా సంసారాన్ని దాటి, జ్ఞానం ద్వారా మోక్షాన్ని పొందుతున్నాడు) అని యాగాదికర్మలు పాపతరణోపాయాలుగా, విద్య అనేది బ్రహ్మానుభవప్రదమై ఉండే రీతిలో కాకుండా, శ్రీకృష్ణమంత్రమే ఉపాయవిరోధి అయిన తమస్సంఘాన్ని నివారించి, మోక్షాంతమైన ఐశ్వర్యాలను ఇస్తుంది– అని ఇక రెండు విశేషణాలద్వారా క్రమేణ పల్కుతున్నారు.
**(సముపచితతమస్సంఘనిర్వాణ మంత్రమ్)** - ఇంకా ఇంకా అభివృద్ధమవుతున్న తమోగుణసమూహాన్ని నివృత్తి చేసే మంత్రం, తమస్సు ఎంత అభివృద్ధమైనా, దానిని నశింపజేస్తుందని భావం.
**(సర్వైశ్వర్యైకమంత్రమ్)** - మోక్షాంతమైన సర్వైశ్వర్యానికి కృష్ణమంత్రమే సాధకమై ఉంటుంది.
**(వ్యసనభుజగసందష్టసంత్రాణమంత్రమ్)** - తత్తత్ కాలాలలో వ్యసనాలు కల్గితే కృష్ణనామోచ్చారణం చేస్తే అన్ని వ్యసనాలు తీరుతాయి. లేక, అనాదిగా చేస్తూ వచ్చే తన మహాపాపాలన వల్ల కూడా ఉపాయాంతరాలైన ఉపాసనాదులలో అధికారం లేకపోవడాన్ని చూచి, క్లేశపడి, దానిచే, సర్పంచేత వలె కరువబడినవారివలె బాధపడేవారికి సర్పనివారకమైనమంత్రం వలె శ్రీకృష్ణమంత్రం నివారణ మంత్రమై ఉంటుందని భావం.

“సుదుష్కరేణ శోచేద్యో యేన యేనేష్టహేతునా,
స స తస్యాహ మేవేతి చరమశ్లోకసంగ్రహః"

(తన ఇష్టప్రాప్తికి హేతువైనా, దుష్కరమైన ఉపాయాన్ని చూచి బాధపడినవానికి నేనే ఆ ఉపాయస్థానంలో నిలుస్తాను– అనేది చరమశ్లోకంలోని సంగ్రహం) అని చరమశ్లోకం వలె సర్వసంగ్రహమై ఉంటుంది, ఈ మంత్రం -అని అర్థం.

**(జన్మసాఫల్యమంత్రమ్)** - పలు ఎందుకు? కృష్ణనామోచ్చారణం చేయకపోతే నా జన్మ వ్యర్థం. కృష్ణనామోచ్చారణాన్ని చేస్తేనే నేను పొందిన జన్మం సఫలమవుతుంది.
**(హే జిహ్వే! శ్రీకృష్ణమంత్రం జప జప)** - ఆదరంతో “జప జప” అని ద్విరుక్తి ఇటువంటి అనేక గుణాలున్నందున,
**(సతతం జప జప)** - క్షణమైనా వృథాజల్పనం చేయకు.

“యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవో న చింత్యతే,
సా హానిః స్తన్మమహచ్ఛిద్రం సా భ్రాంతి స్సా చ విక్రియా"

(ఒక్క క్షణమైనా, ముహూర్త కాలం అయినా, వాసుదేవుని ధ్యానించకపోవడం అనేది హాని, అదే గొప్ప అపాయం, అదే భ్రాంతి, అదే వికారం) అని కదా చెప్పబడుతున్నది.

**24. వ్యామోహప్రశమౌషధం మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం**
**దైత్యేంద్రార్తికరౌషధం త్రిభువని సంజీవనైకౌషధమ్।**
**భక్తాత్యంతహితౌషధం భవభయప్రధ్వంసనైకౌషధం**
**శ్రేయః ప్రాప్తికరౌషధం పిబ మనః! శ్రీకృష్ణదివ్యౌషధమ్**

మనః = ఓ మనసా!, వ్యామోహ = అనురాగమనే మూర్ఛను, ప్రశమ = పోగొట్టునట్టి, ఔషధం = మందు, ముని = యోగులయొక్క, మనోవృత్తి = మనోవ్యాపారము యొక్క, ప్రవృత్తి = నడవడికి, ఔషధం = మందును, దైత్యేంద్ర = రాక్షసులలో మేటులకు, ఆర్తికర = బాధను కలుగజేయునట్టి, ఔషధం = మందును, త్రిభువనీ = ముల్లోకములను, సంజీవన = బ్రతికించునట్టి, ఏక ఔషధం = ముఖ్యమైన మందును, భక్త= భక్తులకు, అత్యంత = మిక్కిలి, హిత = మేలును కలుగజేయునట్టి, ఔషధం = మందును, భవ = సంసారమువలన, భయ = వెఱుపును, ప్రధ్వంసన = బొత్తిగా, ఏక ఔషధం= ముఖ్యమైన మందును,
శ్రేయఃప్రాప్తికరౌషధం = మేలును కలుగజేయునట్టి మందును అగు శ్రీకృష్ణదివ్యౌషధం = శ్రీకృష్ణుడను శ్లాఘ్యమైన మందును, పిబ = పానము చేయుము

**అవతారిక:**

లోకంలో అనిష్టనివృత్తికి, ఇష్టప్రాప్తికి మణి-మంత్ర–ఔషధాలని మూడు ఉపాయాలున్నాయి. ఆ మూడిటి స్థానాలలో శ్రీకృష్ణుడే ఉన్నాడని పలుకగోరి, "భక్తాపాయ" అనే శ్లోకంలో మణిస్థానాపన్నుడై ఉన్నాడని, "శత్రుచ్ఛేదైకమంత్రమ్" అనే శ్లోకంలో మంత్రస్థానాపన్నుడై ఉన్నాడని పల్కి, ఈ శ్లోకంలో ఔషధస్థానాపన్నుడై ఉన్నాడని పల్కుతున్నారు.

వ్యాఖ్య : **(వ్యామోహమితి) - (వ్యామోహప్రశమౌషధమ్)** - ప్రాకృత భోగాలలో కలిగే వ్యామోహాన్ని పూర్తిగా తీర్చడంలో ఔషధమై ఉండేవాడు, శ్రీకృష్ణుడని భావం. ప్రాకృతభోగాలలో ఏర్పడే వ్యామోహాన్ని ఇక ఏ అనన్యమైన ఔషధం తీర్చలేదు. శ్రీకృష్ణస్మరణం చేస్తే పాపం తల వాల్చి, సత్వోన్మేషం కల్గి, ప్రాకృత భోగాలలోని రుచి తనకు తానే వీడిపోతుంది. అందుచేత ఇది దివ్యౌషధం. ఇంతేకాక, ప్రాకృతభోగాల కంటే శ్రీకృష్ణుడనే ఔషధం అతిరస్యమై, దివ్యమై ఉన్నందున దానిని పానం చేస్తే, తనకు తానే

ప్రాకృతభోగాలలోని రుచి తీరుతుంది. క్షీరాన్ని చూస్తే గంజిపట్ల దృష్టి పోదుకదా! "మరున్దే నజ్గళ్ పోకమకి*ழ்*చ్చిక్కు" (మన భోగానందానికి సాటి లేని మందు) అని అప్రాకృతభోగానందానికి గొప్ప ఔషధమై ఉన్నాడని నమ్మాళ్వార్లు పలికారు కదా!

**(మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధమ్)** - లశునౌషధం రాజయక్ష్మను నివృత్తి చేయకుండా, అల్పవ్యాధులను నివృత్తి చేసినా, ఆ అల్పవ్యాధుల నివారణను అపేక్షించే సాధువులకు లశునమనే ఔషధభక్షణంలో ప్రవృత్తి కలుగని రీతిలో, ఉపాసనానుగుణారోగ్యాన్ని కోరే మునులకు "సూర్యా దారోగ్య మిచ్ఛేత్" (సూర్యుని వలన ఆరోగ్యాన్ని కోరాలి) అని సూర్యాదులు సంసారవ్యాధిని నివర్తింపజేయకుండా, ఆరోగ్యప్రదాయకులై ఉన్నా, వారికి సూర్యాదుల పట్ల మనస్సు ప్రవర్తించదు. సర్వవ్యాధినివర్తకమైన శ్రీకృష్ణదివౌషధంలోనే మనసు వర్తిస్తుంది. ఈ విధంగా మననం చేసే మునులకు ఆర్తిని కల్గించే అసురాదులకు పీడను కల్గించే ఔషధమై ఉన్నాడని ఇక పల్కుతున్నారు.

**(దైత్యేంద్రార్తికరౌషధమ్)** - కాలనేమి మొదలైన అసురశ్రేష్ఠులు ఎంత బలిష్ఠులైనా, వారి పీడను నివృత్తి చేసే ఔషధమైన శ్రీకృష్ణుడనే ఔషధం కొందఱికి ఆర్తిహరం గాను, కొందఱికి ఆర్తికరంగాను ఉంటుందని భావం.

"తీమైయై ఉన్నడియార్ క్కు తీర్ త్తు అశురరకళుక్కు త్తీమైకళ్ శెయ్ కున్దా! "

(నీ భక్తులకు హానిని కలిగించి, అసురులకు హానిని కలిగించే కుందస్వభావుడా! అంటే, కుందపుష్పం వలె స్వచ్ఛమైన స్వభావం కలవాడా!) అని క్లేశాన్ని నీ దాసులకు తీర్చి, అసురులకు దానిని కల్గించేవాడని నమ్మాళ్వార్లు పలికారు.

**(త్రిజగతాం సంజీవనైకౌషధమ్)** - దేవలోకంలో ఉండేవారికి మాత్రమే సంజీవనం కల్గించే సంజీవనకరణి అనే ఔషధంవలె కాకుండా, మూడు లోకాలలోనివారికి సంజీవనౌషధమై ఉంటుంది. "సంసారాగ్ని విదీపనవ్యపగతప్రాణాత్మసంజీవనీమ్"(సంసారం అనే అగ్ని మండడంచేత తొలగిన ప్రాణాలను గల జీవులను ఉజ్జీవింపజేసేది) అనే విధంగా సంసారాగ్నిచే మృతప్రాయులైన ముల్లోకాలలోని అందరికీ శ్రీకృష్ణుడు తప్ప జీవనాన్ని కల్గించే వేఱు ఔషధం లేదని భావం. ఇందువల్ల అందరికీ శ్రీకృష్ణుడే సంసారనివృత్త్యర్థం ఆశ్రయణీయుడని చెప్పబడింది. భక్తిని కల్గి ఆశ్రయిస్తే, శ్రీకృష్ణుడే సకలఫలాన్ని అనుగ్రహిస్తాడనే దానిని ఇక వ్యక్తం చేస్తున్నారు.

**(భక్తాత్యంతహితౌషధమ్)** - అత్యంతహితమైన ఔషధాన్ని భుజిస్తే, రాబోయే హితాలను అన్నిటిని ఆ ఔషధం కలుగజేసేటట్లే, శ్రీకృష్ణుని ఆశ్రయిస్తే, తరువాత గల హితాలను శ్రీకృష్ణుడే కలుగజేస్తాడని భావం. అందువల్ల సంసారాన్ని చూచి భయపడవద్దు. భయాన్ని నశింపజేసేవాడు, హితాలను కల్గించేవాడు అతడే. ఓ మనసా! అతనిని ఆశ్రయించు—అని నియమిస్తున్నారు.

**(భవభయప్రధ్వంసనైకౌషధమ్)** - సంసారభయాన్ని ధ్వంసం చేయడంలో ఔషధమై ఉన్నాడు.

**(శ్రేయఃప్రాప్తికరౌషధమ్)** - మోక్షాంతమైన శ్రేయస్సును ఇవ్వగల్గిన ఔషధమైన,

**(శ్రీకృష్ణదివ్యౌషధం హే మనః! పిబ)** - ఓ మనసా! శ్రీకృష్ణుడనే దివ్యామృతాన్ని పానం చేయి.

**25. ఆమ్నాయాభ్యసనాన్యరణ్యరుదితం వేదవ్రతాన్యన్వహం**
**మేదశ్ఛేదఫలాని పూర్తవిధయః సర్వే హుతం భస్మని।**
**తీర్థానా మవగాహనాని చ గజస్నానం వినా యత్పద-**
**ద్వంద్వాంభోరుహసంస్మృతీః విజయతే దేవస్స నారాయణః॥**

యత్ = ఏ నారాయణమూర్తి యొక్క, పదద్వద్వాంభోరుహ = కమలములవంటి రెండు పాదముల యొక్క, సంస్మృతిం వినా = ధ్యానములు లేక, ఆమ్నాయాభ్యసనాని = వేదములను అభ్యసించుటల, అరణ్యరుదితం = ఆడవిలో ఏడ్చుట వంటివో, ఆన్వహం = ప్రతిదినము చేయుబడునట్టి, వేదవ్రతాని = వేదమునందు చెప్పబడిన వ్రతములు, మేదశ్ఛేదఫలాని = కొవ్వు తరిగిపోవుటయే ఫలముగా కలవో, సర్వే = సమస్తమైన, పూర్తవిధయః = గుంటలు, కోనేళ్ళు త్రవ్వించుట మొదలగు దర్మ కార్యములు, భస్మని = బూడిదలో, హుతం = హోమము చేయుటవంటివో, తీర్థానాం =గంగాది పుణ్యనదులయొక్క, అవగాహనాని చ = స్నానములును, గజస్నానం = ఏనుగుయొక్క స్నానమువంటివో, సః దేవః నారాయణః= ఆ భవంతుడగు శ్రీవిష్ణుమూర్తి, విజయతే = సర్వోత్కర్షతో ప్రకాశించుచున్నాడు.

**అవతారిక :**

ఈ విధంగా, "మణిమంత్రౌషధాలు మూడు శ్రీకృష్ణుడే"— అని పల్కుతూ, "శ్రీకృష్ణమంత్రాన్ని జపించు" అని జిహ్వను, "శ్రీకృష్ణుడనే దివ్యౌషధాన్ని పానం చేయి" అని మనస్సును నియమించగా, ఆ విధంగా నియమింపబడిన జిహ్వ జపాన్ని, మనస్సు పానాన్ని చేసేటట్లే చింతనం కూడా చేయగా, "గోపాలచూడామణియైన నేనే సర్వఫలప్రదుడను, ఫలప్రదుడుగా చెప్పబడే వేదాభ్యాసన వ్రతానుష్ఠానాదులు నా చరణారవిందస్మరణం లేనపుడు నిష్ఫలం అవుతాయి- అని గ్రహించి, సకల కర్మానుష్ఠాలను చేసి, నన్ను ఆశ్రయించినందున మీకంటి ముందే ప్రకాశిస్తాను"- అని వీరికి

తోచేటట్లు నిరతిశయదీప్తియుక్తుడై, వీరి కంటి ముందే నిలచి ప్రకాశించిన రీతిని ఇందులో పల్కుతున్నారు.

**వ్యాఖ్య : (ఆమ్నాయేతి)** (ఆమ్నాయాభ్యసనాని యత్ పదద్వంద్వాంభోరుహసంస్మృతీర్వినా అరుణ్యరుదితమ్) - ఆర్తుడు నిర్జనవనంలో ఆక్రందిస్తే, "ఎందుకు రోదిస్తున్నావు?" అని అడిగేవారు లేకుండా ఉన్నందున, ఆ రోదనం వ్యర్థం అయేటట్లే, భగవచ్చరణారవిందస్మరణం లేనపుడు చేసిన వేదాభ్యాసనం అంతా వృథా అవుతుంది. ఇందువల్ల భగవంతుని స్మరణ లేకుండా వేదాఖ్యశబ్దరాశిని అభ్యసిస్తే ఆ శబ్దరాశిని అధ్యయనం చేయడానికి రావలసిన ఫలం రాదని చెప్పబడింది. వ్రాత్యతానివృత్త్యర్థం అధ్యయనం చేసినా, భగవత్స్మరణ లేనపుడు వ్రాత్యతానివృత్తి రాదు. అపుడు యముడు దండించేటపుడు "ఆ వేదాభ్యసనం ఎందుకు? "అని అడుగడు- అని భావం. ఇంతేకాక, వేదోక్తవ్రతాద్యనుష్ఠానఫలంకూడా రాదు- అని ఇక పల్కుతున్నారు.

**(అన్వహం వేదవ్రతాని)** - ప్రతిదినం అనుష్ఠింపబడే వేదోక్తవ్రతాలు—అని అర్థం. ప్రతిదినం చేసే అగ్నిహోత్రాదులకు కూడా ఇది ఉపలక్షణం. ప్రతిదినం చేసే అగ్నిహోత్రవ్రతాదులు కూడా భగవత్ స్మరణం లేకపోతే వాటి ఫలంగా చెప్పబడిన పుణ్యలోకప్రాపకం రాదు.

**(మేదచ్ఛేదఫలాని)** - మేదస్సుయొక్క నాశాన్ని ఫలంగా కల్గి ఉండే వ్రతాద్యనుష్ఠానాలు భగవచ్చరణ స్మరణం లేనపుడు కేవలం దేహశోషకాలు, అంతే తప్ప, ఫలాన్ని కల్గించవు- అని భావం. ఇష్టాపూర్తాలలో ఇష్టాలు నిష్ఫలాలు అయేటట్లే, పూర్తాలు కూడా నిష్ఫలాలు అవుతాయి- అని అంటున్నారు. ఇష్టాలంటే— యాగాదులు, పూర్తాలంటే—తటాకనిర్మాణాదులు.

**(సర్వే పూర్తవిధయః భస్మని హుతమ్)** - భగవత్స్మరణం లేనపుడు చెఱువులను, బావులను తవ్వించడం మొదలైనవి బూడిదలో చేసిన హోమాలవలె నిష్ఫలాలు– అని భావం. "యదిద మవిద్వానగ్నిహోత్రం జుహోతి యథాంగారా నపోహ్య భస్మని జుహుయాత్" అనే శ్రుతి ఇక్కడ వివక్షితం. ఈ శ్రుత్యర్థమేమంటే- పరమాత్మను తెలియకుండా అగ్నిహోత్రం మొదలైన ఏ కర్మలను చేసినా, అవి బూడిదలో చేసిన ఆహుతియే కాగలదు- అని. నమ్మాళ్వార్లు తిరువాయ్ మొ*ழி* ప్రబంధంలోని నాల్గవ దశకంలో "పడి మన్ను" అనే తొమ్మిదవ పాశురంలో స్వర్గాది వాంఛతో ఇంద్రియ జయాన్ని పొంది, వ్రతాద్యనుష్ఠానం చేసినా, భగవానుని ఆశ్రయించకపోతే, స్వర్గాద్యనుభవం సిద్ధించదని పలికారుకదా.

"ధ్యాయేన్నారాయణం దేవం స్నానాదిషు చ కర్మసు"

(స్నానం మొదలైన కర్మలలో దేవుడైన నారాయణుని ధ్యానించాలి)

అని భగవత్స్మరణంతోనే స్నానం చేయాలని విధించబడిన భగవద్ధ్యానాన్ని చేయకుండా చేసిన స్నానం గజస్నానంవంటిదే తప్ప, ఆత్మశుద్ధికోసం కాదు- అని ఇక పల్కుతున్నారు.

**(తీర్థానా మవగాహనాని గజస్నానమ్)** - అనేకపుణ్యతీర్థాలలో అనేక స్నానాలు చేసినా, అవి గజస్నానంవంటివే. గజం నీటిలో ఒకసారి మునిగితే ఏమయింది? అనేక మార్లు మునిగితే ఏమయింది? ఏ ప్రయోజనం లేదు–అని భావం. "యత్పదద్వంద్వాంభోరుహ" అని పద్మాన్ని దృష్టాంతంగా పల్కినందున స్మరణకాలంనుండికూడా అది భోగ్యమై ఉంటుంది– అని సూచింపబడింది.

**(యో దేవో నారాయణో విజయతే)** - నిరతిశయదీప్తిని కల ఆ నారాయణుడు నాకంటి ముందే ప్రకాశిస్తున్నాడు.

**26. శ్రీమన్నామ ప్రోచ్య నారాయణాఖ్యం**
**కే న ప్రాపు ర్వాంచితం పాపినోఽపి।**
**హా! నః పూర్వం వాక్ప్రవృత్తా న తస్మిన్**
**తేన ప్రాప్తం గర్భవాసాదిదుఃఖమ్॥**

పాపినః అపి = పాపాత్ములయినను, కే = ఎవరు, నారాయణాఖ్యం = నారాయణ అనే, శ్రీమత్ = సంపద్యుక్తమైన, నామ = పేరును, ప్రోచ్య = కీర్తించి, వాంఛితం = ఇష్టమును, న ప్రాపుః = పొందలేదు?, పూర్వం = పూర్వజన్మమునందు, వాక్ = వాగింద్రియము, తస్మిన్ = ఆ నారాయణ నామమునందు, న ప్రవృత్తా = ప్రవేశింపలేదు, తేన = ఆ కారణము చేత, గర్భవసాది దుఃఖం = గర్భములోనుండుట మొదలగువానివలన కలిగిన దుఃఖము, ప్రాప్తం = తటస్థించినది, హా = ఆయ్యో!

అవతారిక :

ఈ విధంగా భగవన్నామజపం చేయగా, , పాపియైన నేను తనలోను అనుభవించేటట్లు నాకంటి ముందుకు వచ్చి భగవంతుడు నిలచి ప్రకాశించే రీతిలోనే అభీష్టాన్ని ఇప్పుడు నేను పొందాను. ఎంతటి పాపిష్ఠివారైనా “నారాయణ" అనే తిరునామాన్ని పల్కితే, వాంఛితాన్ని పొందనివారున్నారా? అయ్యో! ఈ విధంగా తిరునామాన్ని పూర్వం నేను చెప్పనందువల్లనే కదా గర్భవాసాది క్లేశాలు కలిగాయి- అని గడచినదానికి ఇందులో శోకిస్తున్నారు.

**వ్యాఖ్య : (శ్రీమదితి) - (శ్రీమన్నామ ప్రోచ్య నారాయణాఖ్యమ్)** నామానికి శ్రీమత్త్వం ఏమంటే- “నిరస్యతే యేన దిశా మమంగళమ్" (భగవన్నామంవల్ల దిక్కులలోని

అమంగళాలు తీరిపోతాయి) అనే విధంగా “నారాయణ” అనే శబ్దం చెవులలో పడితే, అది అన్ని మంగళాలను పోగొట్టి, సర్వసంపత్తును ఇచ్చే రీతిలో ఉండడం.

**(ప్రోచ్య)** - పల్కి,

**(కే పాపినోఽపి వాంఛితం న ప్రాపుః)** - ఏ పాపులు ఇష్టప్రాప్తిని పొందలేదు? నారాయణుడనే నామాన్ని పల్కితే ఆ నామానికి నామప్రతిపాద్యుడు భగవంతుడు- అనే జ్ఞానముండాలనే నిర్బంధం లేదు. నామప్రతిపాద్యుడు ఇంకొకడనే భావన ఉన్నా, నామోచ్చారణమే సర్వాభీష్టప్రదాయకమని భావం.

“ఏతావతాల మఘనిబర్హణాలయ పుంసాం
సంకీర్తనం భగవతో గుణకర్మనామ్నామ్,
ఆక్రుశ్య పుత్ర మఘవాన్ యదజామిళోఽపి
నారాయణేతి మ్రియమాణ ఉపైతి ముక్తిమ్”

(భగవంతుని గుణాలను, లీలలను, నామాలను కీర్తనలు చేయడం అనే ఇది ఒక్కటే చాలు, పాపాలు నశించడం కోసం. ఎందుకంటే, పాపం చేసిన అజామిళుడు కూడా తన పుత్రుని నారాయణా! అని భగవంతుని నామంతో పిలచినందున అతడు మరణించేటప్పుడు ముక్తిని పొందాడు) అని నారాయణ పదప్రతిపాద్యుడు భగవానుడనే జ్ఞానం లేని అజామిళుడు సైతం తన పుత్రుని నారాయణా! అని పిలచినంతనే, స్వప్నంలోకూడా భావించని ముక్తిని పొందాడు. ఇక, వాంఛితాన్ని పొందుతారని అడుగవలసి ఉన్నదా?–అని భావం. “నారాయణన్ తమ్మన్నై నరకమ్ పుకాళ్" అని “నారాయణా! ” అని పుత్రునకు పేరును పెట్టిన తల్లికికూడా నరకం లేదని అన్నారు, ఆళ్వారులు.

**(నః పూర్వమిత్యాది)** - మన వాక్కు ఆ విషయంలో ఇంతవరకు ప్రవర్తించలేదు. అందువల్లనే మనకు గర్భవాసం మొదలైన దుఃఖం ప్రాప్తించింది.

**(హా!)** - ఈ విధంగా నారాయణమహిమ ఉండగా, నామోచ్చారణం చేయనందువల్లనే కదా మహాదుఃఖం ప్రాప్తించింది- అని ఖేదపడుతున్నారు. "కావియై వెన్ట కణ్ణార్కలవియే కరుది" అనే తిరుక్కుఱున్దాణ్డకమ్ ప్రబంధంలోని 14 వ పాశురంలో, "గమనసాధనమైన ఱెక్కలు తెగకుండా దృఢతరపక్షాలను కల్గినది, సారాసారవివేకం చేయడంలో సమర్థమైన హంసపక్షివలె "తం విద్యాకర్మణి సమనార్వభేత" అనే విధంగా మోక్షగమన సాధనాలైన విద్యాకర్మలను కలవారు, సారాసారవివేచన సమర్థులైన పరమభాగవతులచే అధిష్ఠితమైన తిరుక్కుడన్దై (కుంభఘోణ) క్షేత్రానికి నిర్వాహకుడైన ఆరావముదాళ్వాన్ ను మహాపాపం కారణంగా భావించకుండా, నరకహేతువైన నీలోత్పలాక్షుల సంభోగసామ్రాజ్యంలో, చక్రవర్తి అయినవాడు శ్వేతచ్ఛత్రచ్ఛాయలో ఉండి, ప్రజాపాలన సామ్రాజ్యంలో ఆసక్తమయేటట్లు, ఆసక్తుడనయ్యాను"- అని గడచిన కాలం కోసం దుఃఖాన్ని పొందారు కదా, తిరుమంగై ఆళ్వార్లు.

**27. మజ్జన్మన: ఫలమిదం మధుకైటభారే!**
**మత్ ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ।**
**త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య**
**భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ! ॥**

మధుకైటభారే = మధుకైటభులను రాక్షసులకు శత్రువయినవాడా!, మజ్జన్మనః = నా యొక్క పుట్టుకకు, ఫలం = ప్రయోజనము, ఇదం = ఇదియే, మత్ = నా చేతను, ప్రార్థనీయః = కోరదగినదియు, మత్ = నా విషయమైన, అనుగ్రహః = అనుగ్రహమును, ఏష ఏవ = ఇదే, లోకనాథ = ఓ లోకధిపతీ, మాం=నన్ను, త్వత్ = దేవరవారి, భృత్య = పరిచారకునియొక్క,

పరిచారక = భృత్యుని యొక్క, భృత్య = పరిచారకుని యొక్క, భృత్య = పరిచారకుని యొక్క, భృత్యస్య = పరిచారకునియొక్క, భృత్యః ఇతి = సేవకుడని, స్మర = తలంచుము

**అవతారిక :**

ఈ విధంగా గడచిన కాలంకోసం అనుభవించిన దుఃఖం, భగవానునకు సప్తపర్వంగా దాస్యాన్ని చేస్తే తప్ప తీరదు— అని భావించి, ఆ దాస్యకరణం కూడా భగవానుడు సంకల్పించకపోతే అసూయాదులతో భాగవతాపచారమే వస్తుందని తలచి, "నీవు అసూయాది పరిపూర్ణుడనైన దాసునకు సప్తపర్వంగా నీకు దాస్యం చేసేట్లు సంకల్పించాలి. ఇదే ఈ జన్మకు ఫలం, నాకు ప్రార్థనీయం కూడా ఇదే. నీవు నాపట్ల చేసే అనుగ్రహం కూడా ఇదే కదా"- అని భగవంతుని ఇందులో ఆళ్వార్లు ప్రార్థిస్తున్నారు.

**వ్యాఖ్య : (మదితి)** హే మధుకైటభారే! లోకనాథ - నీవు విరోధినిరసన సమర్థుడవై, లోకనాథుడవై ఉండగా, నిన్ను వీడి వేఱొకరిని ప్రార్థించవచ్చునా?- అని భావం.

**(త్వద్భృత్య. . . భృత్యస్య)** - త్వద్భృత్య- వేదాపహారం చేసిన మధుకైటభులను నిరసించి, బ్రహ్మకు వేదాలని తిరిగి వచ్చే రీతిలోని ఆశ్రితవాత్సల్యలోకనాథత్వాది గుణాలకు జితులై, నీకు భృత్యులుగా ఉండేవారికి- అని భావం. "యః భృత్యః తస్య యః పరిచారకః, తస్య యః భృత్యః, తస్య యః భృత్యః, తస్య యః భృత్యః, తస్య,

**(భృత్య ఇతి)** - వీడు భృత్యుడు అగుగాక! -అని.

**(మాం స్మర)** - "భృత్యపరంపరలో ఏడవవాడుగా ఈ కులశేఖరులు అగుగాక! "అని నీవు సంకల్పించాలి- అని భావం. నీవు సంకల్పించకపోతే, అసూయాపరతంత్రుడనై, ఈ దాస్యసంపదను కోల్పోతాను. నీవు మధుకైటభాది నిరసనాన్ని కూడా చేసినట్లు,

అసూయాది నిరసనం. చేసి, చరమకాష్ఠాప్రాప్తమైన దాస్యాన్ని దాసుడు వహించేటట్లు సంకల్పించాలి– అని భావం. నమ్మాళ్వార్లు కూడా "అడియార్ న్ద వైయ ముణ్డు" అనే పాశురంలో స్వామి సౌందర్యకారుణ్యాదులలో అభినివేశాన్ని పొంది, దాస్యాన్ని ఆశపడిన వారికి, "అడియారమ్మడియార్ అడియార్ తమక్కడియార్ అడియారడియోజ్గళే" అని దాసపరంపరలో తమను ఏడవవారినిగా పలికారు. తదీయశేషపారంపర్యానికి సప్తసంఖ్యలో ఏమి విశేషం ? అంటే, దానికి అంతు లేదు, అక్కడితో పాశురం ముగిసినందున నిలిపారు, అంతే, అని– పరకాలస్వామి వ్యాఖ్యానం. ఆ రీతిలోనే వీరు కూడా శ్లోకం ముగిసినందున ఏడవ దశతో నిలిపారు- అని సహృదయులు గమనించాలి.

**(మాం స్మర)** - నా విషయంలో సంకల్పించు- అని భావం. "నిరన్తరం నినైప్పదాక నీ నినైక్క వేణ్డుమ్" (సదా నిన్ను నేను స్మరించేటట్లు నీవు సంకల్పించాలి)అనే పాశురంలో "నీ నినైక్కవేణుమ్- నీ సంకల్పిక్క వేణుమ్"(నీవు భావించాలి, నీవు సంకల్పించాలి అనే అర్థాన్ని వ్యాఖ్యాతలు గ్రహించారు. ,

**(ఇదమ్)** - నీ సంకల్పంవల్ల కల్గిన కాష్ఠాప్రాప్తదాస్యవహనం,

**(మజ్జన్మనః ఫలమ్)** - నేను జన్మ ఎత్తినదానికి ఇదే కదా ఫలం. భాగవతదాస్యం కంటే మోక్షాన్ని కూడా నేను ఫలంగా భావించను- అని భావం. "నాథేన తృణ మన్యదన్యదపి వా తన్నాభినాళీకినీ" అనే శ్లోకంలో భాగవతానుగ్రహంకంటే మోక్షఫలం వద్దు- అని ఆచార్యులు పలికారు.

**(మత్ప్రార్థనీయమదనుగ్రహ ఏష ఏవ)** - నాచే ప్రార్థించదగిన, నా విషయంలో నీవు చేయవలసిన అనుగ్రహం ఇదే.

**28. నాథే నః పురుషోత్తమే త్రిజగతామేకాధిపే చేతసా**
**సేవ్యే స్వస్య పదస్య దాతారి సురే నారాయణే తిష్ఠతి।**
**యం కంచిత్పురుషాధమం కతిపయగ్రామేశ మల్పార్థదం**
**సేవాయై మృగయామహే నరమహో మూఢా వరాకా వయమ్॥**

నః = మనకు, నాథే = ప్రభుడను, త్రిజగతాం = మూడు లోకములకు, ఏకాధిపే = ముఖ్యమైన పాలకుడును, చేతసా =మనస్సుచేత, సేవ్యే = కొలువదగినవాడును, స్వస్య = తనదైన, పదస్య = స్థానముయొక్క (శ్రీవైకుంఠము యొక్క) దాతరి = దాతయగు (ఇచ్చువాడగు) వాడును, పురుషోత్తమే = పురుషశ్రేష్ఠుడును, సురే = దేవుడైనవాడును అగు, నారాయణుడే = శ్రీమన్నారాయణమూర్తి, తిష్ఠతి సతి = ఉండగా, కతిపయగ్రామేశం = కొన్ని గ్రామములకు దొరయైనవాడును, అల్పార్థదం = స్వర్పమైన ధనముని ఇచ్చువాడును, పురుషాధమం = పురుషులలో అధముడైనవాడును అగు, యం కంచిత్ నరం = ఎవనినో ఒక మర్త్యుని, సేవాయై = కొలువుకొఱకు, మృగయామహే = వెదకుచున్నాము, అహో = అయ్యో, వయం = మనము, మూకాః = మూఢులము, వరాకాః = పనికిమాలినవారము.

అవ : ఈ విధంగా “సప్తపర్వవ్యవధానతుంగ” అయిన శేషత్వసీమను పొందే రీతిలోని మహాగుణాలను కలవాడు, “వేణ్ణిఱ్ఱెల్లామ్ తరుమ్” ఉభయవిభూతినాథుడైన నారాయణుండగా, క్షుద్రప్రభువులను ధనంకోసం అన్వేషించి వెళ్ళి, స్తుతించే జనాలను చూచి నిర్విణ్ణులై, "జనులారా! మీరు ఈ విధంగా క్షుద్రప్రభువులను ఆశ్రయించకండి” అని నమ్మాళ్వార్లు “శొన్నాల్ విరోద” మనే దశకంలో “మానిడమ్ పాడవన్ద కవియేనల్లేన్ ”(మానవులను పాడడం కోసం వచ్చిన కవిని కాదు), “మానిడత్తు క్కవి పాడియెన్?”(మానవులను కీర్తించి ఏమి ప్రయోజనం?), “నుమ్ వాయ్ పిఱ్ఱక్కుమ్ పులవీర్ కాళ్! " (మీ వాక్కును పుష్పలం చేసుకొనే కవులారా!) ఇత్యాదులలో నేను మనుష్యాదులను పాడే కవిని కాను. మీరు మానవాధములను స్తుతించి మీ వాక్కును నిష్ఫలం చేసికొంటున్నారు. “మిన్నార్ మణిమణి విణ్ణవర్ తాదైయై ప్పాడినాల్”

(గొప్పగా ప్రకాశించే కిరీటాన్ని గల నిత్యసూరినాధుని కీర్తిస్తే) సకల సంపత్తులు తామే కల్గుతాయి –అని ఉపదేశించినట్లు, "నేను కూడా ఉపదేశిస్తే, సామాంతరాజుల పట్ల అసూయతో పల్కుతున్నాని తలుస్తార"ని తలచి, తమనే నాథత్వపురుషోత్తమత్వాదిగుణగణపరిపూర్ణుడైన నారాయణుడుండగా, క్షుద్రప్రభువులను ఆశ్రయించాలని మహాపరాధకుడనైన నేను అన్వేషిస్తున్నానే! అయ్యో! అని గర్హిస్తున్నారు. తమను నిందించుకొంటే, దీనిని చూచినవారు స్వయంగా క్షుద్రప్రభువుల సేవనుండి నివర్తిస్తారని ఉద్దేశ్యం.

వ్యాఖ్య : **(నాథ ఇతి) (నః నాథే)**- "త్వన్నాథోఽ నాథవద్రామ రాక్షసైః వధ్యతే భృశమ్" (నిన్ను నాథునిగా కలిగిన మేము అనాధులం వలె రాక్షసులచే వధింపబడుతున్నాము) అని ఋషులకు నాథుడైనట్లే, మనకు కూడా నాథుడై ఉన్నాడు. క్షుద్రప్రభువులు నాథులు కారు. మఱి ఎవరు? అంటే, "జ్ఞాతిదాసీ యతోజాతా" అనే విధంగా "యం కంచిత్" అని చెప్పవచ్చు తప్ప, 'ఇతడు" అని విశేషించి పలుకరాదని భావం.

**(పురుషోత్తమేన)** - అర్థిజనం సమీపించేటపుడు వారికి ఎదురేగి పిలిచి, "దోర్భ్యామ్ పర్యగ్రహీన్ముదా" (బాహువులతో ఆనందంగా దగ్గరకు తీసుకున్నాడు) అని ఆలింగనం చేసికొని, అడగడానికి ముందుగానే వారి భావం గ్రహించి, వాంఛితాధికప్రదుడై ఉన్నందున అతడు పురుషోత్తముడు. ఈ క్షుద్రప్రభువులు అయితే, అర్థిజనం వచ్చినపుడు "నిద్రాతి స్నాతి భుంక్తే" (నిద్రపోతున్నాడు, స్నానం చేస్తున్నాడు, భుజిస్తున్నాడు, తరువాత రండి) ఇత్యాది రీతిలో ద్వారపాలకుల ద్వారా "ఇది సమయం కాదు" అని చెప్పించడం, కంటికి కన్పిస్తే చిటపటలాడి కోపించడం చేస్తారు కనుక, వారు పురుషాధములు.

**(త్రిజగతా మేకాధిపే)** - "న తస్యేశే కశ్చన" (అతనిని నియమించేవారు ఎవరూ లేరు) అని అతనికి పైన నియంత ఎవరు లేరు- అనే విధంగా ముల్లోకాలకు అధికుడై ఉంటాడు.

ఈ విధమైన ప్రభావమున్నా, పరమసులభుడై ఉన్నాడని భావం. ఇక క్షుద్రప్రభువు అయితే,

**(కతిపయగ్రామేశ మల్పార్థదమ్)** - అనే రీతిలో ఉంటాడు. రెండు మూడు గ్రామాలకు మాత్రం ప్రభువై, దుర్జనసార్వభౌముడై, అర్థిజనులను పలుమార్లు తన చుట్టూ తిరిగేటట్లు చేసి, దురారాధ్యుడై, చివరకు కొంచెం కూడా ఇవ్వడు. లేక, ఇచ్చినా అత్యల్పంగా ఇస్తాడు.

**(చేతసా సేవ్యే స్వస్య పదస్య దాతరి)** - భగవానుడు మనస్సుతో స్మరించినంత మాత్రంలో స్వారాధ్యుడై, తన స్థానాన్ని కూడా ఇస్తాడు.

**(సుఖే)** - ఇచ్చేటపుడు వచ్చిన యాచకుడు భీతిల్లి దుఃఖపడేటట్లు ముఖంలో చిటపటలాడుతూ ఉండే క్షుద్రప్రభువువలె కాకుండా, ప్రసన్నముఖుడై అర్థిజనులకు సుఖావహుడై ఉంటాడు. ఇక్కడ సుఖపదానికి సుఖావహపర్యంతంగా లక్షణ. లేక, "సుఖవిశిష్టే"–అర్థిజనులకు ఫలప్రదానం చేసినందువల్ల స్వామికి కల్గిన సుఖాన్ని ఈ సుఖశబ్దం తెల్పుతున్నదని చెప్పవచ్చు. అర్థులకు ఫలప్రదానం చేసేటపుడు తనకు కొంచెంకూడా సుఖం లేకుండా పోవడంతోపాటు మహాదుఃఖాన్ని పొందుతాడు.

**(నారాయణే)** - మనకు, క్షుద్రప్రభువులకు మధ్య ఏ సంబంధం లేకపోవడంవలె కాకుండా, శరీరాత్మభావ- కార్యకారణభావ–స్వస్వామిభావాది పలు సంబంధాలు కలవాడు.

**(తిష్ఠతి సతి)** - ఇటువంటి నారాయణుడు. "ఎల్లామ్ తరుమ్ నమ్మత్తిగిరినాదన్ తిరుమాల్" (అన్నిటినీ అనుగ్రహించే మన హస్తిగిరినాథుడు మాధవుడు) అని యాచకులు ఎపుడు వస్తారో- అని జాగరూకుడై, సేవాదులను చేస్తున్నామని అన్నా, కంటికి కన్పించకుండా మఱుగుపడి ఉండే ఒక పురుషాధముని కోసం మనం అన్వేషిస్తున్నామే! అయ్యో! అయ్యో! - అని అంటున్నారు–

**(మృగయామహే)** - అని అంటూ, .

**(వరాకాః వయం మూకా స్సంతః నరం మృగయామహే, అహో!)** అని అన్వయం. క్షుద్రమానవుని వద్ద యాచించాలని వెళ్ళినపుడు, కొందఱు ధార్మికులు చేరి, మనలను మనస్సు మార్చాలనే అభినంధితో "ఎక్కడికి పోతున్నావు?" అని మనలను అడిగితే, "మనం పోయేచోటికి వీరు కూడా రావాలని తలచి ఈవిధంగా అడుగుతున్నారు. నిజం చెబితే, మనకు రాబోయే ఫలం తగ్గిపోతుంది" అని తలచి, వారికి ఏమీ బదులు చెప్పకుండా మూగవానివలె మిన్నకుండి, ఆ పురుషుడుండే చోటికి అన్వేషించి వెడతాము- అని భావం. అహో! కష్టం! ఇదేమి కష్టం! " మనం చాలా చెడ్డవారం -అని మనలను అన్వేషిస్తున్నారు" అని ఈ ఘట్టంలోని తాత్పర్యం "వయమ్" అనే బహువచనం ద్వారా క్షుద్రసేవను చేసేవారితో తనను ఒకరిగా చేర్చి పల్కినట్లయినది. నమ్మాళ్వార్లు కూడా "ఎన్నావదు?" అనే పాశురంలో అస్థిరుడైన మానవుని కీర్తిస్తే, ఏమి ప్రయోజనం పొందుతారు? ఒకవేళ ఏదయినా ఫలాన్ని పొందినా, అది ఎన్నాళ్ళకు సరిపోతుంది? ఓ కవులారా! అందువల్ల మెఱిసే కిరీటాన్ని కలవాడు, దివ్యసూరినిర్వాహకుడు, నిరవధిక నిత్యనిర్దోష కల్యాణగుణాలతో మీ కవిత్వాన్ని కృతార్థం చేయగలవాడై, మీకు అడిగినదానిని అంతటిని ఇచ్చే మహోదారుడై, అన్నీ ఇచ్చినా ఏమీ ఇవ్వనివానివలె, "వీరికి ఏమి చేశాను? ఏమీ చేయలేదే! ఇంకా ఇంకా ఏమి చేయాలి! " అని తలచే స్వభావాన్ని కల ఆశ్రితసులభుడై ఉండే భగవంతుని కీర్తించి ఉజ్జీవించండి. కవిత్వం పల్కితే వేఱొక ప్రయోజనం కావాలా? కావాలంటే మోక్షాంతమైన సంపదను ఇస్తాడు- అని పలికారు.

**29. మదన! పరిహర స్థితిం మదీయే**
**మనసి ముకుంద పదారవింద ధామ్ని।**
**హరనయన కృశానునా కృశోऽసి**
**స్మరసి న చక్రపరాక్రమం మురారేః।।**

మదన = ఓ మన్మథుడా!, ముకుంద = విష్ణువుయొక్క, పదారవింద = కమలములవంటి పాదములకు, ధామి = స్థానమైనట్టి, మదీయే = నాదైన, మనసి = మస్సునందు, స్థితిం = బసచేయుటను, పరిహర = పోగొట్టుము (త్వం = నీవు), హర = ఈశ్వరుని యొక్క, నయన =తృతీయ నేత్రము యొక్క, కృశానునా = అగ్నిచేత, కృశః = సన్నగిల్లినవాడవు (బూడిదయైన వాడవు), అసి = అయితివి, మురారేః = శ్రీకృష్ణుని యొక్క, చక్ర పరాక్రమం =సుదర్శనమను చక్రము యొక్క బలిమిని, న స్మరసి = తలంపవయితివి.

**అవతారిక:**

పూర్వశ్లోకంలో అర్థప్రావణ్యాన్ని నిరసించారు ఇందులో కామప్రావణ్యాన్ని నిరసిస్తున్నారు.

**వ్యాఖ్య : (మదనేతి)** ఓ మన్మథా! - ఇంతవరకే నా మనస్సును వశీకరించుకొని, నా మనస్సులో ఉండగలిగానని ఆనందించావు. ఇకపై వీలు కాదు. ఎందుకంటే- ముకుందుడు నా మనస్సులో నిత్యవాసం చేయడానికి తామరవలె మిక్కిలి అందమైనవి, అతిసుకుమారమైనవి తన శ్రీచరణాలను పెట్టాడు. "అయితే ఏమి! అక్కడ నాకు ఏం భయం! " అనిచెప్పకు. ఆ ముకుందుని పౌత్రుడైన రుద్రుని నేత్రాగ్ని ప్రభావంవల్ల భస్మమయ్యావు. తప్ప, ఇంతవరకు ముకుందుని సుదర్శనచక్ర ప్రభావాన్ని నీవు స్మరించలేదు. ఆ స్మరణం కలిగే అవకాశం నీకు లేదు. రుద్రనేత్రాగ్ని నీ శరీరాన్ని మాత్రమే రూపుమాపింది. చక్రం నీ స్వరూపాన్నే నశింపజేస్తుంది. అందువల్ల నా మనస్సులోనుండి శీఘ్రంగా వెళ్ళిపో—అనేది శ్లోకతాత్పర్యం.

**(మదీయమనసి స్థితిం పరిహర)** - ముకుందుని చరణం వర్తించని లోకుల మనస్సులో నీవుండవచ్చు. నా మనస్సులో మాత్రం ఉండలేవు - అని భావం. ఒకవేళ ఉంటే, దానివల్ల కలిగే హానిని శ్లోకం ఉత్తరార్ధంలో పల్కుతున్నారు.

**(కృశోఽసి)** - అనంగుడనే పేరు కలిగేటట్లు దగ్ధశరీరుడై ఉన్నాడని భావం.

**(చక్రపరాక్రమం న స్మరసి)** - ముకుందుని చక్రపరాక్రమం గూర్చి నీకు అనుభవంలో లేనందున నీకు స్మరణం లేదు. అందువల్ల నేనున్నాని హేతువాదం చేయకు. ఆ హేతువాదం చేస్తే నీస్వరూపం కూడా నశిస్తుంది. మురాసురుడు పడిన పాట్లను పడతావు, జాగ్రత్త!. అతి శీఘ్రంగా నా మనస్సునుండి తొలగిపో- అని భావం.

**30. తత్త్వం బ్రువాణాని పరం పురస్తాత్**
**మధు క్షరంతీవ సతాం ఫలాని।**
**ప్రావర్తయ ప్రాంజలి రస్మి జిహ్వే!**
**నామాని నారాయణాగోచరాణి॥**

జిహ్వే = ఓ నాలుకా!, పరం తత్త్వం బ్రువాణాని =మిక్కిలి సత్యాన్ని చెబుతున్నాను, సతాం పురస్తాత్= మంచివారి సమక్షంలో, మధు క్షరంతీవ= తీవ మకరందాన్ని ఒలికిస్తున్నవి, ఫలాని =అందుచేత ఫలరూపాలైన, నారాయణ గోచరాణి= నారాయణుని ప్రతిపాదించే, నామాని= తిరునామాలను చెప్పు. ప్రాంజలిః అస్మి= అంజలి చేస్తున్నాను,

**అవతారిక :**

ఈ విధంగా మనస్సును కామాదులు విడచిపోయినా, జిహ్వ తోచినదానిని పల్కుతూ ఉంటే ఏమి చేయాలి?– అని కలత చెంది, జిహ్వను చూచి సాంజలి బంధంతో ప్రార్థిస్తున్నారు.

**వ్యాఖ్య** : ఓ జిహ్వే! నీకు దండం పెడతాను. తోచిన దానినంతటినీ పలుకకుసుమా! భగవన్నామాలను చెప్పు. నామోచ్చారణాన్ని చేస్తే ఏమి ఫలం వస్తుంది? - అని అంటే, వేఱొక ఫలం కావాలా? అదే స్వయంప్రయోజనంకదా! అది ఏ విధంగా అంటావా ? ఆ నామాలు సత్పురుషుల ముందు మధుప్రవాహాలవలె కదా ఉంటాయి. మధుపానానికి వేఱక ప్రయోజనం కావాలా ? ఏమి? నీకు తత్త్వస్థితిని గూర్చి స్పష్టంగా పలికాను. మిథ్య కాదు- అని జిహ్వను ప్రార్థిస్తున్నారని శ్లోకతాత్పర్యం.

**(తత్త్వం బ్రువాణాని)** - యథార్థతత్త్వాన్ని పల్కుతున్నాను. అసత్యం పల్కుతున్నానని భావించను.

**(నారాయణగోచరాణి)** - నారాయణనామాన్నే చెప్పాలనే నిర్బంధం లేదు. నీవు పలికే నామానికి నారాయణుడు ప్రతిపాద్యార్థమై ఉండాలి, అంతే. అవి ఏవి?అంటే, "విశ్వం, విష్ణుః" ఇత్యాది సహస్రనామాలు. వానిని, ఇంకా ఉండే భగవన్నామాలను చెప్పు.

**(సాంజలి రస్మి)** - నీకు అంజలి చేస్తున్నాను.

**31. ఇదం శరీరం పరిణామపేశలం**
**పతత్యవశ్యం శ్లథసంధిజర్జరమ్।**
**కిమౌషధై: క్లిశ్యసి మూఢ! దుర్మతే!**
**నిరామయం కృష్ణరసాయనం పిబ॥**

ఇదం శరీరం = ఈ నశించెడు స్వభావముగల దేహము, పరిణామ పేశలం = ముదిమి మొదలగు మార్పులు పొందినదై, శ్లథ = వీడినట్టి, సంధి = కీళ్ళుగలది కనుకనే, జర్జరం = శిధిలమైనది, అవశ్యం = తప్పకుండా, పతతి = భూమిపై పడిపోవుచున్నది, మూఢ = జ్ఞానములేని వాడా, దుర్మతే = దుష్టబుద్ధిగలవాడా, ఔషధైః= మందులచేత, కిం=ఏల, క్లిశ్యసి = కష్టపడుచున్నావు?, నిరామయం = ఆరోగ్యకరమైన, కృష్ణ రసాయనం = శ్రీకృష్ణుడను రసాయనమును, పిబ = పానము చేయుము.

**అవతారిక :**

ఆరోగ్యాదిసిద్ధ్యర్థం ఔషధాలను అన్వేషించే బుద్ధిని చూచి ఇందులో పల్కుతున్నారు.

**వ్యాఖ్య** : **(ఇదమితి)** - **(హే మూఢదుర్మతే)** - స్వయంగా మూఢమై, దుష్టమై ఉండే ఓ బుద్ధీ! స్వయంగా సారాసారవివేకాన్ని చేయడం తెలియలేని మూఢత్వాన్ని కల్గి ఉండడంతో పాటు, చెప్పినదానిని వినకపోవడమనే దుష్టత్వాన్ని కూడా కల్గి ఉన్నది.

**(ఇదం శరీరమ్)** - ఔషధాలను సేవించి, బలాన్ని సంపాదించాలనిపించే ఈ శరీరం.

**(పరిణామ పేశలమ్)** - పరిణామాన్ని చెంది, మృత్యువాత పడుతుంది. ఔషధాలను సేవించడంచేత దృఢమయే ఈ శరీరంకూడా, ముసలితనం వస్తే ఆ దార్ఢ్యం అంతా పోయి, చివికి చివికి అత్యంతం సుకుమారమై పోతుంది. అంతేకాక,

**(శ్లథసంధిజర్జరమ్)** - విడివడిన సంధిబంధాలతో జీర్ణమై పోతుంది. ఇంతేనా!, ఇంతేకాక,

**(పతతి)** - చివరకు మరణించి, కిందకు పడిపోతుంది. ఒకవేళ పడకుండా ఉంటుందా ? అంటే,

**(అవశ్యం పతతి)** - ఇందులో ఏ సందేహం లేదు. శరీరశబ్దార్థాన్ని చూస్తే కూడా విశీర్ణస్వభావాన్ని కల్గినదనే అర్థంలో సంశయం. ఏమీ కలుగదు. ఈ విధంగా ఉండగా,

**(కి మౌషధైః క్లిశ్యసి?)** - కటు కషాయతిక్తమయాలైన ఔషధాల సేవతో ఎందుకు క్లేశపడతావు? కష్టాలను సహించి, ఔషధసేవను చేసినా, వ్యాధి తీరి పూర్తిగా తీరిపోతుందనే నిశ్చయం లేదు. దృఢత్వం కలుగదు. లేక, వ్యాధి నివర్తిస్తుందనే నిశ్చయం కల్గినా, ముసలితనం రాగానే జీర్ణమై, మరణిస్తుంది- అని భావం. అందుల్ల,

**(నిరామయం కృష్ణరసాయనం పిబ)** - సంసారవ్యాధులు మొదలైనవానిని తీర్చే రీతిలోనిది, పానం చేసే సమయంలో అతిభోగ్యంగా ఉండే శ్రీకృష్ణుడనే రసాయనాన్ని పానం చేయి. ఈ రసాయనాన్ని చూచిన మాత్రంలోనే సంసారాది సకల వ్యాధులు పరుగెత్తిపోతాయి.

**(పిబ)** - రస్యంగా పానం చేయి.

**32. దారా వారాకరవరసుతా తే తనూజో విరించి:**
**స్తోతా వేద స్తవ సురగణో భృత్యవర్గ: ప్రసాద:।**
**ముక్తిర్మాయా జగదవికలం తావకీ దేవకీ తే**
**మాతా మిత్రం బలరిపు సుత స్త్వయ్యతోఽన్య న్న జానే॥**

వారాకర వరసుతా = సముద్రములలో మేటియైన పాలకడలి పట్టి లక్ష్మీదేవి, తే = నీయొక్క, దారాః= ప్రియురాలు, విరించిః = బ్రహ్మ, తే= నీకు, తనూజః = కుమారుడు, వేదః = ఋుగ్యజుస్సామాథర్వణ వేదములు, స్తోతా = స్తుతిపాఠకుడు (తట్టువాడు), సురగణః = దేవతాసమూహము, భృత్యవర్గః = పరిచారకుల గుంపు, ముక్తిః = మోక్షము, ప్రసాదః = నీ అనుగ్రహము, అవికలం = సమస్తమైన, జగత్ = ప్రపంచము, తావకీ = నీయొక్క, మాయ = ప్రకృతి, దేవకీ = దేవకీదేవి, తే = నీయొక్క, మాతా = తల్లి, బలరిపుసుతః = అర్జునుడు, తే = నీ యొక్క, మిత్రం = స్నేహితుడు, అతః అన్యత్ = ఇంతకంటె ఇతరమును, త్వయి = నీయందున, న జానే = ఎఱుంగను.

అవ : ఓ ఆళ్వార్లూ! "నామాని నారాయణగోచరాణి" ఇత్యాదులతో "నా నామాలను పల్కు"- అవి మీ కరణాలను విధించే రీతిలో, నాలో మాహాత్మ్యపాదక గుణాలున్నాయా ? అని భగవంతుడు అనగా, బదులు. పల్కుతున్నారు.

వ్యాఖ్య : **(దారా ఇతి) - (తే దారాః వారాకరవరసుతా)** "సముద్ర ఇవ గాంభీర్యే" అని లోకంలో గంభీరవస్తువులకు దృష్టాంతంగా చెప్పబడేది సముద్రం, సముద్రాలలో శ్రేష్ఠం క్షీరసముద్రం, ఆ క్షీరాబ్ధియొక్క సుత, భూదేవి నీకు "మలర్ మకళ్ కైవరుడ"(లక్ష్మీదేవి చేతులలతో సంవాహనం చేయగా), "మలర్ మకళ్ మ*ఱ్ఱ* నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై" (లక్ష్మీదేవి, అంతేకాకుండా, భూదేవి సంవాహనం చేసే సుకుమారమైన పాదాన్ని) అనే విధంగా ఉచితకాలంలో పాదనం వాహనం చేసే భార్యలయై ఉండేటపుడు, నీ మహిమ పరిచ్ఛేదించి పలుకడానికి సాధ్యం కాదని భావం. "అప్రమేయం హి తత్తేజో

యస్య జనకాత్మజా” (జానకి ఎవరి భార్యయో, ఆ శ్రీరాముని తేజస్సు అపరిమితమైనది) అని కదా చెప్పబడుతున్నది.

**(తే విరించః తనూజః)** నీ పుత్రుడైతే, సర్వస్రష్ట అయిన బ్రహ్మ,

**(స్తోత్రా వేదః)** - పొగడే భట్టులవలె నిన్ను స్తుతించేవాడు వేదపురుషుడు.

**(తవ సురగణః భృత్యవర్గః)** - సర్వజనులచే యాగాదులలో కీర్తింపబడే ఇంద్రాదిదేవగణాలు నీ కనుబొమల కదలికలకు లోబడి వర్తిస్తారు.

**(ప్రసాదః ముక్తిః)** - నీ ప్రసాదాన్ని (అనుగ్రహఫలాన్ని) గమనిస్తే, అది అల్పం కాదు, మోక్షాంతంగా కల్గుతుంది. ఇక్కడ ముక్తిః అంటే ముక్తిహేతువని అర్థం.

**(అవికలం జగత్ మాయా తావత్)** - అఖిలజగత్తు నీ మాయ కారణంగా ఏర్పడినది. మాయ అంటే సంకల్పం.

**(తే మాతా దేవకీ)** - పూర్వయుగంలో పృశ్ని అనే పేరును కలిగి, గొప్ప తపస్వినియై, దేవగురువుకు పుత్రిక అయిన దేవకి నీ తల్లి. “పెఱ్ఱ తాయిన మాయిన శెయ్యుమ్” అనేవిధంగా సంతానం విషయంలో తండ్రి కంటే తల్లి మిక్కిలి శరీరపోషణ చేస్తుంది కనుక, తండ్రిని పలుకకుండా తల్లిని పేర్కొనడం జరిగింది.

**(మిత్రం బలరిపుసుతః)** - నీకు మిత్రం అర్జునుడు. అతడు సవ్యసాచి.

**(అతః అన్యత్ త్వయి న జానే)** - నీపట్ల ఇంతకంటే మహాత్మాన్ని కల్గించే గుణాన్ని నేను తెలియలేను. వీటిలో ఒక్కొక్కటే మాహాత్మ్యాన్ని కల్గించేవై ఉండగా, ఇన్నీ చేరితే ఇక ఇంకా ఏమైనా కావాలా ? అందువల్ల నీవే మహాత్ముడవు. నీ నామోచ్చారణమే సంసారోత్తారకమని భావం.

**33. కృష్ణో రక్షతు నో జగత్త్రయ గురు: కృష్ణం నమధ్వం సదా**
**కృష్ణేనామరశత్రవో వినిహితా: కృష్ణాయ తుభ్యం నమ:।**
**కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహం**
**కృష్ణే తిష్ఠతి సర్వమేతదఖిలం హే కృష్ణ! రక్షస్వ మామ్ ॥**

జగత్రయగురుః = మూడులోకములను పాలించునట్టి, కృష్ణః = శ్రీకృష్ణుదు, నః = మనలను, రక్షతు = కాపాడునుగాక, అహం = నేను, కృష్ణం = శ్రీకృష్ణమూర్తిని, సదా నమధ్వం = సదా నమస్కరించు, కృష్ణేన = శ్రీకృష్ణుని చేత, అమరశత్రవః = దేవతా విరోధులైన రాక్షసులు, వినిహతాః = చంపబడిరి, కృష్ణాయ తస్మై = ఆ శ్రీకృష్ణుని కొఱకు, నమః = నమస్కారము, కృష్ణాదేవ = శ్రీకృష్ణునివలననే, ఇదం జగత్ = ఈ లోకమంతయు, సముత్థితం = పుట్టినది, అహం = నేను, కృష్ణస్య = శ్రీకృష్ణునికి, దాసః = దేవకుడను, అస్మి = అగుచున్నాను, కృష్ణే = శ్రీకృష్ణునియందు, సర్వం ఏతత్ = ఈ ప్రపంచమంతయు, అఖిలం = నశింపకుండ, తిష్ఠతి = ఉన్నది, హే కృష్ణ = ఓ శ్రీకృష్ణా!, మాం = నీ సొత్తయిన నన్ను, రక్షస్వ = కాపాడుము.

**అవతారిక:**

పూర్వం శ్రీకృష్ణమాహాత్మ్యాన్ని గూర్చి పల్కి, ఇందులో ఇటువంటి మహాత్ముడు నన్ను రక్షించాలని అంటున్నారు.

**వ్యాఖ్య : (కృష్ణ ఇతి)** - మన అజ్ఞానాన్ని తీర్చి, మనలను రక్షించాలి, లోక త్రయంయొక్క అజ్ఞానాంధకారాన్ని నాశం చేసేవాడు, మా అజ్ఞానాంధకారాన్ని నాశం చేయరాదా ? అని పల్కుతున్నారు—

**(కృష్ణో నో రక్షతు జగత్త్రయగురుః)** - అని అంటూ. "గుశబ్ద స్త్వంధకార స్స్యాత్ రుశబ్దః తన్నివర్తకః" (గు అనే పదం చీకటిని తెలుపుతుంది. రు అనే పదం దానిని పోగొట్టేదానిని

తెలుపుతుంది) అని కదా గురుశబ్దనిర్వచనం. "శ్రీకృష్ణుడు. ఉపాయానుష్ఠానం చేయకపోతే రక్షించడు. అందుచేత అతనిని నమస్కరించండి"- అని పల్కుతున్నారు. –

**(కృష్ణం నమధ్వం సదా)** - అని అంటూ. శ్రీకృష్ణుడు మన విరోధులను పోగొడతాడా ? అంటే, ఆశ్రితులైన దేవతలకు శత్రువులైన అసురుడు. శ్రీకృష్ణునిచే నిరసింపబడినట్లే, మనకు విరోధులైన పాపాలు కూడా నివర్తింపబడతాయి- అనే భావంతో పల్కుతున్నారు–

**(కృష్ణేనామరశత్రవో వినిహతాః)** - అని. వారి (దేవతల) కోసం తామే నమస్కరిస్తున్నారు

**(కృష్ణాయ తుభ్యం నమః)** - అని ఇక్కడ నమశ్శబ్దం శరణాగతిపరం. “కారణం తు ధ్యేయః”, “జగన్నిదాన మద్వంద్వం ద్వంద్వం వందామహే” (లోకానికి మూల కారణం, ద్వంద్వరహితం అయిన భగవంతుని చరణాలను రెండిటిని నమస్కరిస్తున్నాము) అని కారణభూతవస్తువుకు కదా, ధ్యానప్రణామాదులు చేయవలసి ఉన్నది. ఇతనికి కారణత్వమున్నదా? అంటే, సమాధానం పల్కుతున్నారు–

**(కృష్ణాదేవ సముత్థితం జగదిదమ్)** - అని. ఇక్కడ “కృష్ణాత్" అని 'హేతౌ పంచమి”. దీనివల్ల ఉపాదాన, నిమిత్తాలనే రెండు కారణాలు శ్రీకృష్ణునకే ఉన్నాయని చెప్పబడింది. కైంకర్యాన్ని కూడా చేస్తానని పల్కుతున్నారు.

**(కృష్ణస్య దాసోఽస్మ్యహమ్)** - అని. సర్వప్రపంచానికి శ్రీకృష్ణుడే ఆధారమై ఉన్నాడని అంటున్నారు.

**(ఏతత్ సర్వమ్)** - కనబడే అన్ని పదార్థాలు,

**(అఖిలమ్)** - శాస్త్రోక్తజ్ఞేయాలైన మిగిలిన పదార్థాలు,

**(కృష్ణే తిష్ఠతి)** - ఆధారం లేకపోతే ఆధేయానికి స్వరూపం నశిస్తుంది కదా!

**(హే కృష్ణ! సంరక్ష మామ్)** - నీ కార్యభూతుడనై, నీకు దాసభూతుడనై, నీచే ధరింపబడేవాడనైన నన్ను రక్షించు.

**(సంరక్ష)** - నీ అనుభవానికి అడ్డుగా ఉండే విరోధులకు నాశనం చేసి నీవే రక్షించాలి. ఈ శ్లోకంలో సప్తవిభక్తులు, సంబుద్ధి ప్రయోగింపబడ్డాయి.

## 34. తత్త్వం ప్రసీద భగవన్! కురు మయ్యనాథే
## విష్ణో! కృపాం పరమకారుణికః కిల! త్వమ్।
## సంసారసాగరనిమగ్న మనంతదీనం
## ఉద్ధర్తుమర్హసి హరే! పురుషోత్తమోఽసి॥

భగవన్ = ఓ భగవంతుడా, తత్ = ఆ కారణముచే, త్వం = నీవు, ప్రసీద = నాయందు కోపరహితచిత్తుడవై అనుగ్రహింపుము, విష్ణో = ఓ విష్ణువా, అనాథే = దిక్కు లేని, మయి=నాయందు, కృపాం = దయను, కురు =చేయుము (ఉంచుము), త్వం = నీవు, పరమ కారుణికః కిల = మిక్కిలి దయావంతుడవు కదా, హరే = ఓ హరీ, (అనంత = ఓ నాశరహితుడా), సంసారసాగరనిమగ్నం = సంసారం అనే సముద్రమునందు మునిగినవాడును, అనంతదీనం = మిక్కిలి దీనుడనగు, మాం = నన్ను, ఉద్ధర్తుం = లేవనెత్తుటకు, అర్హసి = తగియున్నావు, త్వం = నీవు, పురుషోత్తమః = పురుషులలో శ్రేష్ఠుడవు, అసి = అగుచున్నావు.

**అవతారిక:**

ఈ విధంగా ఇంతకు ముందు "కృష్ణాయ తుభ్యం నమః" అని శరణాగతిని చేసి, ఇక్కడ తమ ఆకించన్యానన్యగతిత్వాదులను వ్యక్తం. చేస్తూ, నీవే అనుగ్రహించాలని అంటున్నారు.

**వ్యాఖ్య : : (స ఇతి) - (హే భగవన్)** - నీవు షాడ్గుణ్యపరిపూర్ణుడవు కదా! త్రికాలజ్ఞుడవుకదా! నా ఆర్తిని, ఉపాయాంతరాలను అనుష్ఠించడంలో నా అశక్తిని చూచి గ్రహించలేవా ?- అని దీని తాత్పర్యం. నీకు శక్త్యాదులు లేవా?

**(సః)** - "పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే" (ఈ పరమాత్మయొక్క శక్తి అనేకవిధాలైనది అని వేదంలో చెప్పబడుతున్నది) ఇత్యాది క్రమంలో సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వ సర్వకారణత్వాదులలతో ప్రసిద్ధుడవై కదా ఉన్నావు.

**(ప్రసీద)** - ప్రపన్నుడవు కావాలి. నీవు అనుగ్రహించకపోతే, నన్ను అనుగ్రహించేవారు ఇంకెవ్వరూ లేరు- అని అంటున్నారు—

**(అనాథే)** - అని అంటూ. నాకు, నీవు తప్ప ఇంకొక నాథుడెవ్వరూ లేరు.

**(మయి)** - మహాపాపిష్ఠివాడనైన నాపట్ల,

**(హే విష్ణో!)** - "విష్ల - వ్యాప్తౌ" అని సర్వత్ర వ్యాపించి ఉండే నీకు, నాకు ఇంకొక నాథుడుంటే తెలియకుండా ఉంటుందా? అని భావం. స్వయంగా నిష్కరుణుడవై ఉంటే అనుగ్రహించడు. నీవు అటువంటివాడవు కావుకదా. పరమకారుణికుడవు కదా— అని అంటున్నారు.

**(పరమకారుణికః కిల త్వమ్)** - నీవు పరమకారుణికుడవనేది లోకశాస్త్ర ప్రసిద్ధమనే విషయం "కిల" అనే పదం ద్వారా వ్యంజితం. సముద్రంలో మునిగిన పురుషుడు దైన్యాన్ని వ్యక్తం చేస్తే, సమర్థుడైనవాడు అతనిని ఉద్ధరించడా! దేశతః, కాలతః, వస్తుతః, గుణతః, అపరిచ్ఛిన్నుడవు కనుక, అనంతుడనే తిరునామాన్ని కల నీవు సంసారసముద్రంలో మునిగిన నన్ను ఉద్ధరించాలని అంటున్నారు. శ్లోకం ఉత్తరార్ధంలో

**(దీనమ్)** - దరి చేరే ఉపాయం లేక, దీనుడనై ఉండే నన్ను,

**(ఉద్ధర్తు మర్హసి)** - నీకు సామర్థ్యం లేకపోతే నేను ప్రార్థించను. అనంతుడవు కనుక అర్హుడవు నీవు.

**(హరే!)** - అన్ని దుఃఖాలను హరించేవాడా!,

**(పురుషోత్తమ!)** పురుషోత్తముడవు కదా! - పురుషాధమునివంటివాడవా నీవు!
**(ఇమమ్)** - ఇటువంటి దయనీయదశను పొందిన ఈ జీవుని, (నన్ను**)**.

**(ఇమమ్)** - ఈ సర్వనామపదంతో తమనే నిర్దేశించుకొంటున్నారు.

**35) నమామి నారాయణపాదపంకజం**
**కరోమి నారాయణపూజనం సదా।**
**వదామి నారాయణ నామ నిర్మలం**
**స్మరామి నారాయణతత్త్వ మవ్యయమ్॥**

నారాయణ పాద పంకజం= శ్రీమన్నారాయణుని చరణకమలాలను, నమామి= నమస్కరిస్తున్నాను నారాయణ పూజనం =నారాయణుని పూజను, సదా= ఎల్లప్పుడు, కరోమి =చేయుచున్నాను, నిర్మలం= నిర్మలమైన, నారాయణ నామ =నారాయణుని నామాన్ని, వదామి = పలుకుతున్నాను, అవ్యయం = ఏ నాటికీ నశించని, నారాయణ తత్వం= నారాయణుడనే తత్వాన్ని, స్మరామి తలుస్తున్నాను.

**అవతారిక :**

ఈ విధంగా పూర్వం “నమః” అని అంటూ ద్వయంలోని పూర్వఖండార్థమైన శరణాగతిని చేసి, ఈ శ్లోకంతో ఉత్తరఖండార్థమైన కైంకర్యాన్ని మనోవాక్కాయాలతో చేస్తానని అంటున్నారు.

**వ్యాఖ్య : (నమామీతి) -**

"శాశ్వతీ మమ సంసిద్ధి రియం ప్రహ్వీభవామి యత్,
పురుషం పరముద్దిశ్య న మే సిద్ధి రితోఽన్యథా”

(పరమ పురుషుని ఉద్దేశించి నేను నమస్కరిస్తున్నాను అనేది ఏది ఉన్నదో, అదే నాకు శాశ్వతమైన సిద్ధి. దీనికి మించి వేరు రీతిలో నాకు సిద్ధి లేదు) అనే విధంగా సర్వకాయాలతో నమస్కారరూప కాయికవృత్తిని కూడా చేస్తానని అంటున్నారు- మొదటి పాదంలో. అర్ఘ్యపాద్యాచమనీయాది సమర్పణ పూర్వకార్చనాదులైన పూజనాన్ని సదా చేస్తానని రెండవ పాదంలో పల్కుతున్నారు. వాక్కుతో నిర్మలమైన నారాయణనామాన్ని పల్కుతున్నాను- అని మూడవ పాదంలో పల్కుతున్నారు. మనస్సుతో నారాయణుడనే పరతత్వాన్ని స్మరిస్తున్నానని అంటున్నారు, నాల్గవ పాదంలో.

**36. శ్రీనాథ! నారాయణ! వాసుదేవ!**
**శ్రీకృష్ణ! భక్తప్రియ! చక్రపాణే! ।**
**శ్రీపద్మనాభాచ్యుత!కైటభారే!**
**శ్రీరామ! పద్మాక్ష !హరే! మురారే!।**
**(శ్రీరంగనాథాయ నమో నమస్తే।।)**

శ్రీనాథ = శ్రీవల్లభా, నారాయణ = జలశాయి అయి ఉండువాడా, వాసుదేవ = వసుదేవుని పుత్రుడా, శ్రీకృష్ణ = ఓ శ్రీకృష్ణా, భక్తప్రియ = భక్తులకు ఇష్టుడైనవాడా, చక్రపాణే = సుదర్శనము అనే చక్రమును చేతిలో దరించినవాడా, శ్రీపద్మనాభ = ఓ పద్మనాభా, అచ్యుత = నాశరహితుడా, కైటబారే = కైటభుడను రాక్షసుని సంహరించినవాడా, శ్రీరామ = ఓ శ్రీరామమూర్తీ, పద్మాక్ష = కమలములను పోలిన కన్నులుకలవాడా, హరే = ప్రళయకాలమందు బ్రహ్మరుద్రాదులను అందరినీ హరించువాడా, మురారే = ఓ మురాంతకుడా.

**అవతారిక :**

నీ తిరునామాలను చెప్పగల్గిన శక్తిని కలవారైనా, ఎవరూ పల్కడం లేదు. జనులకు వ్యసనాలలో అభిముఖ్యం చాలా ఆశ్చర్యకరంగా ఉన్నది- అని ఇక రెండు శ్లోకాలతో పల్కుతున్నారు.

వ్యాఖ్య : **(హే శ్రీనాథేతి) - (హే శ్రీనాథ) -**
"స్థితయా పార్శ్వత శ్చాపి వాలవ్యజనహస్తయా,
ఉపేతం సీతయా భూయః చిత్రయా శశినం యథా",

(తన పక్కన వీవనను చేతిలో ధరించి ఉండే సీతతో కూడినవాడైన రాముని చిత్రా నక్షత్రంతో కూడిన చంద్రునివలె చూశాడు),

"వవందే వరదం వందీ వినయజ్ఞా వినీతవత్" అని శ్రీరాముడు సీతతో ఏకాసనంలో ఉండే అందాన్ని చూచి, జితుడై మహేంద్రుడు వందనం చేసినట్లే, వీరుకూడా లక్ష్మీదేవికి నాథుడై, ఆమెతో వేంచేసి ఉండే సొబగుకు జితులై, "హే శ్రీనాథ! (తే) నమః" అని అంటున్నారు.

**(నారాయణ)** - "నారాయణాఖిలగురో! భగవన్! నమస్తే" ఇత్యాది రీతిలో సర్వాధారత్వ సర్వకారణత్వ ప్రాప్యప్రాపకత్వాది గుణపూర్ణుడైన నారాయణుని నామానికి జితులై "నమః" అని పల్కుతున్నారు.

**(వాసుదేవ)** - ఈ విధంగా పరత్వమున్నా, సౌశీల్యంతో వసుదేవపుత్రుడై పుట్టాడు.

**(శ్రీకృష్ణ)** - "హే కృష్ణ! ద్వారాకావాసిన్! ", "హే కృష్ణ! హే యాదవ", "కృష్ణ కృష్ణారవిందాక్ష" అని పిలిచే రీతిలోని స్థితిని చూచి "నమః" అంటున్నారు.

**(భక్తప్రియ! చక్రపాణే)** - భక్తులుండే చోటులోని ప్రీతిచేత, ఆ భక్తుల విరోధులను నిరసించడంకోసం సుదర్శనాన్ని చేతిలో ధరించి ఉండే అందాన్ని చూచి, "నమః" అని అంటున్నారు.
**(శ్రీరామ! పద్మాక్ష!)** - "రమయతీతి రామః" అని స్వయంగా ఆనందింపజేయడంతోపాటు "రామో రాజీవలోచనః",

"కరియవాకి ప్పుడై పరన్దు మిళిర్ న్దు శెవ్వరియోడు నీణ్డ
అప్పెరియవాయ కణ్కళ్ ఎన్నై ప్పేదమై శెయ్ దనవే"
(నల్లనివై, వ్యాపించి, మెరిసి, ఎర్రని రేఖలను కలిగినవై, దీర్ఘాలైన శ్రీరంగనాథుని ఆ పెద్ద కన్నులు నన్ను ముగ్ధుని చేస్తున్నాయి)
అనే విధంగా తామరలవంటి తిరునేత్రాల సొబగుతో ఆనందింపజేస్తాయి- అని భావం.

**(హరే! మురారే!)** - సర్వపాపహరుడై, ఆశ్రితవిరోధి నిరసనశీలుడై ఉన్నాడు.

**(శ్రీరంగనాథాయ తే నమో నమః)** - ఆశ్రిత సులభుడై ఉండడం సువ్యక్తం శ్రీరంగాది దివ్యక్షేత్రాలలో నిత్యవాసం చేసే నీకు “నమో నమః” ఆదరాతిశయంతో నమశ్శబ్దానికి ద్విరుక్తి.

ఈ శ్లోకంలోని ఉత్తరార్థం ప్రకారాంతరంగా కొన్ని శ్రీకోశాలలో కన్పిస్తున్నది. ఏ విధంగా? అంటే, "శ్రీపద్మనాభ! అచ్యుత! కైటభారే! శ్రీరామ! పద్మాక్ష! హరే! మురారే! " అని. అపుడు పై శ్లోకంతో ఏకాన్వయంగా అర్థాన్ని గ్రహించాలి.

**37. అనంత! వైకుంఠ! ముకుంద! కృష్ణ!**
**గోవింద! దామోదర! మాధవేతి।**
**వక్తుం సమర్థోఽ పి న వక్తి కశ్చిత్**
**అహో! జనానాం వ్యసనాభిముఖ్యమ్॥**

అనంత = తుదలేనివాడా, వైకుంఠ = ఓ వైకుఠవాసా, ముకుంద = ఓ ముకుందుడా, కృష్ణ=ఓ కృష్ణమూర్తీ, గోవింద = ఓ గోవిందుడా, దామోదర = ఓ దామోదరుడా, మాధవ = ఓ లక్ష్మీవల్లభా, ఇతి = అని, వక్తుం = చెప్పుటకు, సమర్థోపి = శక్తిగలవాడైనను, కశ్చిత్ = ఒకడైనను, న వక్తి = చెప్పదు, అహో = అయ్యో, జనానాం = మూఢులకు, వ్యసనాభిముఖ్యం = దుఃఖములలో ఉత్సాహము ఎంతటిదో!

**వ్యాఖ్య : (అనంతేతి) -** "అనంతవైకుంఠ భగవన్నామాలను పల్కడంలో సమర్థులైనా, ఎవరూ చెప్పడం లేదు. జనాలకు వ్యసనాన్ని కల్గించే విషయాలలో ఇదేమి ఆభిముఖ్యం? ఇదేమి ఆశ్చర్యం! అని అంటున్నారు.

**38. ధ్యాయంతి యే విష్ణు మనంతమవ్యయం**
**హృత్పద్మమధ్యే సతతం వ్యవస్థితమ్।**
**సమాహితానాం సతతాభయప్రదం**
**తే యాంతి సిద్ధిం పరమాంచ వైష్ణవీమ్॥**

యే = ఎవరు, అనంతం = తుద లేనివాడును, అవ్యయం = నాశరహితుడును, సతతం = ఎల్లప్పుడు, హృత్పద్మమధ్యే = యోగులయొక్క మనసనెడు కమలముయొక్క మధ్యమునందు, వ్యవస్థితం = చక్కగా ఉన్నవాడును, సమాహితానాం = తనయందు ఏకాగ్రచిత్తులయినవారికి, సతతాభయప్రాం = ఎల్లప్పుడు అభయమును ఇచ్చువాడు అయిన,

విష్ణుం = విష్ణువును, ధ్యాయంతి = ధ్యానము చేయుచున్నారో, తే = వారు, పరమాం = ఉత్తమమైన, వైష్ణవీం = విష్ణు సంబంధియగు, సిద్ధిం = మోక్షమును (పరమపామును), యాంతి = పొందుచున్నారు.

**అవతారిక :**

ఈ విధంగా గడచిన శ్లోకంలో భగవద్భజనం చేయనివారిని నిందించి, ఇక్కడ భగవద్భజనం చేసేవారిని ఇందులో స్తుతిస్తున్నారు. సర్వాభీష్టాలను అనుగ్రహించేవాడై, తమ హృదయకమలంలో నిత్యం సన్నిహితుడై ఉండేవానిని ధ్యానించేవారు మోక్షసామ్రాజ్యాన్ని పొందుతారు- అని అంటున్నారు.

**వ్యాఖ్య : (ధ్యాయంతీతి) - (సమాహితానామ్)** - ఇతరవిషయవైరాగ్య పూర్వకంగా ప్రాపరుచితో ఆశ్రయించినవారికి— అని అర్థం.

**(సతతాభయ ప్రదమ్)** - తనను ఆశ్రయించినవారికి మోక్షదశలోవలె ఈ శరీరంలో ఉండేటపుడు కూడా అభయాన్ని ఇస్తున్నాడని తాత్పర్యం. భీతిహేతువులతో కూడా భీతి రాని రీతిలో రక్షించేవాడని భావం.

**(హృత్పద్మమధ్యే సతతం వ్యవస్థితమ్)** - "పద్మకోశప్రతీకాశమ్", "అథ యదిద మస్మిన్ బ్రహ్మవేశ్మ దహరం పుండరీకం వేశ్మ" చెప్పబడిన హృదయకమలంలో అన్ని కాలాలలోను నివసించేవాడు. "ఆశ్రితుడు ఎపుడు ఇతర వైరాగ్యం కల్గి, అంతర్ముఖుడై నన్ను ధ్యానిస్తాడో? ధ్యానించేటపుడు నేను సన్నిహితుడనై ఉండకుండా పోతే క్షణక్షణానికి బుద్ధి మాఱి, విషయపరవశుడై పోతాడు"- అని చింతించి, ఆశ్రితుడు ధ్యానించేటపుడు, తనను లేడని అనడానికి వీలు లేని రీతిలో సదా సన్నిహితుడై ఉంటాడని భావం.

అల్పమైన శరీరంలో 'ఉన్నందున అతనికి పరిచ్ఛిన్నత్వం ఉన్నదా ? అంటే, పల్కుతున్నారు.

**(విష్ణుమ్)** - “విష్ల్-వ్యాప్తౌ" అనే ధాతువునుండి నిష్పన్నమైన విష్ణుశబ్దానికి సర్వవ్యాపియై ఉండేవాడని అర్థం. "జ్యాయాన్ పృథివ్యా జ్యాయాన్ అంతరిక్షాత్" (పృథ్వి కంటే పెద్దవాడు, అంతరిక్షం కంటే పెద్దవాడు) అని శ్రుతికూడా హృదయంలో లోపల ఉన్నందున అల్పంగా ఉంటాడా ? అనే సందేహాన్ని తీర్చింది. అయితే, అతడెవరు? అంటే, పల్కుతున్నారు.

**(అనంతమ్)** - అనంతపదవాచ్యుడైన నారాయణుని– అని అర్థం. ఉపాధియైన హృదయానికి నాశం కలిగేటపుడు అతనికి నాశం ఉన్నదా? అంటే, బదులు పల్కుతున్నారు.
**(అవ్యయమ్)** - నాశరహితుడై ఉండేవానిని,

**(ధ్యాయంతి)** - ఎవరు ఉపాసిస్తారో,

**(తే పరమాం వైష్ణవీం చ సిద్ధం యాంతి)** -

“లోకేషు విష్ణో ర్నివసంతి కేచిత్ సమీప మృచ్ఛంతిచ కేచిదన్యే,
అన్యే తు రూపం సదృశం భజంతే సాయుజ్య మన్యే స తు మోక్ష ఉక్తః"

(కొందరు విష్ణులోకంలో నివసిస్తున్నారు, మరి కొందరు విష్ణుసామీప్యాన్ని కోరుతున్నారు, మరికొందరు అతని రూపంవంటిన రూపాన్ని పొందుతున్నారు. మరికొందరు అతనితో సాయుజ్యాన్ని పొందుతున్నారు. అదే మోక్షమని చెప్పబడుతున్నది)అనే రీతిలో

సాలోక్యసారూప్యాదులను పొందడం కాక సాయుజ్యాన్ని పొందుతారనే భావం “పరమామ్” అనే పదం ద్వారా చెప్పబడింది.

## 39. క్షీరసాగర తరంగశీకరాసారతారకిత చారుమూర్తయే। భోగిభోగశయనీయశాయినే మాధవాయ మధువిద్విషే నమః॥

క్షీరసాగర = పాలసముద్రమునందలి, తరంగ = అలలయొక్క, శీకర = తుంపురులయొక్క, అసార = ఎడతెగని వానన చేతను, తారకిత = ముత్యాలహారము ధరించునట్లుండు, చారు = అందమైన, మూర్తయే = శరీరముగలవాడును, భోగి = ఆదిశేషునియొక్క, భోగ=శరీరమనెడు, శయనీయ = పానుపుయందు, శాయినే = పరుండినట్టివాడును, మధువిద్విషే = మధువను రాక్షసుని సంహరించిన, మాధవాయ = మాధవుని కొఱకు, నమః = ప్రణామము.

**అవతారిక :**

ఈ విధంగా శ్రీకృష్ణునకు స్తుతినమస్కారాదులను చేసి,

"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః,
నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్"

(పాలసముద్రాన్ని నివాసంగా కలిగిన ఈ శ్రీమన్నారాయణుడు ఆదిశేషుడనే పర్యంకాన్ని విడిచిపెట్టి మధురానగరానికి వచ్చాడు) అనే విధంగా, శ్రీకృష్ణునకు మూలపురుషుడైన క్షీరసముద్రశాయిని నమస్కరిస్తూ స్తుతిని నిగమిస్తున్నారు.

వ్యాఖ్య : **(క్షీరేతి)** జితరిపుడై, లక్ష్మీదేవితో కలసి క్షీరాబ్ధిలో ఆదిశేషశయనతల్పుడైన స్వామి నిద్రించేటపుడు, నక్షత్రాలతో అలంకరింపబడినట్లుగా చాలా తెల్లని కెరటాల

బిందువులతో అలంకృతమై, అందువల్లనే అందమైన ఆ స్వామి తిరుమేనిని భావించి, దాని అందానికి జితులై “నమః” అని అంటున్నారని ముఖ్యతాత్పర్యం.

**(తారకిత)** - సంజాతతారకంగా చేయబడిన– అని అర్థం. అంటే–బిందువులను చూస్తే నీలమైన తిరుమేనిలో నక్షత్రాలవలె ఉన్నాయని భావం.

**40. యస్య ప్రియౌ శ్రుతిధరౌ కవిలోకవీరౌ**
**మిత్రే ద్విజన్మవరపద్మ శరా వభూతామ్।**
**తేనాంబుజాక్ష చరణామ్బుజ షట్పదేన**
**రాజ్ఞా కృతా కృతిరియం కులశేఖరేణ॥**

యస్య = ఏ కులశేఖరులకు, ప్రియౌ = ఇష్టులును, శ్రుతిధరౌ = వేదార్థములను చక్కగా ఎఱిగినవారును, కవిలోకవీరౌ = కవులలో శ్రేష్ఠులును అగు, ద్విజన్మవర, పద్మశరౌ అభూతాం = ద్విజన్మవరుడు, పద్మశరుడు (వాల్మీకి, నమ్మాళ్వార్లు అని పెద్దల నిర్వాహం) అను ఇరువురు, మిత్రే = మిత్రులలో, అంబుజాక్షచరణాంబుజ షట్పదేన = కమలపత్రాక్షుడగు శ్రీమన్నారాయణుని పాదారవిందములందు తేనెటీగవంటివాడగు, తేన రాజ్ఞా కులశేఖరేణ = ఆ ప్రభువగు కులశేఖరులచేత, ఇయం కృతిః = ఈ ముకుందమాల అను కావ్యము, కృతా = చేయబడినది.

**నిగమనం :**

తమ పేరుతో అంకింతం చేస్తూ ప్రబంధాన్ని పూర్తి చేస్తున్నారు.

**వ్యాఖ్య : (యస్యేతి)** శ్రుతిధరౌ వేదాధ్యయనాన్ని చేసి, మఱువకుండా నిత్యం స్వాధ్యాయశీలురై, వేదాన్ని ధరిస్తూ ఉన్నారని భావం.

**(శ్రుతిధరౌ)** - సర్వాభివ్యంజక శ్రుతులను ధరిస్తున్నారు. ఆళ్వార్లు గాథలతో భగవద్భజనాన్ని చేసేటపుడు, వారి పార్శ్వంలో ఉండేవారై, శ్రుతులను కలుపుతున్నారని అర్థం.

**(కవిలోకవీరౌ)** - వేదాభ్యాసపరులై ఉన్నా, "వేదాభ్యాసజడః కథం ను విషయవ్యావృత్తకౌతూహల:" అనే విధంగా జడులై ఉండకుండా, నవరసభరితమైన కవిత్వాన్ని పల్కి, దానితో ఇతర కవుల కావ్యసమూహాలను జయించే రీతిలోని (పాండిత్య) వీరత్వాన్ని కలవారు.

**(ద్విజన్మవరపద్మశరౌ)** - ద్విజన్మవర బ్రాహ్మణశ్రేష్ఠులు, పద్మశరులు- క్షత్రియశ్రేష్ఠులు, పద్మమనే సంఖ్యను కల, శరః— శరాలను కలవారు, అసంఖ్యేయ బాణాలను కలవారని భావం.

**(ప్రియమిత్రే అభూతామ్)** - ప్రీతివిషయీభూతమిత్రులుగా, ప్రియమిత్రులుగా బ్రాహ్మణశ్రేష్ఠులు, క్షత్రియశ్రేష్ఠులు అయ్యారో— అని భావం వీరు శ్రీవైష్ణవాగ్రేసరులు కనుక కులశేఖరులకు ప్రియమిత్రులయ్యారు. వీరిని మంత్రి మొదలైనవారు హారచౌర్యం చేశారని నేరం ఆరోపిస్తూ చెప్పగా, వీరు చౌర్యం చేయరని అంటూ సర్పం ఉండే కుండలో ఆళ్వార్లు చేయిపెట్టి శపథం చేశారు.

**(అంబుజాక్షచరణాంబుజషట్పదేన)** - భ్రమరం తామరపూవులోని తేనెను అంతా పానం చేసేటట్లు, పుండరీకాక్షుని చరణారవిందానుభవం పొందినవారైన,

**(తేనేత్యాది)** - ఆ కులశేఖరులనే భూపాలురచే ఈ ముకుందమాల అనుగ్రహించబడింది— అని అర్థం. దీనివల్ల వక్తృవైలక్షణ్యం తెలుపబడి నట్లుయింది.

**శ్రీవాసముని పాదాబ్జ భ్రమరాయితచేతసా ।**
**లిఖితా రంగనాథేన వ్యాఖ్యేయం విదుషాం ముదే ॥**

**వ్యాఖ్యానమ్ సంపూర్ణమ్**

